


# మార్గదర్శి దానికొక మార్గం చూపిస్తుంది.

భవిష్యత్తులో భద్రత కోసం వర్తమాన కాలంలోనే అన్ని ఏర్పాట్లూ చేసుకోవాలి అత్యంత తేలికగా లాభసాటిగా పొదుపు చేసే విధానం మార్గదర్శి చూపిస్తుంది.
మార్గదర్శి అందించే రకరకాల చిట్ పథకాల్లో మీకు నచ్చినదాన్ని ఎన్నుకోండి మీరు పొదుపు చేసేడబ్బు దివి డెండ్లు సంపాదిస్తూ నిర్ణీతకాలం వరకూ పెచ్చుతూ ఉండడం గమనించండి ఊహించని అవసరం ఏదయినా హఠాత్తుగా వచ్చినా ఆ మొత్తం మీ అందు బాటులోనే ఉంటుంది. డివిడెండ్లు మినహా నెలసరి వాయిదాల్లో మొత్తం చెల్లించే అవకాశం ఉండనే ఉన్నది.

**మార్గదర్శి**
చిట్ ఫండ్ ప్రైవేటు లిమిటెడ్

మార్గదర్శి హౌస్ అబిడ్ సెంటర్, హైదరాబాద్ - 500 001

డబ్బు కోసమేనా ఏమా చింత - మార్గదర్శి వున్నది మీ చెంత'

శాఖలు.

●అబిడ్ సెంటర, హైదరాబాద్ ●లక్డీకాపూల్, హైదరాబాద్ ●చిక్కడపల్లి, హైదరాబాద్ ●అమీర్‌పేట, హైదరాబాద్ ●చంద్రలోక్ కాంప్లెక్స్, సికిందరాబాద్ ●ఏసెంట్ రోడ్, విజయవాడ ●బందరు రోడ్, విజయవాడ ●మెయిన్ రోడ, గుంటూరు ●మెయిన్ రోడ్డు, కాకినాడ ●ఇన్నిసుపేట, రాజమండ్రి ●నెహ్రూ రోడ్, కర్నూలు ●మెయిన్ రోడ్, విశాఖపట్నం ●జె. పి. ఎన్. రోడ్, వరంగల్

KIRON MCF/8102



శ్రీ వెంకటేశ్వరుని దివ్య చరణాలకు 'అంజలి'
సమర్పించు దివ్యాంజలి ఇది.
ANJALI®
Pooja Box
ప్రతి 'అంజలి' పూజ పెట్టెలోని విశిష్టమైన ఏర్పాట్లు
1. నిత్యందర్శనం చేసుకొనేందుకై శ్రీ పద్మావతీ వెంకటేశ్వర స్వామి వార్ల దివ్య చిత్రాలు
2 సుమదుర సుగంధాల చందనపు పరిమళాలు
3 పుస్తకంలా చేతిలో ఇమిడే సౌలభ్యం.
4 ఇంటా బయటా ఎక్కడున్నా చేత దరించి వెంట తీసుకుని వెళ్ళగల సౌకర్యం
5. నాల్గు అరలతో గాలి చొరబడకుండా దిట్టంగా అమర్చ బడిన మూత.
6, తేలికగా ఉంటూ దృఢంగా తయారు చేయబడ్డ నిర్మాణం
ఉచితం
ప్రతి అంజలి పూజ పెట్టెతోను ఉచితంగా పది 'అంజలి' అగర్ బత్తీలు, రంగుల్లో మనోహరంగా ఉండే తిరుమల సుందర దృశ్యాలు అందిస్తున్నాం
ఆంధ్రప్రదేశ్ కు డిస్ట్రిబ్యూటర్లు: మహావీర్ ఎంటర్ ప్రైజెస్, 4-1-938, తిలక్ రోడ్, హైదరాబాద్-500001, ఫోన్:3481
డిస్ట్రిబ్యూటర్లు: ఇంటర్ నేషనల్, 56, పురశవాక్కం హైరోడ్, మద్రాసు-600007, ఫోన్: 32234.
35 కుంభార్ పేట్, బెంగుళూరు-560002, ఫోన్ : 24310.


నవత సినీ ఆర్ట్స్
త్యాగయ్య
కలర్
రచన:
ముళ్లపూడి వెంకటరమణ
సంగీత పర్యవేక్షణ.
కె.వి.మహదేవన్
దర్శకత్వం:
బాపు
నిర్మాత:
ఎస్. కృష్ణంరాజు
అన్నపూర్ణ

# ఆంధ్రపత్రిక

## దుర్మతి నామ
## సంవత్సరాది సంచిక

[డెబ్బది ఒకటవ సంచిక]

[1981–'82]

వ్యవస్థాపకులు : శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

[1938–'72]

సంపాదకుడు : శివలెంక రాధాకృష్ణ

వెల రూ. 3–50

ఆంధ్రపత్రికా కార్యాలయమున ముద్రితము

**Supplement to Andhra Patrika Issue Dated 5-4-'81**

**Regd. No. H/VJ No. 49.**

దుర్మతి నామ సంవత్సరాది సంచిక

# విషయానుక్రమణిక

సంచిక 71 సంవత్సరము 1981-'82



ముఖచిత్రం: కోలాటము

శ్రీ వై. బాలయ్య

# స్వ విషయం

## కొత్త సంవత్సరం: పాత సమస్యలు

దుర్మతినామ సంవత్సరం మొదలయ్యే సరికి భారత ఉప ఖండంలో ప్రచ్ఛన్న యుద్ధం తీవ్రత పెరిగే సూచనలు కనిపిస్తున్నాయి. అమెరికా సంయుక్త రాష్ట్రాలలో కలిగిన కొత్త చైతన్యాల ఫలితంగా శ్రీ రోనాల్డ్ రీగన్ అధ్యక్షుడుగా ఎన్నిక అయినట్లు రాజకీయ వ్యాఖ్యాతలు చెబుతున్నారు. శ్రీ రీగన్ అవలంబిస్తున్న వైఖరి ప్రచ్ఛన్న యుద్ధ తీవ్రతని అధికం చెయ్యగలవనిపిస్తుంది. కీ. శే. జాన్‌ఫాస్టర్ డల్లెస్ కాలంలో అమెరికా, ఆసియాలు చేసుకున్న సైనిక ఒప్పందాలు ఇంచుమించు అన్నీ విఫలం అయ్యాయి. శ్రీ రీగన్‌మళ్లీ పాకిస్తాన్‌ని ఆదరించి ఆ దేశానికి ఆయుధ సహాయాన్ని అందజేస్తున్నారు.సోవియట్ యూనియన్ సేనలు ఆఫ్గనిస్తాన్‌ని ప్రవేశించిన తరువాత ఈ ప్రాంతంలో రష్యా ప్రభావాన్ని ప్రతిఘటించాలన్న కోరిక అమెరికా వారికి కలగటంలో ఆశ్చర్యం లేదు. కాని, పాకిస్తాన్‌లో అధికారంలో ఉన్నవారు తమకి అందిన ఆయుధ సహాయాన్ని దుర్వినియోగం చెయ్యటానికి వెనుదియ్యరని గుర్తుచేసుకోవాలి. తటస్థ విధానం సయితం నేటి పరిస్థితులలో అంతగా ఉపయోగపడేట్లు కనిపించదు. మిగిలిన ఆర్థిక సమస్యలతో బాటు చమురు కొరత కూడా భారతదేశాన్ని పీడిస్తోంది. సైనిక వ్యయం మితిమీరితే ఇబ్బందులు ఇంకా అధికం అవుతాయి. భారతదేశంలో అధికారంలో ఉన్నవారు తమ విధానాలలో మౌలికమయిన మార్పులు తీసుకురావాలి. ఎప్పుడూ ఒకేరకం వినాదాలని వల్లిస్తూ ప్రయోజనం లేని పద్ధతులని అవలంబించటం మంచిదికాదు పోలాండు, చీనా వంటి దేశాలలోనే ఏర్పడుతున్న పరిణామాలు ఆలోచనలని రేకెత్తించేట్లుగాఉన్నాయి. వ్యక్తి స్వాతంత్ర్యాలని అణచివేసే విధానాలు విఫలం అయి తీరుతాయి. ప్రజాస్వామ్య వ్యవస్థ కల ఆసియా ఖండపు దేశం జపాన్ పారిశ్రామికోత్పత్తి విషయంలో ప్రపంచంలోనే ప్రథమస్థానాన్ని ఆక్రమించేట్లు ఉంది. తలసరి ఆదాయం, జీవన ప్రమాణాలని తీసుకుంటే ప్రజాస్వామ్య పద్ధతులని అవలంబించే దేశాలదే పయిచెయ్యిగా ఉంటోంది. జనసామాన్యం యొక్క మెడలు వంచటానికి ప్రయత్నించటంకన్నా వారి సహకారంతోనే అభివృద్ధి సాధించటం మంచిదనటంలో సందేహంలేదు. దుర్మతినామ సంవత్సరంలో భారతదేశాన్ని పీడిస్తున్న సమస్యలు ఎన్నో పరిష్కారం కాగలవని ఆశించాలి.

# ఉ గా ది

## శ్రీ వఝ్ఝల కాళిదాసు

కవోష్ణ ప్రభాత కిరణానుషంగంలా,
నవోఢా మధుర గాఢ పరిష్వంగంలా,

నింబ కుసుమ నిర్గత తిక్తంబుల్
ఇక్షుకాండాంతర్గత మాధుర్యంబుల్
తింత్రిణీ ఫల సంభరిత శుక్తంబుల్
రసాల శలాటు స్ఫురిత కషాయంబుల్,

చతుస్సంప్రదాయ సంపదలూ
చతురంగాతిరంగా సంతరించుకొని,

పలకరిస్తోంది ఉగాది
నవ్వులు
చిలకరిస్తున్నది ప్రోది!

ఆద్యంత రహిత
కాల వలయ సంక్రమణానికి
చోద్యంగా
కల్పితమైన ఆది ఉగాది
గతాన్ని పూర్తిగా మరుద్దాం
ఆ గతానికి రాచబాట పరుద్దాం!

శిశిరంలో మోడైన భూమిని
చిగురింప జేస్తోంది ఆమని
చిరునవ్వులు చిందిస్తూ
సింగారం అందిస్తూ!

ఆరోగ్యం ఆనందం
ఆత్మీయత అనుబంధం
అందరికీ తేవాలి ఉగాది
హాయికి కావాలి ఆది!

తెలుగువారి గృహాల్లో
వెలుగులు విరియిస్తూ
తెలుగువారి పలుకుల్లో
తేనెలు కురిపిస్తూ

వయారంగా సుతారంగా
మయూర పింఛ వర్ణాలతో
వినూత్న హరిత పర్ణాలతో
అఖిలాంధ్రాంత రంగాలలో
ఆవిర్భవిస్తుంది ఉగాది!

మానవతకి ఆలంబంగా
దానవతకి ఉరికంబంగా,
సౌదర్యానికి సోపానంగా
వైరుధ్యాలకి శ్మశానంగా,

సర్వంసహనే మార్చాలి ఉగాది
సర్వ సమతకి వేయాలి పునాది!

ఈ ఉగాది శుభోదయ హేలా
లీలా సంరంభోత్సాహ వేళ
నిశ్చలమైన బుద్ధితో
నిర్మల మనశ్శుద్ధితో
దీక్షా కంకణం ధరిద్దాం
దృఢ సంకల్పంతో ఆచరిద్దాం

'మానవ సౌభాగ్యం మన ధ్యేయ'మని
'మానవతా ధర్మం మన దైవ'మని!

డాక్టర్ ఘంటా జవహర్‌లాల్

# విలక్షణమైన మహావీరశిల్పం

మనదేశంలో బహు వ్యాప్తిగాంచిన అతి ప్రాచీన మతములలో జైన మతం ఒక్కటి అట్లే జైనమత శిల్పకళకు కూడ మనరాష్ట్రం కాణాచియే కాని బౌద్ధమతంకు కలిగిన పరిశోధనా ప్రచారములు జైనమతముకు జరుగలేదు. కావున నేడు మనం ఆంధ్రదేశంలో జైన మతం సాగించిన జైత్రయాత్ర తెలుసుకోలేకున్నాం. చారిత్రకాంశము లను పరీక్షించి చూడగా ఆంధ్రదేశంలో బౌద్ధమతం కన్నా జైన మతమే ఎక్కువ ప్రజాదరణ, రాజాదరణ పొందినదని రూఢియగు చున్నది ప్రజలకోరికపై నాటి రాజులు జైనాలయములకిచ్చిన దాన ముల వివరణలెలుపు జైన శాసనములు మన రాష్ట్రంలో పెక్కు బయల్పడినవి. జైనగురంపై ప్రజల ప్రగాఢ విశ్వాసము తెల్పు కొనుటకీ శిలాశాసనాలు గీటురాళ్ళు

ప్రస్తుత శిల్పం ఆంధ్ర రాష్ట్రంలోని అనంతపురం జిల్లా పెనుగొండనందుగల అజితనాథజినాలయం 'అంతరాలం'లో నుండగా నాదృష్టి నాకర్షించినది. ఈ విగ్రహంలోని తీర్పు, నగిషనం అసా ధారణమైంది గాను, ఉత్సుకతను కలిగించేదిగాను ఉంది. ఇప్పటి యీ పెనుగొండ ఒకప్పుడు ప్రసిద్ధిగాంచిన జినక్షేత్రం. నాటి స్థితికి చిహ్నంగా అజితనాథ, పార్శ్వనాథ జినాలయాలు రెండు నేటికీ పెనుగొండలో నిల్చియున్నవి ఆంధ్రదేశంలో జైనమత ప్రాచీనత అస్పష్టరేఖగా ఉన్నప్పటికీ క్రీ. శ. 12వ శతాబ్దంతానికి, ఇది ఈ రాష్ట్రంలోని మారుమూల గ్రామాలకు కూడా వ్యాపించినట్లు చారిత్రికులచే గుర్తింపబడింది. ఆంధ్ర పాలకులు ఇతర మతాల కళలతో సమానంగా నిష్పాక్షికంగా జైనకళనూ పోషించినట్లు తెలు స్తూంది. దీనికి తార్కాణం దేశం నలువైపులా బయల్పడిన జినావ శేషములు, జినాలయములే !! భారతదేశంలో ఆంధ్రదేశం కూడా జైన శిల్పకళకు ప్రసిద్ధిగాంచిన రాష్ట్రాలలో ఒక్కటి.

జైనమతం ఋషభనాథుడు—మహావీరుడు ఆద్యంత తీర్థం కరులుగా గల ఇరవైనాలుగు మంది తీర్థంకరులతో విలసిల్లినట్లు జైనుల దృఢమైన నమ్మకం ఈ తీర్థంకరులు [1] కామక్రోధాది అరిషడ్వర్గములను జయించిన జితేంద్రియులుగా పరిగణింపబడి 'జినులు'గా గుర్తింపబడినారు. ఈ 'జినుల'చే బోధింపబడిన మతం గాన జైనమతంగా పేరుపొందింది హిందూమతంలో దశావతారముల కున్న ప్రాముఖ్యం జైనమతంలో ఈ ఇరవైనాలుగు తీర్థంకరులకూ ఉన్నది. అనగా జైనమతంలో ఈ తీర్థంకరులే 'మహాపురుషులు'.

ఇక ఈ తీర్థంకరుల ప్రత్యేక లక్షణాలను పరిశీలిద్దాం. తీర్థం కరుడు సాధారణంగా దైవాంశ సంభూతుడు. కాని జైనసాహిత్యంలో తీర్థంకరునికి అనేకంగా నిర్వచనాలున్నాయి. సామంతభద్రుని బృహత్స్వయంభు స్తోత్రం [2] ప్రకారం మానవులందరూ చేరుకొనే, దుఃఖోపశమ క్షేమమైన శబ్దానికి 'ధర్మ' అని అర్థం విశదీకరించే (లేక వ్యాఖ్యానించే) వాడు తీర్థంకరుడు. దీన్ని బ జైనమతంలో వారు ఉత్తమోత్తము దేవతలని, సర్వసంగపరిత్యాగు (వాంఛా విదూరులని) జినాభిమానులు నమ్మినట్లు తెలుస్తూం హేమ చంద్రుని అభిదాన చింతామణి [3] ప్రకారం జైనదేవగ దేవాదిదేవులు (లేక విశిష్టదేవతలు), దేవులు (లేక సామాన్యదేవత అని రెండు వర్గాలుగా విభజింపబడింది. జైన తీర్థంకరు 'దేవాదిదేవ' వర్గంలో ఉంటారని వేరే చెప్పవలసిన అవసరం లే లెక్కిన వాళ్ళు రెండవ వర్గంలో ఉంటారు. రెండవ వర్గంలో దేవతలు అర్వాచీన కాలంలో జైనదేవ గణంలో స్థానం సంపాదించి



మహావీరశిల్పం, అజితనాథదేవాలయం,
పెనుగొండ (అనంతపురంజిల్లా.)

హిందూ దేవుళ్ళే. జైనుల ప్రకారం, హిందూ దేవతలు స్వర్గవాసులైనందువల్ల, సంగరహితులు కారు కాబట్టి వారు సామాన్య దేవతలే [4] జైన శిల్పకళ చరిత్రను పరీక్షించిన, అతి ప్రాచీనకాలంలో జైన విగ్రహాలు రాతిమీద సంపూర్ణంగా, ఎత్తుగా చెక్కబడేవని తెలుస్తున్నది. తర్వాత జైనమతంలో చాలా మార్పులు చోటుచేసుకొన్నది. కాఠిన్యత కొంత సడలింపబడినట్లు తెలుస్తుంది. అందుక్కారణం, ఒక్క మాటలో చెప్పాలంటే, ఇతర మతాల పోటీకి తట్టుకోవలసి రావడమే. ఈ సడలింపు అన్నికళల్లోను ప్రతిబింబిస్తున్నది. తర్వాత జైనులు తమ కాలానికి అనుగుణంగా మలచుకోవడం నేర్చుకొన్నారు. హిందూ శిల్పాల్లోలాగే వీరు మూల నాయకుని శిల్పాలు చెక్కించుకున్నారు. ఆ మూల నాయకుడుగా ఋషభనాథుడు గాని, పార్శ్వనాథుడు గాని, మహావీరుడు గాని వుంచి ఇతర జైనులచేత పరివేష్టింపబడి ఉంటారు. పెనుగొండలో నేటి శిల్పం ఈ రకానికి చెందినది. ఇక్కడ ఒక జినుడు దిగంబరంగా, కాయోత్సర్గ భంగిమలో చెక్కబడ్డాడు. తక్కిన ఇరవై ముగ్గురు జైనులు ఇతని చుట్టూ వున్నారు. ఆ జైనుని పాదాల వద్ద ఇద్దరు చామరాలు ధరించి ఉన్నారు. జైనుల సంప్రదాయ చిహ్నమయిన 'త్రిఛత్రము' జైనుని తలపైన చెక్కబడినది. అడుగున సింహం మలచబడింది.

తీర్థంకరుల చిత్రాలు శుద్ధంగా మానవుల్లాగే ఉండటం ఇక్కడ గమనించదగ్గ విషయం. అసాధారణమైన అనేకంగా కండ్లు, తలలు, చేతులు హిందూ దేవుళ్ళా వీరు ప్రదర్శించరు. ప్రాచీన, మాధ్యమిక పరిశోధన గ్రంథాలు జైన విగ్రహాల లక్షణాలను పేర్కొన్నవి. వరాహమిహిరుని 'బృహత్సంహిత' ప్రకారం అర్హతుల (జైనుల) దేవతలు దిగంబరంగా ఉండాలి. యుక్తవయస్కు కలిగి సౌందర్యవంతులుగా కనబడాలి. ముఖం ప్రసన్నంగా ఉండాలి. ఆజానుబాహువై ఉండాలి. వక్షస్థలం శ్రీవత్స గుర్తు కలిగి ఉండాలి.[5] 'మానసార' ప్రకారం దిగంబరత్వం, శ్రీవత్స చిహ్నం, ఆజానుబాహువులు, ధ్యానభంగిమ మొదలైనవి జైనశిల్పలక్షణాలు.[6] 'ప్రతిష్ఠాపాద' [7] లో తీర్థంకరుడు ముసలివాడుగా గాని, పసిపిల్లవాడుగా గాని కాక యువకుడుగా చిత్రింపబడాలని కూడా పేర్కొనబడినది. శ్రీవత్స చిహ్నం వక్షస్థలం మీద ఉండాలి. కాని డా. సి. శివరామమూర్తి [8] గారు దక్షిణ భారతదేశంలోని తీర్థంకరుల ప్రతిమల్లో ఈ చిహ్నం లేనట్లు పేర్కొన్నారు. కాని హైదరాబాదులోని రాష్ట్ర పురావస్తు ప్రదర్శనశాలలోని లోహ నిర్మితమైన జైన ప్రతిమల్లో ఈ ప్రత్యేకమైన శ్రీవత్స చిహ్నం కనబడుట గమనార్హం. ఈ జైన లోహ ప్రతిమలు బాపట్లలో లభ్యమైనవి.

కొన్ని తీర్థంకర శిల్పాలు ముఖ్యంగా కూర్చున్నట్లు చెక్కబడినవి, జాగ్రత్తగా చూడకపోతే వానిని బౌద్ధ శిల్పాలుగా భ్రమించే ప్రమాదం ఉంది. జైన శిల్పాలు బౌద్ధ శిల్పాల నుండి, జైన తీర్థంకరులలోనే ఒకరి నుండి ఇంకొకరిని విడదీసి కనుగొనడం చాలా కష్టం. ఈ క్రింది కనబరచిన విషయాలను గుర్తుంచుకొన్న, ఈ పొరపాట్లను కొంతవరకధిగమించవచ్చు. పైన పేర్కొన్న లక్షణాలే కాక, జైన శిల్పాలు దిగంబరంగా ఉంటూ పద్మాసనంలోను (కూర్చున్న భంగిమ) కాయోత్సర్గలోను (నిశ్చలంగా నిలబడిన భంగిమ) ఉంటాయని తెలుసుకోవాలి జైన బౌద్ధ శిల్పాల మధ్య ఒక సహజ లక్షణం ఉండటం నిజమే జైనశిల్పం వక్షస్థలం మీద శ్రీవత్స చిహ్నంతో పాటు, తలమీద "త్రిఛత్రం" విధిగా ఉంటుంది బౌద్ధ శిల్పంలో ఈ "త్రిఛత్రం" గుర్తు ఉండదు. తర్వాత ఇరవై నలుగురు తీర్థంకరులకు ఇరవై నాలుగు గుర్తులుంటాయి. ఇంకా ఇరవై నలుగురు యక్షులుగాని, యక్షిణులు గాని ఉంటారు. సామాన్యంగా ఈ గుర్తులు జైనశిల్పాల పాదాలదగ్గర చెక్కబడి ఉంటాయి. ఇరవై నలుగురు తీర్థంకరుల (చిహ్నాలు) గుర్తులు, యక్షులు, యక్షిణుల వివరాల పట్టిక [రూపమండనం [9] ఆధారంగా] క్రింద ఇవ్వబడింది.

| క్రమ సంఖ్య | తీర్థంకరుడు | చిహ్నం | యక్షుడు | యక్షిణి |
|---|---|---|---|---|
| 1 | ఋషభ | వృష | గోముఖుడు | చక్రేశ్వరి |
| 2 | అజిత | గజ | మహాయక్ష | అజితబాల |
| 3 | సంభవ | అశ్వ | త్రిముఖ | దురితారీ |
| 4 | అభినందన | కపి | యక్షేశ్వర | కాళికా |
| 5 | సుమతి | క్రౌంచ | తుంబురు | మహాకాళీ |
| 6 | పద్మప్రభ | రక్తబీజ | కుసుమ | శ్యామా |
| 7 | సుపార్శ్వ | స్వస్తిక | మాతంగ | శాంత లేక శాంతి |
| 8 | చంద్రప్రభ | శశి | విజయ | భృకుటి |
| 9 | సువిధ | మకర | జయ | సుతారికా |
| 10 | శీతల | శ్రీవత్స | బ్రహ్మ | అశోకా |
| 11 | శ్రేయాంశ | గండక | యక్షేట్ | మానవీ |
| 12 | వాసుపూజ్య | మహిష | కుమార | చండీ |
| 13 | విమల | సూకర | షణ్ముఖ | విదితా |
| 14 | అనంత | శ్యేన | పాతాళ | అంకుశీ |
| 15 | ధర్మ | వజ్ర | కిన్నర | కందర్పీ |
| 16 | శాంతి | మృగ | గరుడ | నిర్వాణీ |
| 17 | కుంథ | ఛాగ | గంధర్వ | బలా |
| 18 | అర | నంద్యావర్త | యక్షేట్ | ధారిణీ |
| 19 | మల్లి | ఘట | కుబేర | ధార్మప్రియా |
| 20 | ముని | కూర్మ | వరుణ | నాదరత్తా లేక నారదత్తా |
| 21 | సువ్రత | నీలోత్పల | భృకుటి | గంధర్వ |
| 22 | నేమి | శంఖ | గోమేధ | అంబికా |
| 23 | పార్శ్వ | ఫణి | పార్శ్వ | పద్మావతీ |
| 24 | మహావీర* | సింహ | మాతంగ | సిద్ధాయికా |

ప్రస్తుత శిల్పం సింహ చిహ్నాన్ని కలిగి ఉన్నందువల్ల ఆ శిల్పం సింహ చిహ్నితుడైన మహావీరునిదని నిర్భయంగా చెప్పవచ్చును. మన వాదానికి బలాన్నిచ్చే చిన్న శాసనం కూడా శిల్పానికి అడుగు భాగంలో ఉంది. శాసనం రెండు పంక్తులలో కన్నడ లిపి కల్గివున్నది.

ఇక ఈ శిల్పంను విలక్షణమైన జైన శిల్పముగా చెప్పడం ఎందుకు ? జైనులు, ఇరవైనలుగురు తీర్థంకరులు పద్మాసన, కాయోత్సర్గ భంగిమలలో ముక్తి పొందినట్లు నమ్మేలారు కాబట్టి జైన శిల్పాలన్నీ ఆ రెండు భంగిమల్లోనే చెక్కబడినవి. అంతేకాక, ఇరవైనలుగురు తీర్థంకరులలో ఋషభ, నేమినాథ, మహావీరులు మాత్రమే తామర పుష్పం మీద కూర్చొని ముక్తిపొందినట్లు, ఇతరులు కాయోత్సర్గ భంగిమలో ముక్తిపొందినట్లు కూడా జైనుల నమ్మకం. ఆ నమ్మకం ప్రకారం ఆయా శిల్పాలు—ఋషభ, నేమి, మహావీరులు కూర్చున్నట్లు, తక్కిన వారు నిల్చున్నట్లు చెక్కబడినాయి దీనికి వ్యతిరేకంగా ప్రస్తుత శిల్పంలో మహావీరుడు నిలబడి ఉన్నాడు ఈ అసాధారణ చిత్రణయే ఇదొక విలక్షణమైన శిల్పముగా నేను పేర్కొనుటకు నాంది పైగా జైన శిల్పాల్లో ఋషభ, నేమి, మహావీరులు మాత్రమే పద్మాసనంలోనూ, తక్కిన వాళ్లు నిశ్చలంగా నిలబడినట్లు చెక్కాలి అనే నియమం జైన శిల్పకళలో ఖచ్చితంగా అనుసరింపబడినట్లు గన్పడదు. ఉదాహరణకు, పార్శ్వ, సుపార్శ్వుల విగ్రహాలు రెండు భంగిమల్లోనూ మన రాష్ట్రంలో లభ్యమైనవి.

ఏది ఏమైనప్పటికీ, మహావీరుని ప్రతిమల్లో మాత్రం పై నియమం తప్పక పాటించినట్లు తెలుస్తోంది. కావున మహావీరుని ప్రతిమలు కూర్చున్నవే ఎక్కువ లభ్యమైనవి పెనుగొండ దగ్గర దొరికిన ప్రస్తుత శిల్పం మినహా, మరెక్కడా నాకు పై నియమానికి భిన్నంగా మహావీరుని శిల్పం మనరాష్ట్రంలో కనబడలేదు. కాబట్టి దీన్ని ఒక విలక్షణ శిల్పంగా నేను నిర్మొహమాటంగా పరిగణిస్తున్నాను. శిల్పం విలక్షణమైనా అపురూపంగా మలచటం గమనించదగినది.[10]

## ఆధారాలు


1 డి.యన్. శుక్లా : వాస్తుశాస్త్ర ,II, అధ్యా VIII పు 7.

2 సామంత భద్ర, బృహత్స్వయంభు స్తోత్ర, 9. ఏసప్రణితమ్, పృథు ధర్మతీర్థమ్ జ్యేష్ఠమ్ జనాః ప్రాప్యజయంతి దుఃఖమ్।

3 బి.సి. భట్టాచార్య, ది జైనా ఐకోనగ్రఫీ, పు 27

4 పైదే

5 బృహత్సంహిత, అధ్యా. 58, శ్లో 45.

6 జె.యన్ బెనర్జీ, డెవెలప్‌మెంట్ ఆఫ్ హిందూ ఐకోనగ్రఫీ; పు. 588.

7 ప్రతిష్ఠాపాద, శ్లో 151, 152.

8 ఏన్షియన్ట్ ఇండియా, నం 6 (జనవరి, 1954) పు. 44-46.

9 రూపమండన, పు. 98, 99.

10 ఇటువంటి అపురూపమైన జైన శిల్పాల ఉనికి ఎక్కడున్నా భారతి ముఖంగా తెలుపవలసిందిగా కోరుచున్నాను.


[1980, డిశంబరు, గుంటూరులో జరిగిన ఆంధ్రప్రదేశ్ హిస్టరీ కాంగ్రెసుకు సమర్పించిన నా ఆంగ్ల వ్యాసమునకు ఆంధ్రానువాదం.]

శ్రీ వంతరాం రామకృష్ణారావు

# ప్రయోగమూలం వ్యాకరణమ్

పై అభియుక్తోక్తి అందరికు సమ్మతమేగాని, ఎవరి ప్రయోగములు వ్యాకరణమునకు మూలమన్నది ప్రశ్న ఈ విషయములో లాక్షణికుల అభిప్రాయములను మొదట పరిశీలించవలసియున్నది.

## అహోబల పండితీయ మతము

అహోబల పండితీయ మతమున, నన్నయ ప్రయోగములు స్వతః ప్రమాణములు తిక్కనసారివి, అనగా తిక్కనాదుల ప్రయోగములు స్వతః ప్రమాణములు కావు. నన్నయ ప్రయోగ ప్రామాణ్యము గాని, చింతామణి వికృతి వివేకముల ప్రామాణ్యముగాని ఉన్నంతలోనే తిక్కనాదుల ప్రయోగములు సాధువులగును.

నన్నయ ప్రయోగములు స్వతఃప్రమాణములనుటకు —

1. వస్తుతస్తు ఆచార్యప్రయుక్తస్యైవ తదా ద్యుక వాక్యస్య ప్రాత న్యాయేన ప్రామాణ్యమన్యేషాంతు నైవ సాధుత్వమిత్యను సంధేయమ్. (అహో 259 పు)

2. తత్కృతు శరంబున కంటె సుతుండుమేలు... యది బహుపుస్తక స్థితత్వేన తత్సార ఏవాగః తర్హి తద్రూపే తిదేవ వచనం ప్రమాణమస్తు (అహో 431 పు)

నన్నయేతర కవి ప్రయోగములు స్వతః ప్రమాణములు కావనుటకు —

1. ఇత్యాద్యా స్సూరనాది కవిప్రయోగాః కథం సంగచ్ఛంతే ఇతి చేత్ అధర్వణోక్త్యా తత్సాధుత్వమవేహి. (అహో 251 పు)

2. రూప సాధుత్వంత్వా ధర్వణమితిజ్ఞేయమ్. ఏవంచ వృధా కోపింతురే (మను 4–425) సదానానన్, సర్వత్రనిలింప కామినుల (ఆముక్త 1–37) కర్తుమకర్తు మన్యథా కర్తుముదార శక్తివి. (రామా 3–62) — అహో 327 పు

3. తథాప్యధర్వణ వచనాను సరణేన, చంద్రుపాదుపున్నీరాక రంబున్ బవెన్ (పాండు 3–33) ఇత్యాది ప్రయోగస్సంగచ్ఛత ఏవ. (అహో 334 పు)

4. ఇత్యాదీనాం తిక్కయజ్వాది కవి ప్రయోగాహనాం కా గతి రితిచేత్...అధర్వణ వచన గత ప్రాయోగ్రహణ మహమ్నా తత్సాధుత్వ మస్తీత్యవధేయమ్. (అహో 337 పు)

5. ద్వితీయాచార్యేణతు అమహదుంతేఖ్యోపి వువర్ణా విహితః నైవ...ఇత్యాద్యాస్తిక్కయజ్వాది కవి ప్రయోగాః (అహో 341 పు)

6 తేన, తేటపసం గాంచెదం బంపుపన్నను సఖండ ప్రేమ సామగ్రితోన్ (వసు 2–76) ఇత్యాది ప్రయోగస్సాధుః (అహో 344 పు)

7 ధరా పరాగపటలాక్రాంతంబు మిన్నేటు (రఘువ 1–9) రూపంబా థయేతి సూత్రేణ సమంజసమితి జ్ఞేయమ్. (అహో 369 పు)

8 నిగమశర్మేత్యాదిజంబు రూపస్యటు.. అధర్వణోక్త్యైర ణమ్. (అహో 453 పు. నిగమశర్మ-పాండు 3-110)

9 ఇత్యాదీని తిక్కయజ్వాది కవి వచనానిచ. ఆచార్య వచన మహిమ్నా సౌష్ఠవం లభంతి ఇత్యవగంతవ్యమ్ (అహో 489 పు)

10 అపి శబ్దేన. అనునేల సుఖిత యూ ప్పార్థ గిల్లిచ పేటుము (మను 3–116) ఇత్యాది కవి వచనాం ప్రామాణ్యమవ్యాహతమ్ (అహో 492 పు)

11. సూత్రారంభేణతు... తిక్కయజ్వాది కవి ప్రయోగాస్సాధవః (అహో 517 పు)

12. వినాల వర్ణమిత్యనేన, తామరస నేత్రలిండ్ల బందాలు గారె (మను 2–73) ఇత్యాది ప్రయోగోపి సాధురితిజ్ఞేయమ్. (అహో 540 పు)

13. అధర్వణ వచనాత్... తిక్కయజ్వాది కవి వచనాని సాధూని. (అహో 542 పు)

14. అధర్వణ వచనాత్ క్వచిత్ పాటిలు, వర్తిలు — ఇత్యాదికం రూప మపి సాధు. తేన... అవతరిలితి (శృ. నై. 8–129) ఇత్యాద్యాని కవి వచనాని వ్యాఖ్యాతాని. (అహో 603 పు)

నన్నయాధర్వణ సమ్మతి లేదని తోచినప్పుడు, తిక్కనాదుల ప్రయోగముల సాధువులనుటకు—

1. ఇత్యాది పద్యేషు పోతన్న సూరన్న ప్రముఖైః కైశ్చిదుభయోర్మైత్రీ ప్రోక్తా సానా కరత్వాద ప్రామాణికేతి సుధీపురోగైరను సంధేయమ్ (అహో 196 పు)

2. ఇత్యాదిషు జైమిని భారతాద్యుక్తేషు సమాస్తాస్వత్వ మసంగతమేవ. (అహో 255 పు)

3. త్రిమూర్తి విలాస వర్తివిమ్ (రామా 3–62) ఇతి రూపం త్వసంగతమేవ. (అహో 273 పు)

4 ప్రచేరసకుక్–ఇతి భాస్కరోక్తిర సంగతైవ పంటుకు పన్పు (పారిజా 1–80) ఇత్యత్రవంతఃనకెక్క ఇత్యేవ పారః సాధుః (అహో 308 పు)

5 తల్లిం దండ్రియు నెప్పుగానక (మను 3–98) ఇత్యాది ప్రయోగస్త్వనాకరత్వాదుపేక్ష్య ఏవ. (అహో 334 పు)

6 ఇత్యాది కవితా పిలామహోద్యుక్తిస్తు నిర్మూలైవ (అహో 364 పు)

7. నన్నుంజూడం జనుదేలెన్నాళ్లనోయండి (పాండు 3–33) ఇతి రూపంత్వ సంగతమేవ (అహో 426 పు)

8 పవార్యన్నియ పట్టు పుట్టము (శృ నై. 6–53) ఇత్యాది వచన మసంగతమేవేత్యవధేయమ్ (అహో 432 పు)

9. కృష్ణవర్త్మకు (వసు 4–36) ఇత్యాది కవి వచన మనాకరమేవ (అహో 453 పు)

10 అప్పు పాలైన [నరస 1–67] అప్పునని [వసు 1–36] ఇత్యాదయః కవిప్రయోగాస్తు న సాధవః

[అహో 457 పు]

11. ఆయాల పంబయివేళం బల్కెడు [మను3–57] నిత్యాది కవిప్రయోగస్తాతీవ దుష్టతేతి బోధ్యమ్.

[అహో 474 పు]

12. పాండుభూవరునకుం గోడలై తి [ఉద్యో 3–108] నిత్యాది వచనం త్వనాకరమేవ. [అహో 500 పు]

13. నన్నపార్యునిని [రాఘవ 1–4] ఇతి సూరకవి పద్యే నన్నపండితుని నిత్యేవపారః సాధుః [అహో 543 పు]

14. ఏతేన,. .పనిగొంట ..[శృ. నై. 3–126] ఇత్యాది వచనస్య ప్రామాదికత్వమేవేత్యవధేయమ్. [అహో 613 పు]

15. ఇత్యాదీనాం భాస్కర తిక్కయజ్వాది కవి వచనానాం కిం మూలమితి వయం నవిద్మః. [అహో 613 పు]

## కవిరాక్షస మతము

నన్నయ భారత భాగములోని ప్రయోగములే సర్వథా గ్రాహ్యము లనియు, తద్విరుద్ధ ప్రయోగములు గ్రాహ్యములు కావనియు దక్షవాటి కవి రాక్షసుడు నియమించినట్లు క్రింది అప్ప కవీయమువల్ల తెలియు చున్నది.

"ఆదిని శబ్దశాసన మహాకవి చెప్పిన భారతంబులో
నేది వచింపఁగాఁబడియె నెందును దానినె కాని సూత్ర సం
పాదన లేమిచే దెనుఁగు పల్కు మఱొక్కటిఁ గూర్చి చెప్పఁగా
రాదని దక్షవాటికవి రాక్షసుఁడీ నియమంబుఁ జేసినన్.

"ఆ మూఁడు పర్వములలో
నా మాన్యుఁడు నుడువు తెనుఁగుఁ గొలసికొని కృతుల్
దాము రచించిరి తిక్కయు
ధీమణి మొదలైన లేంటి తెనుఁగు కవీంద్రుల్

[అప్పక. పీఠిక 46, 47 ప]

## అప్పకవీయ మతము

నన్నయ భారత భాగమునకు, ఆంధ్రశబ్ద చింతామణికి, విరుద్ధము కానంతలోనే నన్నయేతర కవుల ప్రయోగములు సాధువులని అప్పకవి తలంచినట్లు కనబడును. "నిత్యము నుత్తమ పురుష క్రియా స్వితః" అను చింతామణి సూత్రమునే ప్రథమ మధ్యమ పురుషక్రియే కార సంధి నిత్యము. ప్రథమ పురుషక్రియేకారమునకు తిక్కనాదులు వైకల్పికసంధి ప్రయోగించియున్నారు ప్రథమపురుష క్రియేకారము నకు సంధి మానినందుకు శ్రీనాథుని అప్పకవి యిట్లాక్షేపించినాడు.

"విరచించెను శ్రీనాథుఁడు
ధరణిని శృంగార నైషధంబునఁ గూర్చుం
డిరి యొండొరునని కానక
పరపురుష క్రియలం బ్రకృతి భావముఁగలదే. [అప్పక 5–64]

ప్రథమ పురుష క్రియేకారమునకు సంధి వికల్పమన్న అథర్వణ కారికనుబట్టి అప్పకవి ఆక్షేపణ సరికాదని అహోబల పండితుడిట్లు వ్రాసినాడు.



"ప్రథమే చోత్తమే చైవ, క్రియేలో వాచివేప్యులి: .
ఇతి ప్రదమ పురుషే సంధేర్వికల్పమాహ. అత ఏవ .శ్రీనా
థాది ప్రయోగాస్సంగచ్ఛంతే కాకుసూర్యప్రకవిస్తు ఏతద్గ్రంథ
సంపాదవ వైదుర్యేణ శ్రీనాధస్య భ్రాంతత్వమాహ"
[అహో 231 పు]

# బాలవ్యాకరణ మతము

సాధారణ లక్షణ పరిజ్ఞానమును బాలురకు కలిగించవలెనన్న ప్రణాళికతో, చింతామణిభారత ప్రయోగములను ముఖ్యముగాదృష్టిలో పెట్టుకొని రచించిన గ్రంధము బాలవ్యాకరణము. కనుకనే వికృతి వివేకము [ఆధర్వణ కారికావళి]లోని పెక్కు లక్షణ విశేషములు, భారత భారతేతర ప్రయోగములు పెక్కులుపేక్షితములయినవి జీవగఱ్ఱ, గంగనుకాసె, ఏమియేమి, నమ్మికిట, పేరుటరము, సరస పుందనము, దాసోహనునె, గలాను గతికో లోకోయటంచున్,బుత్త్విక్కు, మరుత్తు, జగత్తు, కృష్ణవర్త్మ, యువ, యజ్వ, ఇంద్రజి పిప్పళ్లు, కలంకు, ఆకర్ణింపుదురు, వండుకొనియె, వినకురె, వంటి భారత ప్రయోగ ప్రామాణ్యములేని భారతేతర కావ్యప్రయోగములు బాల వ్యాకరణమున సమ్మతించబడినవి లాక్షణిక వచనములను ప్రమాణీకరించి, యాళురు, దాత్రుడు, హనుమానుడు, భగవానుడు, పురోధనుడు, లోనగురూపము లంగీకరించబడినవి. వీటికి కవి ప్రయోగములు కన బడవు. ప్రాచీన బాషాదృష్టితో కొన్ని భారతేతర కావ్యప్రయోగములు బాలవ్యాకరణములో ఇట్లు నిరసించబడినవి.

1. "కూతురులు, కూతుళ్లు, కూతురి నిత్యాది రూపంబులు గ్రామ్యంబులని యెఱుంగునది". [బా. ఆచ్ఛిక 9]

2. "వనమునుంచి, ధనమునుంచి యనియుంచి శబ్దాను ప్రయోగంబుతోఁ గొందఱు వ్యవహరించెదరు గాని యది సాధుకవి ప్రయోగా రూఢంబు గాదని యెఱుంగునది"
[బా. కారక 11]

3. "చేతురు కోతురిత్యాదుల సాధువులని యెఱుఁగునది."
[బా. క్రియా 108]

# ప్రౌఢ వ్యాకరణ మతము

బాలవ్యాకరణమున లెక్కని అసాధారణ లక్షణ విశేషములను పూరించవలెనన్న ఉద్దేశముతో, భారతాది గ్రంథ పరిశోధనమువలన లభించిన విశేష లక్షణ ప్రయోగములను క్రోడీకరించి, బాలవ్యాకరణమునకు వార్తిక స్థానీయముగా, రచించిన గ్రంధము, ప్రౌఢ వ్యాకరణము. ఇందు భారత భారతేతర కావ్యప్రయోగములు పెక్కు సాధించబడినవి. కాని, కొన్ని భారతేతర కావ్యప్రయోగములు ప్రౌఢ వ్యాకరణమున ఇట్లు నిరసించబడినవి.

[1] "అన్నలో, యేమంగులో అని ప్రయోగములు కానఁబడుచున్నవి గాని వానికిఁ బ్రామాణిక ప్రయోగములు కానంబడవు." (ప్రౌఢ. శబ్ద 14) ఇవి కొరవియొలచి తిమ్మకవి ప్రయోగములు.

[2] "ఈ కవి పాపజాలి కాస, లని ప్రయోగించినాడు .అది విచార్యము" (ప్రౌఢ. శబ్ద) ఇది చేమకూర వేంకటకవి ప్రయోగము

[3] "ఒకానొకకవి యిందుఁ గొన్నిటి నేకవచనాంతములుగాఁ బరించియున్నాఁడు అది విచార్యము" (ప్రౌఢ శబ్ద 38) ఇది ధూర్జటి ప్రయోగము నుద్దేశించి చేసిన ఆక్షేపణ.

# వ్యాకరణ సంహితా సర్వస్వమతము

భారత ప్రయోగములను, సోమనాథ శ్రీనాథాది కవిత్రయేతర మహాకవుల ప్రయోగములును సాకల్యముగ ప్రమాణములన్నది వ్యాకరణ సంహితా సర్వస్వమతము. చింతామణి వికృతి వివేకము లకు విరుద్ధము లగు సామాన్య కవిప్రయోగములు సాధువులుకావు పూర్వోక్త మహాకవి ప్రయోగములు మాత్రమే యిట్టిచోట్ల లక్షణ నిర్ణయమును కుపకరించును.

# ముక్తలక్షణ కౌముదీమతము

ప్రౌఢవ్యాకరణముతోపాటు, బాలవ్యాకరణమునకు వార్తిక స్థానీయముగా రచితమయిన గ్రంధము, ముక్తలక్షణకౌముది. ఇందు భారతేతర కావ్యప్రయోగముల కితోధిక ప్రామాణ్యము సమ్మతించబడినది పూర్వలాక్షణిక వచనములకు ఇతోధిక గౌరవమీయబడినది. బాల ప్రౌఢలు తిరస్కరించిన రూపములు కూడ దీనిలో సాధించబడినవి. "మహాకవి ప్రయోగంబులు సర్వథా సాధువులనియుఁ, దదన్యంబుల విరుద్ధంబులు సాధువులనియు గ్రహించుట శ్రేయంబు" అని ముక్త లక్షణకౌముది ప్రతిపాదన. అవిరుద్ధములనుటచే అజ్ఞాతా మూలకములు, విశృంఖలములు అగు, అపభ్రష్టరూపములు సాధువులుకావు.

పై లాక్షణిక మతములను పరిశీలించినచో క్రిందివిషయములు స్పష్టపడును

[1] నన్నయ ప్రయోగములు, నన్నయేతర కవిప్రయోగములు అన్న భేదము కొందరి దృష్టిలో కలదు. అహోబలపండితుడు, కవి రాక్షసుడు, అప్పకవి, ఈ కోవకు చెందినవారు.

[2] భారత ప్రయోగములు, భారతేతర కావ్యప్రయోగములు అన్న భేదము కొందరిలో కలదు. చిన్నయసూరిగారు, సీతా రామాచార్యులుగారు, ఈ కోవకు చెందినవారు.

[3] మహాకవి ప్రయోగములు, సామాన్యకవి ప్రయోగములు అన్నభేదము కొందరిలో కలదు. శ్రీ వజ్ఝలవారు, ముక్తలక్షణ కౌముదీకర్త ఈ కోవకు చెందినవారు.

ఈ సందర్భములో శ్రీ తిరుపతి వేంకటకవులు వెల్లడించిన అభిప్రాయమును గమనించుట యుక్తము.

"కేవల సంస్కృత మర్యా
దావేదులుఁ గావలాంధ్ర తత్పరులునుగా
కేవార లుభయభాషా
కోవిదులవ్వారు దీని గురువులు జగతిన్." (దేవీ)

ఈ పద్యమునుబట్టి ఉభయభాషా కోవిదుల ప్రయోగములు వ్యాకరణమునకు మూలమని చెప్పవచ్చును. కాని, ఉభయభాషా కోవిదు లయినంతమాత్రాన వారి ప్రయోగములు వ్యాకరణమునకు మూలము కావు. శ్రీ తిరుపతి వేంకటకవులు రచించిన, "కథలు—గాథలు" కేవల వ్యావహారిక రచన. కనుక, అందలి ప్రయోగములు వ్యాకరణమునకు మూలము కానేరవు. కాగా, ఉభయభాషా కోవిదుల, గ్రాంధిక కావ్య ప్రయోగములు వ్యాకరణమునకు మూలమని ఈ పక్షమున గ్రహించ వలసియుండును.

మొత్తము పై వ్యాకరణము విజ్ఞకవి ప్రయోగ మూలకమే కాని, అజ్ఞకవి ప్రయోగ మూలకముకాదు. ప్రయోగ సాదుత్వా సాధు త్వములు క్రిందివిషయములపై ఆధారపడి యుండునని నిర్ణయించ వచ్చును.

1] కవియొక్క ప్రామాణికత.

2] రచన గ్రాంధికమా? గ్రామ్యమా ?

3] లాక్షణిక దృక్పధము.

4] లక్షణగ్రంధ ప్రణాళిక.

## సంకేతాక్షర వివరణము

| | |
|---|---|
| అప్పక | అప్పకవీయము |
| అహో | అహోబల పండితీయము (ఆంధ్ర రచయితల సంఘమువారి ప్రచురణ) |
| ఆం. చిం. | ఆంధ్రశబ్ద చింతామణి |
| ఆముక్త | ఆముక్తమాల్యద |
| ఉద్యో | ఉద్యోగపర్వము |
| దేవీ | దేవీభాగవతము |
| పాండు | పాండురంగమాహాత్మ్యము |
| ప్రౌఢ | ప్రౌఢవ్యాకరణము |
| బా | బాలవ్యాకరణము |
| మను | మనుచరిత్ర |
| రాఘవ | రాఘవ పాండవీయము |
| రామా | రామాభ్యుదయము |
| వసు | వసుచరిత్ర |
| శృ. నై. | శృంగారనైషధము |

# దుర్మతి గీతి

## శ్రీ కొంగే సుధాకరరావు

దుర్మతివత్సరంబు శభదోహదమై యరుదెంచె నద్దిగో!
ధర్మము మూర్తిదాల్చినటు తామస తాప విషాదభావముల్
మర్మముగా తొలంగి నవమానవతా సుమముల్ హసింపగా
నర్మసఖుండువోలె మననందర హర్షములోన ముంచుచున్!

మావిచిగుళ్ళుమేసి మధుమాసమునన్ కలకంఠ మింపుగా
గ్రావములే ద్రవింపకలగాన సుధా ఝరి జాలువార్చగా
పూవులు మందహాసముల పుప్పొడికాంతుల నీనుచుండగా
మావిడితోరణాలు జనమంగళ కారణముల్ రహించగా!

మత్సరములే నశింపగ
మత్సాహము యెడదలందు నువ్విళ్ళులూరన్
సత్సంగతితో జనులీ
వత్సరము సుఖింత్రుగాత ఫలితాశయులై!

దుర్మతులు దుష్టులెల్లరు దుఃఖమంద
సన్మతులు యనుదినమును సంతసింప
సకల మానవలోకమ్ము శాంతినొంద
దుర్మతీవత్సరము మాకు తృప్తినిడుత!

శ్రీ బులుసు వేంకటరమణయ్య

# సత్యభామ యుద్ధం చేసినదా?

దీపావళి పండుగ జ్ఞప్తికి వస్తే వెంటనే నరకాసురుడు మనస్సులో తాండవమాడుతాడు. మహాబలశాలియైన ఆ క్రూర రాక్షసుడు ఇంద్రుని తల్లి అదితి కుండలాలనూ, వరుణదేవుని జలచ్ఛత్రాన్నీ, రత్నపర్వతమనే దేవపర్వత శిఖరాన్నీ అపహరించి, ప్రాగ్జ్యోతిష పట్టణంలో ఏకచ్ఛత్రాధిపత్యంగా రాజ్యంచేస్తూ ఉన్నాడు దేవత లందరికీ లతడంటే విపరీతమైన భయం. ఈ విషయాలన్నీ శ్రీకృష్ణునికి చెప్పడానికి ఇంద్రుడు ద్వారకకు వచ్చి, వివరంగా అన్నీ చెప్పి, అతణ్ణి శరణువేడాడు. శ్రీకృష్ణుడు సత్యభామా సహితుడై గరుడునిపై ఎక్కి, యుద్ధంలో రాక్షసులను చంపి, చివరకు చక్రాయుధంతో నరకుని శిరస్సును ఖండించాడు. ఆ యుద్ధంలో సత్యభామ కొంతసేపు యుద్ధంచేసి శ్రీకృష్ణుడు కొంతసేపు విశ్రాంతి తీసుకొనుటకు అవకాశం కలిగించింది.

ఇది ప్రచారంలో ఉన్న కథ. చిన్నలూ, పెద్దలూ — అందరూ చెప్పుకొంటున్న కథ. బమ్మెర పోతరాజుగారి భాగవతంలో ఈ కథే కానవస్తున్నది. దీనినిబట్టి సత్యభామ కూడా శ్రీకృష్ణునితోపాటు యుద్ధం చేసినట్లు తెలుస్తున్నది

పోతరాజుగారి భాగవతానికి మూలమైన సంస్కృత భాగవతంలో శ్రీకృష్ణుడు సత్యభామతో కూడా వెళ్లి నరకుణ్ణి సంహరించినటు ఉన్నదేకాని, సత్యభామ యుద్ధం చేసినట్లు చెప్పబడలేదు.

సంస్కృత భాగవతంలో ఇలా వున్నది —

"ఇంద్రేణ హృత ఛత్రేణ
  హృత కుండల బంధునా,
హృతామ రాద్రి స్థానేన
  జ్ఞాపితో భౌమ చేష్టితమ్.
సభార్యో గరుడారూఢః
  ప్రాగ్జ్యోతిషపురం యయౌ.

[దశమస్కంధం—ఉత్తరార్ధం. 59–వ అధ్యాయం]

ఇంద్రుడు వచ్చి కుండలాలు, ఛత్రం, రత్నపర్వతం భూమి పుత్రుడైన నరకుడు అపహరించినాడని చెప్పగా విని శ్రీకృష్ణుడు భార్యాసహితంగా గరుడవాహనారూఢుడై నరకుని రాజధాని అయిన ప్రాగ్జ్యోతిషనగరానికి వెళ్లాడని పైదానిలో ఉన్నది. అతనితో కూడా వున్న భార్య సత్యభామయే కాని వేరొక భార్య కాదని తర్వాత వచ్చిన సందర్భాన్నిబట్టి తెలుస్తుంది. సత్యభామ అతనితో కూడా వెళ్లినట్లు మాత్రం తెలుస్తున్నదేకాని, ఆమె యుద్ధం చేసినట్లు చెప్పబడలేదు. పారిజాతాపహరణ సందర్భంలోకాని ఆమె ప్రసక్తి రాలేదు.

ఈ విధంగానే విష్ణుపురాణంలో కూడా ఉన్నది. సత్యభామ కృష్ణునితో కూడా వెళ్లినట్లు మాత్రమే అందులో ఉన్నది. ఆమె యుద్ధంచేసినట్లు లేదు.

"భౌమోఽయం నరకో నామ
  ప్రాగ్జ్యోతిషపురేశ్వరః,
కరోతి సర్వభూతానా
  ముపఘాత మరిందమ
దేవ సిద్ధాసురా దీనాం
  నృపాణాం చ జనార్దన.
హృత్వా తు సోఽసురః కన్యా
  రురుధే నిజమందిరే,
ఛత్రం యత్సలిల స్రావి
  తజ్జహార ప్రచేతసః,
మందరస్య తథాశృంగం
  హృతవాన్ మణిపర్వతమ్,
అమృత స్రావిణీ దివ్యే
  మన్మాతుః కృష్ణ! కుండలే,
జహార సోఽసురోఽదిత్యా
  వాంఛత్యైరావతం గజమ్.
దుర్నీత మేతద్గోవింద!
  మయా తస్య నివేదితమ్,
య దత్ర ప్రతికర్తవ్యం
  తత్ స్వయం పరిమృశ్యతామ్.
ఇతి శ్రుత్వా స్మితం కృత్వా
  భగవాన్ దేవకీ సుతః,
గృహీత్వా వాసవం హస్తే
  సముత్తస్థౌ వరాసనాత్,
సంచిం త్యాగత మారుహ్య
  గరుడం గగనేచరమ్,
సత్యభామాం సమా రోప్య
  యయౌ ప్రాగ్జ్యోతిషం పురమ్"

[విష్ణుపురాణం. పంచమాంశం. 29వ అధ్యాయం]

ప్రాగ్జ్యోతిష పురాధిపతి నరకుడు దేవ మనుష్యాసురుల కన్యలను అపహరించి చెరలోఉంచెననీ, వరుణుని జలఛ్ఛత్రాన్నీ, అదితి కుండలాలను, మణిపర్వతమనే మందర శిఖరాన్నీ అపహరించాడనీ, ఏమిచెయ్యాలో ఆలోచించాలనీ ఇంద్రుడు చెప్పగా శ్రీకృష్ణుడు గరుడునిపై సత్యభామను కూర్చుండపెట్టుకొని ప్రాగ్జ్యోతిషానికి

వెళ్ళాడని మాత్రం పై దానివల్ల తెలుస్తున్నది. సత్యభామ యుద్ధం చేసినట్లు చెప్పనేలేదు.

14 వ శతాబ్దంలో ఉండిన అగస్త్య పండితుడు శ్రీకృష్ణ చరితమనే సంస్కృత గద్య కృతిలో కూడా ఈ విషయాన్నే చెప్పినట్లు 'భారతి'*లోని వ్యాసంలో తెలుపబడింది

ఈ విధంగా అందరూ సత్యభామ యుద్ధం చెయ్యలేనట్లు చెప్తూ ఉండగా పోతనామాత్యుడు మాత్రం, ఆమె యుద్ధం చేసినట్లు చెప్పడమే కాకుండా ఆ యుద్ధాన్ని ఎంతో చక్కగా వర్ణించడంలో కారణం ఏమిటా? అని ఆలోచన కలగకమానదు.

సత్యభామ శ్రీకృష్ణునితో కూడా వెళ్లి, అతనితో తిరిగి వచ్చినట్లు మాత్రం పురాణాలలో ఉన్నది. ఆమె ఎందుకు వెళ్లినట్లు? కృష్ణుడామెను తీసికొని వెళ్ళడంలో ప్రయోజనం ఏమిటి? అని ఆలోచించవలసినదే! "నేనూ వస్తాను. నన్ను తీసుకుని వెళ్ళండి" అని ఆమె కోరినట్లయినా వాటిలో చెప్పబడలేదు శ్రీకృష్ణునికి అందరు రాణులు ఉండగా—మరెవ్వరినీ కాకుండా సత్యభామనే ఎందుకు తీసుకువెళ్ళాలి?

ఇట్టి సందేహాలకు చోటు ఉండకూడదనే అభిప్రాయంతోనే—ఆ ఘట్టాన్ని రసవంతంగ చిత్రించడం కోసమే పోతరాజుగారు మూల కథలో కొంది మార్పులను తీసుకువచ్చారని చెప్పవలసి ఉన్నది.

ఇతర రాణుల కంటె సత్యభామకు ధైర్య సాహసాలు ఎక్కువ. భర్త దగ్గర స్వాతంత్ర్యమున్నూ అధికమే! ఈ భావాలనే పోతనగారు సత్యభామ పాత్రలో బాగుగా చిత్రించారు. శ్రీకృష్ణుడు గరుడ వాహనారూఢుడై నరకాసురుడి మీదికి వెళ్లబోయేటప్పుడే ఆమె తన్ను కూడా తీసుకుని వెళ్ళాలని ఇలా ప్రార్థించింది.

> "దేవా! నీవు నిశాట సంఘముల ను
> ద్దీపించి చెండాడ, నీ
> ప్రావీణ్యంబులు సూడఁ గోరుదుఁ గదా!
> ప్రాణేశ! మన్నించి న
> న్నీవెంటం గొనిపొమ్ము నేడు కరుణన్
> నేఁజూచి యేతెంచి నీ
> దేవీ సంహతి కెల్లఁ జెప్పుదు భవ
> ద్దీప్త ప్రతాపోన్నతుల్."
>
> [దశమస్కంధము — ఉత్తర భాగము—151]

తన భర్త ప్రతాపాన్ని స్వయంగా చూడాలని ఆమె కోరిక. చూచి వచ్చిన తర్వాత సవతులందరికీ దానిని వివరించి చెప్తుందట! దీని వల్లనే ఆమె ప్రాభవం తెలుస్తున్నది.

ఆమె తనతో రావడం శ్రీకృష్ణునికి అంతగా ఇష్టం లేదు. తాను యుద్ధానికి వెళ్లుతున్నాడుగాని విహారయాత్రకు వెళ్లలేదు. సుకుమార గాత్రలగు సుందరీమణులు యుద్ధరంగానికి రావ[...] అతనికి సమ్మతం కాదు ఈ విషయాన్నే అతడు ఆమెకు చెప్పా[...] కాని, ఆమె వినలేదు నీ ప్రక్కను ఉన్నప్పుడు నాకెలాంటి భయమ[...] లేదని అంటుంది తన భర్త అవతారమూర్తి అనీ, లోకోత్త[ర] ప్రభావం, ప్రతాపం కలవాడనీ ఆమెకు తెలుసును. అందువల్లనే [...] భర్త రాక్షసుల మీది యుద్ధానికి వెళ్లడం బాగా ఎరిగినా, ఆ రాక్ష[సు]లకు తానెంతమాత్రం భయపడననీ, అయన ప్రక్కనున్నప్పుడు [...]కెట్టి అపాయమూ ఉండదనీ ఇలా చెప్పింది —

> "దానవులైన నేమి? మఱి
> దైత్యసమూహము లైననేమి? నీ
> మానిత బాహు దుర్గముల
> మాటున నుండఁగ నేమి శంక? నీ
> తో నరుదెంతు నంచుఁ గర
> తోయజముల్ ముకుళించి మ్రొక్కె న
> మ్మానిని దన్ను భర్త బహు
> మాన పురస్సర దృష్టిఁ జూడఁగన్"

సత్యభామ ధైర్యసాహసాలకు శ్రీకృష్ణునికిన్నీ ఆనందం కలిగిం[ది]. అతడు ఆమెను తనతో తీసికొని వెళ్ళాడు. రణరంగాన్ని ప్రవేశిం[చి] ఆతడు రాక్షసులనందరినీ చాలా సులభంగానే సంహరింపసాగినా[డు]. దానిని చూడగా సత్యభామకున్నూ ఉత్సాహం ఉప్పొంగినది. తాన[ు] యుద్ధానికి సిద్ధపడినది.

> "వేణిం జొల్లెము పెట్టి సంఘటిత నీ
> వీబంధయై, భూషణ
> శ్రేణిం దాల్చి, ముఖేందుమండల వరీ
> చీ జాలముల్ పర్వఁగాఁ
> బాణిం బయ్యెదఁ జక్కఁగాఁ దుఱిమి శుం
> భ ద్వీర సంరంభయై"

ప్రాణనాథుని యెదుట నిలిచింది. ఆమె ఉత్సాహాన్ని భంగపర[చక] శ్రీకృష్ణుడు "సరే" అన్నాడు. ఆమె ధాటికి అగలేక రాక్షసులందర[ూ] వెనుకకు పారిపోయారు.

పోతనగారి భాగవతంలో సత్యభామ యుద్ధ ప్రయత్న[మూ] యుద్ధపు తీరు చాలా విపులంగాను, రసవంతంగాను వర్ణించబడిన[ది]. పురాణాల్లోను, ఇతర సంస్కృత కృతుల్లోనూ సత్యభామ [...] భర్తతోపాటు రణరంగానికి వెళ్లినదే కాని యుద్ధం చెయ్యలే[దు]. పోతరాజుగారి సత్యభామ మాత్రం యుద్ధం చేసినట్లు వర్ణిం[చ]బడింది. ఆంధ్రభాగవత కర్త చేసిన యీ మార్పు రసపరిపోషణ ఉద్దేశించి జరిగినదే!

---

* చూడుడు. అగస్త్య పండితుని గురించిన వ్యాసం, 197[...] ఏప్రిల్ భారతి సంచిక.

# సుందర శతపత్రం

## శ్రీ చల్లా రాధాకృష్ణ శర్మ

ఎవరిదో ఆ కబంధ హస్తం
కుదిపి వెయ్యాలని ప్రయత్నిస్తోంది
ఎవరిదో ఆ దివాంధపు చూపు
నలిపి వెయ్యాలని ఆరాట పడుతోంది.

ఎన్నెన్ని కుప్పిగంతులు
ఎవరు వేసినా
ఎన్నెన్ని చిలిపి చేష్టలు
ఎవరు చేసినా
అది వాడదు, అది రాలదు.

ఆ సుందర శతపత్రం ఈనాటిదా ?
ఆ సనాతన సుమరాజం ఏనాటిదో !

ఎన్నో చండ వాతాతపాఘాతాలకు
ఎదురొడ్డి నిలిచింది, వీర కిశోరంలా.
రక్కసుల యేత్రాసి చేతలకు
చెక్కు చెదరక నిలిచింది, తాపసోత్తమునిలా.

ఎన్నో యుగాలుగా ఎందరెందరినో
ఎంతగానో అలరించిన అమోఘపుష్పం
ఆ శతపత్రం.
అది యే ఒక్కరిదీ కాదు
అందరికీ అది సొంతం.

ప్రతి పత్రమూ ప్రముఖమే
శతపత్ర మంత;
మాటలోని అర్థంలా
పాటలోని పల్లవిలా.

వివిధ పత్రాలూ విడదీయరాని మిత్రములై
కలిసి మెలిసి వున్నప్పుడే కనిపిస్తుందది
శతపత్రంగా మధుర మనోజ్ఞంగా
స్నిగ్ధ సౌందర్య సౌభాగ్యాలకు నిలయంగా
సుస్థిర శాంతి సౌఖ్యాలకు సదనంగా.

ప్రతి పత్రం
సౌందర్యానికి మారుపేరు
సౌభాగ్యానికి గీటురాయి
త్యాగ నిరతికి సంకేతం
జ్ఞాన గరిమకు ప్రతిరూపం.

ఏ పత్రానికి ఆ పత్రం
విడివిడిగా కనిపించినా
సన్నిహిత సంబంధం కలవి
సమాన ఆధారం కలవి
సమధర్మం సంతరించుకున్నవి.

దాని అతిలోక సౌరభం
గుబాళిస్తోంది దిశాష్టకం
ఆ పరిమళానికి ఉత్తేజితులై
ఆలపించారు కవితలు
వెలయించారు గీతాలు
వేశారు చిత్రాలు
మలిచారు శిల్పాలు.

దాని అపురూప సౌందర్యం
ప్రభావితుల్ని చేసింది పలువురిని
యుద్ధ మేరువులుగా
దాన వీరులుగా
దయా శూరులుగా.

చర్మ చక్షువుకి కనిపించే
సామాన్య పుష్పం కాదది
జడ పదార్థం అంతకన్నా కాదు
నిజానికది చైతన్యోత్పాదక కేంద్రం.
అందుండి గ్రహిస్తారు అందరూ
అచంచల ధైర్య స్థైర్యాలు
అపురూప శక్తి సామర్థ్యాలు
దాని సంరక్షణకోసం
త్యాగం చేశారు తమ అసువులు
దేశ భక్తులూ వీర యోధులూ.

ఏ ఒక పత్రమైనా
వాడినా విచ్చుకున్నా
గాలికి రెపరెపలాడినా
వానకి వెలవెల పోయినా
కంపించిపోతుంది శతపత్రమంతా.

ఏ పత్రం కొసనైనా
మలిన బుద్ధితో ముష్కర భావంతో
దుష్టకీటకం తిష్ఠ వెయ్యాలనుకుంటే
శతపత్రం కనిపిస్తుందప్పుడు
అతి భీకర లోహ విహంగంగా.

బిన్న రాగాలు ఆంకిస్తుంది
భిన్న సంస్కృతులు ఆదరిస్తుంది
అన్నిటా సమభావం వహిస్తుంది
అన్నీ తానే అని చెబుతుంది.
తానే అన్నీ అని భావిస్తుంది.

ఆ సుందర శతపత్రం
యుగ యుగాలుగా వర్ధిల్లిన
భారత మహనీయ శతపత్రం !

# అర్ధరాత్రి

## నిఖిలేశ్వర్

అర్ధరాత్రి అకస్మాత్తుగా తెరచుకునే కళ్లు
అర్ధాంతరంగా అన్నీ అయోమయాలను దాటి
అలజడిలేని అలసటలేని మౌనాన్ని
ఆత్మపరిశీలనా గీతాన్ని
వినపడని సంగీతాన్ని
తనలోంచి వింటున్నది బయటి ప్రపంచాన్ని
రోజూ లోపలికి వయనించే వెలుపలి దృశ్యాల్ని !

నడిరోడ్డుపై బోర్లాపడుకున్నమనిషి ఒక బిచ్చగాడు
మహానగరాల పేవ్‌మెంట్లపై
శవాలైపోతున్న నాగరికులు
వేసుకున్న గుడిసె
ఎవరు గుడ్లు ఉరిమితే కూలుతుందో తెలియదు
జేబులోని రూపాయి బజారుపాలై

ఏనాడో నవ్వులపాలైపోయింది !
తిండీ బట్ట ఇల్లుకే పరిమితం మధ్యతరగతి మనుగడ
ఎంత ఎక్కువ సంపాదించగలిగితే
అదే అంత పెద్ద చదువు ! !
ఈ పరుగువేటలో వెనకబడినవాడు
వెటకారంగా వికలమైపోతున్న జీవి !

ఎదురుగా వెక్కిరిస్తూ టి. వి. అంటెనా
ప్రవహించే విద్యుత్తు ఒకవంతెన అది అంతానికి
అది టక్కున తెగుతుంది —
అప్పుడప్పుడు శూన్యంలోకి విసిరేస్తూ
జ్ఞానాన్ని అనుభవాన్ని సవాలుచేస్తూ !
నిరంతరం మేల్కొనలేని చైతన్యాన్ని నిద్రపుచ్చుతున్నా
ఈ అర్ధరాత్రి
రానున్న రేపటి ఉదయానికి ఆలంబనం.

శ్రీ కోడూరి శ్రీరామమూర్తి

# కథకుడుగా బుచ్చిబాబు

తెలుగు సాహిత్యంలో కథకుల సంఖ్యకు కొదవలేదుగానీ, మంచి కథకుల గురించి చెప్పాలంటే, యిప్పటికీ వేళ్ళమీద లెక్కపెట్ట వలసిన పరిస్థితే కనబడుతోంది ఆ కొద్దిమంది కథకుల్లో ఎన్నదగిన వాడు బుచ్చిబాబు. జీవితాన్నీ, జీవితంలో తనకెదురయిన వ్యక్తులనీ, ఆ వ్యక్తుల జ్ఞాపకాలు అందిచ్చే అనుభూతుల్నీ, నిశితంగా పరిశీలించి గుండెల్లో పదిలపరుచుకొని, ఒక్కొక్క పాత్రగా తీర్చిదిద్దాడు బుచ్చిబాబు. అయితే, ఆ పాత్రలను సృష్టించిన కథకుడు అటు విశ్వసాహిత్యంలోని ఆధునిక పోకడలను, యిటు మనస్తత్వ శాస్త్ర, తత్వ శాస్త్ర, సిద్ధాంతాల సారాంశాన్నీ ఆకళింపు చేసుకున్న మేధావి కావడంతో–ఆతని కథలు కాలక్షేపు కథల పరిధిని దాటి చాలా దూరం ముందుకు వెళ్ళగలిగాయి.

''మనమందరమూ గోగోల్ 'ఓవర్‌కోట్' లోంచి పుట్టుకొచ్చిన వాళ్ళమే!'' అంటాడు గోర్కీ.[1] ఆధునిక కథానికకు ఒకప్పటి గోగోల్, ఆ తర్వాతి మొపాసా, చెహోవ్, అటు తర్వాతి కాలపు సోమర్సెట్‌మామ్, ఓ హెన్రీ, యిత్యాదులందరూ సరికొత్త సోయగాలు సమకూర్చినవాళ్ళే! బుచ్చిబాబు వీళ్ళందరి సాహితీ పరిచయాన్నీ కావలసిన మేరకు సముపార్జించుకొన్నాడు. కథా శిల్పానికి సంబంధించి సోమర్‌సెట్‌మామ్‌కు ఏకలవ్య శిష్యుడయ్యాడు. ''ఊహాబలం, కవితాశక్తి, జీవితం పట్ల వుండాల్సిన గౌరవభావం, మామ్ కథలలో లోపించినందువల్లనే అవి అంత సంతృప్తికరంగా వుండవు...''[2] అని అన్నప్పటికీ ''రచనా విధానంలో గొప్ప శిల్పం వుంద''ని అంగీకరిస్తూ, కథను నడపడంలో గల మెళకువలను మామ్ దగ్గిర నుండే గ్రహించానని ఒప్పుకున్నాడు బుచ్చిబాబు.

సోమర్‌సెట్‌మామ్ ప్రత్యేకతలలో ఒకటి–''నేను'' అంటూ ప్రధమ పురుషలో కథ చెప్పడం. యిలా కథ చెప్పడంలో కొన్ని ప్రయోజనాలున్నాయంటాడు మామ్.[3] కథ చెప్పే వ్యక్తి ఒకే విషయంపై దృష్టి కేంద్రీకరించి – తను కన్నవీ, విన్నవీ, చేసినవీ, చెప్పవచ్చు. ఇలా చెప్పడం వల్ల పాఠకులకు అతనిపై ఒకవిధమైన సాన్నిహిత్యం ఏర్పడుతుంది. అతను చెప్పేదాన్నీ, చేసినదాన్నీ, అంగీకరించినా, అంగీకరించకపోయినా, అతనిపై సానుభూతి చూపే స్థితికి పాఠకులు వచ్చేస్తారంటాడు మామ్. యిది గాక, మరొక ప్రయోజనం కూడా వుంది. ఈ తరహా కథనంలో రచయిత సర్వజ్ఞుడిలాగా అన్నీ చెప్పనక్కరలేదు. కొన్ని విషయాలు చెప్పి, మిగతావి నాకు తెలియదని తప్పుకోవచ్చు. దీనివల్ల కథలో అవాంఛనీయమైన రీతిలో సమగ్రత ఏర్పడకుండా–పాఠకుడు పాత్రల గురించి కొంత ఆలోచించేందుకు వీలుపడుతుంది. తమకు తోచిన రీతిలో సమాధానపడడానికి అవకాశం వుంటుంది. కథకుడుగా బుచ్చిబాబు ఆశించిన ఫలితాలలో యిది కూడా ఒకటి. పాత్ర చిత్రణలో కొంత 'మిస్టరీ', అర్థంకాని, బహిర్గతం గాని 'గొడవ' వుండాలని బుచ్చిబాబు కోరుకోవడంలో వున్న ఉద్దేశం యిదే![4]

కథా శిల్పం విషయంలో మాత్రమే గాక, కథా రచనకీ, సామాజిక ప్రయోజనానికీ మధ్యగల సన్నిహిత సంబంధాన్ని గూర్చి అధికంగా ఆలోచించకపోవడంలో కూడా బుచ్చిబాబు మామ్‌కి సన్నిహితంగా కనబడతాడు. ఆర్థిక, సామాజిక, శక్తుల ప్రేరణలో వ్యక్తి లోనయ్యే సంఘర్షణల గురించి గాక, తనలోని నిరుద్ధ ప్రవృత్తుల ఫలితంగా వ్యక్తిలో చెలరేగే సంఘర్షణలపట్ల రచయితగా బుచ్చిబాబు ఆసక్తిని చూపించాడు. ఈ సంఘర్షణలకు ప్రేరణ రచయితలోంచే పుట్టుకొస్తుందంటాడతను. ''నిత్య జీవితంలో రచయిత సంఘర్షణకు గురి అవుతాడు తాను కోరుకున్న ఉద్యోగం దొరకదు. ప్రేయసి దొరకదు. స్నేహితులుండరు ... ఒక సంఘర్షణ ప్రబలి ద్వంద్వ వ్యక్తిత్వం ఏర్పడి ఈ బాధను యితరులతో చెప్పుకుని విముక్తుడవుతాడు''[5] అంటాడు, బుచ్చిబాబు కథల వెనుక కథ గురించి చెబుతూ. ఈ సంఘర్షణ స్వరూపాన్నే మరికాస్త సాగదీస్తే, వ్యక్తికీ, వ్యవస్థకూ, జరిగే పోరాటంలో ఆర్థిక, సామాజిక శక్తులకు గల స్థానం అవగతం అవుతుంది. అయితే, అది బుచ్చిబాబు పని కాదు. ''ముష్టి నిజం'', ''వాడిన చక్రం–వాడిన పుష్పం'' వంటి కథల్లో అట్టడుగు సమాజానికి చెందిన ముష్టివాడు, రిక్షావాడు, పాత్రలయినప్పటికీ, తను గీసుకున్న గిరిదాటకుండా, ఆర్థికపరమైన శక్తులను గురించి గాక, హృదయానికి సంబంధించిన ఆర్ద్రతల గురించే ఆలోచించాడు బుచ్చిబాబు.

అయితే, యిది ప్రయత్నపూర్వకంగా ఏదో కావాలని చేసిన విషయం కాదు. స్వతహాగా బుచ్చిబాబు హృదయవాది. ప్రకృతి పలకరింపుతో పులకరించిపోయే కవితాత్మక హృదయం అతనిది. కథకుల్లో భావకవి అతను. ఆకుల మధ్య ప్రసరించే కిరణాలు వనదేవత కుట్టుపనిలో ముందుకీ వెనక్కీ కదలడాలు,[6] చాంచల్యంగా కదిలే బలహీనమైన కనురెప్పల క్రింద మంచులో కదిలిపోయిన కుందేలులా మెరిసిపోయే నేత్రాల అందాలు,[7] వెన్నెల పిలుపుకి పొంగిపొయ్యే సముద్ర కెరటంపై నురుగులో వెలుగుల సొగసులు,[8] యివన్నీ బుచ్చిబాబు కథల్లో పుష్కలంగా దొరుకుతూ, అతని వృక్పథంలోని 'రొమాంటిసిజమ్'ను వ్యక్తీకరిస్తాయి. ఈ విషయాన్ని గురించి చెబుతూ ''నాగరికతలో నుండి ప్రకృతిలోకి పారిపోయే వ్యక్తులన్నా, అట్టివారిని గురించిన కథలన్నా, నాకెంతో యిష్టం...సోమర్‌సెట్‌మామ్ రచన అంటే నాకిష్టం ఏర్పడ్డానికి ఆయన యిట్లాంటి వ్యక్తుల గురించి ఎక్కువగా రాయడమే కారణం అనుకుంటాను'' అంటాడు తన 'స్వీయ చరిత్ర'లో.[9]

"నా కథలన్నీ నే ఎరిగిన్న మనసులు, స్థలాలు, అనుభవాలు, ఏటి ఏరించి రాసినవే" [10] అని చెప్పుకున్న బుచ్చిబాబు, మామ్‌లాగానే 'నోట్‌బుక్'లో తనను కదిలించిన విషయాలన్నిటినీ 'నోట్' చేసుకొనేవాడు. నిజానికి, వాస్తవపు ఆధారంలేని కల్పన సాహిత్యంలో రాణించలేదనుకుంటాను సాహిత్యంలో ప్రసిద్ధి చెందిన ప్రతీ పాత్ర వెనుకా నిజ జీవితంలో నమూనాలు దొరుకుతాయి తనను ఆకర్షించిన వ్యక్తులను సాహిత్యంలో యిరికించడంలో ప్రసిద్ధుడయిన మామ్, ఏ రచయిత అయినా సజీవమైన 'మోడల్' లేకుండా ఒక పాత్రను సృష్టించానని చెప్పుకుంటే అతను చాలా పొరబడుతున్నాడని అర్థం అన్నాడు [11] ప్రపంచ ప్రఖ్యాతి చెందిన అతని 'రెయిన్' (వర్షం) కథలోని మిస్ తామ్సన్, డేవిడ్‌సన్ (మతాధికారి) పాత్రలకు గల నమూనాల గురించి, వాళ్ల గురించి తన 'నోట్‌బుక్'లో రాసుకున్న విశేషాల గురించి, మామ్ వ్యాసాల్లో తెలుసుకుంటున్నప్పుడు అతని అభిమానులకు ఎంతో ఆనందం కలుగుతుంది [12] మామ్ లాగానే బుచ్చిబాబు కూడా దాపరికం లేకుండా తన కథల వెనుక గల కథల గురించి అనేక సందర్భాలలో చెబుతాడు

బుచ్చిబాబు కథల్లో "నన్ను గురించి కథ రాయవూ" ప్రసిద్ధి చెందింది. విశ్వసాహిత్యంలో యిది ఎన్నదగిన కథ అన్న డి. రామలింగంగారి అభిప్రాయంతో [13] నేను ఏకీభవించలేను గానీ, మంచికథ అనిమాత్రం ఒప్పుకుంటాను. బుచ్చిబాబు చిన్నవాడుగా వున్నప్పుడు ఒక అమ్మాయి అతణ్ణి నన్ను గురించి కథరాయవూ అని అడిగిందట.[14] తర్వాత పదిహేనేళ్లకి బుచ్చిబాబు అదే మకుటంతో ఒక కథ రాయగలిగారు అయితే, యిందుకు మరికొన్ని ప్రేరణలు గూడా వున్నాయి. బుచ్చిబాబు స్నేహితుడు ఒకాయన కొన్ని షరతులు పెట్టి ఒక కథ రాయమన్నాడట. 'ప్రేమ' అనే పదంరాని ప్రేమకథ అయివుండాలి-ఆ కథలోని వ్యక్తులు సాధారణమైన మనుషులయి వుండాలి కథలో ఏమీ జరక్కూడదు అనేవి ఈ షరతులు.[15] ఈ షరతుల పరిధిలో కథ మలుచుకొనేందుకు అతని చిననాటి జ్ఞాపకాలు కూడా తోడయ్యాయి. "నన్ను గురించి కథరాయవూ?"లో కుముదానికీ, కథచెప్పే "నేను" అనే వ్యక్తికీ మధ్యనవుండే శారీరకమైన సంబంధం లేని "ప్రేమ" ('ప్లేటోనిక్‌లవ్' వంటిది) బుచ్చిబాబు తండ్రికీ, 'కోమలి' అనే అమ్మాయికీ (ఈ 'కోమలి' అనే పేరునే బుచ్చిబాబు 'చివరకు మిగిలేది' నవలలో వాడుకున్నారు.) మధ్యన వుండేదని బుచ్చిబాబు తన "అంతరంగకథనం" (స్వీయచరిత్ర)లో రాసుకున్నాడు. ఈ భావాలన్నీ జమిలిగా జతచేరిన ఫలితమే "నన్నుగురించి కథ రాయవూ" అనే కథ.

'కుముదం' అనబడే ఓ మధ్యతరగతి కుటుంబీకురాలి పాతికేళ్ల జీవిత కథను సుమారు పాతిక పేజీల ఈ కథలో యిముడుస్తాడు బుచ్చిబాబు. కథ ప్రారంభం అయ్యేటప్పటికి చిన్నపిల్లగావుండే కుముదం కథ చివరి కొచ్చేసరికి నలుగురు పిల్లలతల్లి అవుతుంది. అయితే—ఈమార్పు శారీరకమైంది మాత్రమే! మనసులోని భావనలో మాత్రం మార్పులేదు.

కథకుణ్ణి కుముదం "నన్ను గురించిన కథరాయవూ" అని అడగడానికి కారణం ఒక మామూలు కథకు కథానాయిక అవుదామన్న కోరికకాదు. కుముదానికి చిననాటినుండీ కథకుడంటే విపరీతమైన అభిమానం ఆ అభిమానాన్ని శారీరక అనుభవంగా మార్చగల తెగువ అతనికీలేదు—ఆమెకీలేదు అందుచేత, తనకున్న మానసికబంధం మరింత పటిష్ఠం కావడానికి ఆమె అతగాడి కథకు కథానాయిక కాదలచింది. ఒక కథలో లాగ యిమిడిపోయి శాశ్వతంగా అతడి దగ్గిర ఉండిపోదలచింది కాని, యిది జరగాలంటే ఆమెలో ఏదో 'అసాధారణత' వుండాలంటాడు కథకుడు. తనలో లేని 'అసాధారణత' ఏమిటో కుముదానికి తెలుసు అందుచేతనే—తనలో అట్టి అసాధారణతను కలిగించేందుకు ప్రోదిని కల్పించే స్వేచ్ఛపై ఆమె నానాటికీ మమకారాన్ని పెంచుకోసాగింది ఉద్యోగం దొరకలేదని బాధపడే కథకుడిలో కుముదం ఉద్యోగం చెయ్యడం బానిసత్వమని చెప్పడం, దాస్యాన్ని తాను సహించలేననడం, వ్యవస్థ గీసిన గిరిపట్ల నానాటికీ ఆమెలో పెరిగిపోతున్న రోతకు పరోక్ష వ్యక్తీకరణగా చెప్పుకోవచ్చు. అయితే, ఆమె తన మనసులోని మాటను ప్రత్యక్షంగా వ్యక్తీకరించగల తెగువను పెంపొందించుకొనేటప్పటికి జీవితపు తుది ఘడియలు సమీపించాయి. చావు బ్రతుకుల మధ్యవున్న కుముదాన్ని చూడ్డానికి కథకుడు ఆస్పత్రికి వస్తే—"నువ్వెందుకు పెళ్లిచేసుకోలేదో నాకు తెలుసు ..నాకోసం..." అని అనడంతో ఆమె స్వేచ్ఛకోసం పడిన తపన పరాకాష్ఠకు చేరుకొంది. ఈ ఒక్కమాటతో కుముదం కథకుడి కథకు నాయికకాగల అర్హతను సంపాదించుకొంటుంది.

ఈ కథను బుచ్చిబాబు నడిపినతీరు ప్రశంసనీయంగానేవున్నా—కథచివర్లో మానవుడి బుర్రలోవుండే అధోలోకం గురించిన ఫ్రాయిడియన్ సైకాలజీని—(కథకుడి ఆలోచనల రూపంలోనే అనుకోండి). వివరించబోవడం కథాశిల్పాన్ని పాడుచేసినట్లుగా అనిపిస్తుంది కథ మధ్యలో శాస్త్రీయమైన విషయాలను వివరించడం, వ్యాఖ్యానించడం, దోషాలని తెలిసినా బుచ్చిబాబు కొన్ని సందర్భాలలో నిగ్రహించుకోలేక పోయాడనుకుంటాను. "అనురాగ ప్రస్తారం" అనే కథలో బుచ్చిబాబు "నేను" అనే పాత్రతో కూడా సంబంధం లేకుండా కూడా కథకు అడ్డంవచ్చి మాట్లాడ్డం ప్రారంభిస్తాడు కథగాని, నవలగాని, ఏ సాహిత్య ప్రక్రియ విషయం తీసుకున్నా యిది మంచి సంప్రదాయం కాదనుకుంటాను. రచయితగా ఫ్లాబర్ట్ గొప్పదనాన్నిగురించి చెబుతూ గై డిమొపాసా అంటాడు[16] "పుస్తకం మధ్యలో మాట్లాడే అలవాటుగానీ, చివరన సెలవు తీసుకోవడంగానీ, యిట్లాంటి అలవాట్లు ఫ్లాబర్ట్‌కి లేవు. మనుష్యరూపంలోవున్న తోలుబొమ్మలను ఆడించే ఆటగాడతడు. వాళ్ల ఆలోచనలు ఆలోచించే హక్కు అతను వదులుకున్నప్పటికీ,—అతని నోటిద్వారా మాత్రమే అవి పలకవలసి వుంది దారాలు పసిగట్టేందుకుగానీ,—గొంతు గుర్తుపట్టేందుకుగానీ, అవకాశంలేదు" అని కాల్పనిక సాహిత్య స్రష్టలందరూ గుర్తుంచుకోదగ్గ సత్యమిది.

బుచ్చిబాబు కథల్లో కనబడే మరోవిషయం — సుదీర్ఘమైన వర్ణనలు. కథ చదువుతున్న పాఠకుడి కళ్లకు పాత్రలు కనబడాలి నిజమే?—దానికోసం పాత్రస్వరూపాన్ని సుదీర్ఘంగా వర్ణించి పారెయ్యడం (కవితాత్మకంగానే అనుకోండి) కొన్ని సందర్భాలలో కథాగమనానికి ఆటంకంగా కూడా వుండవచ్చు. కుముదం సాధారణంగా వుందని చెప్పడానికి బుచ్చిబాబు అసాధారణమైన ఉపమానాలు

వేస్తాడు. ఈ తరహా ధోరణి నవలకు కొంతవరకూ ఉపయోగపడ వచ్చుగానీ, కథకు అనవసరం. "నవలకు పనికివచ్చే సుదీర్ఘమైన వర్ణనలను కథలో వుంచడం అన్నది–ఆరునెలల పాపకు పెద్ద టోపీ, పర్‌కోటుటు వేసి అలంకరించడంలాంటిది"[17] అంటూ హెచ్. ఇ. బేట్స్ రాసిన వాక్యాలు ఈ సందర్భంలో గుర్తుకు తెచ్చుకోవాలి. కథా రచన కత్తిమీద సాములాంటిది. హెచ్. ఇ బేట్స్ అన్నట్టుగానే కథ రాయడం అన్నది అగ్గిపుల్లలతో మేడకట్టడం లాంటిది. ఒక్కపుల్ల ఎక్కువయినా మొత్తం కూలిపోతుంది.[18] అయితే–అక్కడక్కడ మోతాదు మించినా మొత్తంమీద బేలెన్స్ నిలబెట్టుకుంటూ, తన అగ్గిపుల్లల మేడను భద్రంగా కాపాడుకుంటూ వచ్చాడు బుచ్చిబాబు.

బుచ్చిబాబు కథల్ని మొత్తంమీద చూచినప్పుడు ఒక విషయం మనకు సులువుగా అవగాహనకు వస్తుంది అతని కథల్లో సాధారణంగా కనబడేది అంతరంగంలో అణచివేయబడిన శృంగార భావనలు. "ప్రేమించి దూరంగావుండి, శరీరసుఖం కోరక, మనస్సుని ఆనందంతో నింపుకునే ఉదంతం సాహిత్యంలో రాణిస్తుంది"[19] అంటాడతను. కుముదంతోబాటుగా, "మేడమెట్లు" కథలోని అరుణ, "ఆశాప్రియ" కథలోని ఆశాప్రియ, "పొగలేని నిప్పు" కథలోని సీతారత్నం, "వీరేశలింగం ఏం చెయ్యాలి?" కథలోని మైథిలి, "తెరచాపదించిన పడవ"లోని విదురమ్మ, "ఆ రాలిన ఆకులు"కథలోని కాంతం– యిల్యాదులందరూ మనసులోనికోరికకూ,శరీరపుఅనుభవానికీ, పొందిక కుదరక వేర్వేరు విధాలుగా ఆవేదనతో అలమటించినవారే!

"పొగలేని నిప్పు" కథలోని సీతారత్నం కథ చాలా చిత్రంగా వుంటుంది. ఈ కథలో యిరుగు పొరుగునవున్న, భాస్కరం, సీతారత్నంలమధ్య నిప్పువుంది. అది రోజురోజుకూ రాజుకుని మహాగ్ని అవుతున్నది. అయినప్పటికీ, యిద్దరూ తప్పు చెయ్యలేకపోయారు. పవిత్రతకూ, అపవిత్రతకూ మధ్యనవున్న అడ్డుగీతను దాటిపోయేందుకు పరిగెడుతూ, తమకు తామే 'కళ్లాలు వేసుకుని వాళ్లు ఎలా ఆగిపోయేవారో కుతూహలాన్ని కలిగించే రీతిలో చెబుతాడు బుచ్చిబాబు ఈ కథలో. తను రాసిన కథల్లో యిది తనకు యిష్టమైన కథ అని చెప్పుకున్నాడు బుచ్చిబాబు.[20]

"మేడమెట్లు" కథలోని అరుణ కథకూడా యింతే. అయితే, సీతారత్నం మాదిరిగా అరుణకు నిత్యసంఘర్షణలేదు. సంస్కారపు ముసుగును పదిలంగా పరుచుకోగల నైపుణ్యము, బ్రతుకు, నేర్చినతనం, ఆమెలో అధికంగా వుండడమే యిందుకు కారణం. అరుణకాక, ఈ కథలోని మరిరెండు ప్రధాన పాత్రలు 'అధికారి', 'దౌర్భాగ్యుడు'. వీళ్లిద్దరూ మిత్రులు. అధికారి అరుణ భర్త. దౌర్భాగ్యుడు ఆమె చిననాటి ప్రియుడు. మనిషిలోవుండే రెండు తరహాల ప్రవృత్తులకూ వీరు సంకేతాలు. ఐశ్వర్యంపట్ల, అధికారంపట్ల, మనిషికివుండే ఆకాంక్షకు సంకేతం 'అధికారి' అయితే సౌందర్య పిపాసకు, అలౌకికమైన శాశ్వత విలువలకు సంకేతం 'దౌర్భాగ్యుడు'– పరస్పర విరుద్ధమైన ఈ రెండు ప్రవృత్తులలో దేనినీ వరించలేక వీటిమధ్య జరిగే సంఘర్షణలో ఎటూ తేల్చుకోలేక సతమతమయ్యే సగటు మనిషికి 'అరుణ' సంకేతం. ఈ ప్రతీకల నేపథ్యంలో ఫ్రాయిడియన్ సైకాలజీని దృష్టిలో వుంచుకుని అంతరంగంలో చెలరేగే తపనల కథ చెబుతాడు బుచ్చిబాబు "మేడమెట్లు" కథలో

ఫ్రాయిడ్ మనస్తత్వశాస్త్రం ప్రకారం (సైకో ఎనాలిసిస్) మేడమెట్లు ఎక్కడం, దిగడం అనేవి కలలోకి వస్తే, అది అంతరంగంలో చెలరేగే మైథున వాంఛను ప్రతీకగా చెప్పడం జరుగుతుంది. నిజానికి దౌర్భాగ్యుడి ప్రేమకథ కూడా ఒక కలలాంటిదే! దౌర్భాగ్యుడు తన చిననాటి ప్రియురాలితో ఆడుకున్నది మేడమెట్లమీద. ఆమెకోసం కలవరించింది మేడమెట్లమీద కథ చివర్లో అధికారి కూతురు కళ్యాణిని చూచి, తన చిననాటి స్నేహితురాలిగా భావించి, ఆవేశంతో మేడమీదనించి దిగుతూ కాలుజారి పడి చనిపోయింది మేడమెట్లమీద అతని జీవితకథలో మేడమెట్లకుగల స్థానం అత్యంతముఖ్యమైంది.

దౌర్భాగ్యుడి ప్రేమకథను పెనవేసుకున్న మరొక విషయం అరుణ ఉంగరం. ఆ ఉంగరాన్ని అరుణ విడిచిపెట్టలేకపోవడానికి కారణం మనస్తత్వశాస్త్రవేత్తలు చెప్పే "స్టఫ్ ఫెటిషిసమ్"గా అభివర్ణించుకోవచ్చు. అరుణకు ఆ ఉంగరం దౌర్భాగ్యుడిదగ్గిర వుండడమే యిష్టం. ప్రతిసారీ అది తనకు తిరిగి యిచ్చెయ్యమని అడగడం, దాని కోసం దౌర్భాగ్యుడితో పోట్లాడడం–అరుణిపట్లగల మమకారాన్ని దానికి విరుద్ధమైన భావంగా వ్యక్తీకరించడమే! అయితే, ఆమె బ్రతుక నేర్చింది. దౌర్భాగ్యుడు కోరుకున్నట్టుగా ఆమె నగలన్నీ విడిచేసి, పువ్వుల్ని ప్రేమించలేదు. అందుకే అధికారానికి అర్ధాంగి అయింది. అయినప్పటికీ ఆమె దౌర్భాగ్యుణ్ణి మరచిపోలేదు.దానికి కారణం భర్తకు నచ్చకపోయినా, పట్టుపట్టి యిదివరకు తాను విస్మృతనంతో దౌర్భాగ్యుణ్ణి (అతని పేరు అదే అనుకుంటే!) కలుసుకున్న యింటికి వున్నట్టుగానే సరిగ్గా అదే యిరవైమూడు మెట్లున్న మేడను అద్దెకు తీసుకునేలా చెయ్యడం. కాని, ఆమె ఎప్పుడూ మేడదిగి వచ్చేదికాదు ఆ మెట్లుదిగి రాగలిగితే ఆరోజే ఆమె దౌర్భాగ్యుడికి అంకితమైపోయి వుండేది. యింక యిప్పుడెందుకూ దిగడం? కథ చివర్లో చనిపోయిన దౌర్భాగ్యుడి చేతికివున్న ఉంగరాన్ని అరుణ తీయించడం, మధురమైన జ్ఞాపకాలను గుండెల్లో భద్రపరుచుకోడానికి ఆమె చేసిన మరో ప్రయత్నంగా భావించవచ్చు.

ఇల్లాంటి ఆవేదనే మరోరూపంలో 'ఆశాప్రియ' కథలోని ఆశాప్రియలో కనబడుతుంది. ఈ కథలో బుచ్చిబాబు ఒక సినిమా తార, ఒక సినిమాపత్రిక సంపాదకుడు–ఒకరినొకరు ద్వేషించుకుంటూ అంతరంగంలో ఆత్మీయతతో, ఆరాధనా భావంతో, ఎలా సతమతమైపోయారో చక్కగా చిత్రిస్తాడు. అంతరంగంపై తనకు తానుగా పెట్టుకున్న మూతను తొలగించే అవకాశం రాకుండానే ఆశాప్రియ తారాపథంనుండి రాలిపోతుంది. కథ కంచికి వెళ్లిపోతుంది.

కుముదం, సీతారత్నం, అరుణ, ఆశాప్రియ, వీళ్లందరూ ఒకే భావానికి విభిన్నరూపాలు. సంప్రదాయంకోసమో, ఆర్థిక సామాజిక స్థాయిలకోసమో, మనసుని చంపుకోడానికి వీళ్ళందరూ వ్యర్థ ప్రయత్నం చేశారు. బుచ్చిబాబు స్త్రీ పాత్రల విషయంలో సాధారణంగా కనబడే ధోరణి యిది. కొన్ని సందర్భాలలో అతని స్త్రీ పాత్రలుమానవత్వాన్ని గూడా మరచిపోయినట్టుగా కనబడతాయి. "జ్యోతి" కథలోని జ్యోతి, "అనురాగి ప్రస్థానం"

కథలోని శోభాసుందరి, "నొసటన వ్రాసిన వ్రాత" కథలోని రాజమ్మ, యిత్యాదుల గడుసుదనం, తమ ప్రయోజనాలకు మొగవారిని ఉపయోగించుకునే ధోరణి, మనల్ని ఆశ్చర్యపరిస్తే—"మీరూ—నేనూ—మామ" కథలోని పద్మావతి, "నిరంతరత్రయం" కథలోని సుగుణ, "వనకన్య" కథలోని వనకన్యల ప్రవర్తన మనకు బాధను కూడా కలిగిస్తుంది. అయితే, వీళ్లెవరూ సోమర్‌సెట్‌మామ్ నవల "ఆఫ్ హ్యూమన్ బాండేజి" లోని 'మార్‌డ్రిడ్' మాదిరిగా క్రూరులు కారు కొన్ని సందర్భాలలో బుచ్చిబాబు స్త్రీ పాత్రల అశక్తతను, బ్రతుకనేర్చిన తనాన్ని, క్షమించగలుగుతాం కూడా. బుచ్చిబాబుకు తన పాత్రలపట్ల సానుభూతి వుండడమే యిందుకు కారణం. బుచ్చిబాబు మామ్‌లో లేదని భావించిన "జీవితం పట్ల వుండాల్సిన గౌరవభావం" యిదే ననుకుంటాను.

బుచ్చిబాబు కథల్లో కనబడే స్త్రీ పాత్రల్లో "తెరచాప దించిన పడవ" కథలోని విదురమ్మకు ఒక ప్రత్యేకమైన స్థానం వుందని నా అభిప్రాయం రచయితగా అతడు పాత్ర చిత్రణలో ఆకాంక్షించిన 'అర్థం కాని గొడవ' విదురమ్మ కథలో పుష్కలంగా వుంటుంది. నా దృష్టిలో బుచ్చిబాబు కథల్లో ఆణిముత్యం అనదగ్గ కథ యిది. యుద్ధానికి పోయి తిరిగిరాని తన భర్త జ్ఞాపకాలతో సతమతమవుతూ, మృత్యువును ఆహ్వానిస్తూ బ్రతుకుతున్న పతివ్రతగా కథ మొదటిలో మనకు విదురమ్మ పరిచయం అవుతుంది అయితే, కథ చివరికొచ్చేసరికి పరిస్థితి వేరు. శరీరం చేసే అలజడికి తట్టుకోలేక, లొంగిపోయిన ఒక సామాన్యురాలిగా ఆమె మనకు కనిపిస్తుంది అయినా, ఆమెమీద మనకు కోపం రాదు. దీనికి కారణం రెండింటిలోనూ వున్నది విదురమ్మ నిసలైన వ్యక్తిత్వమే! ఆమె తన భర్తని ఎంతగానో ప్రేమించింది. అతడి ఎడబాటును భరించలేక పోయింది యుద్ధానికి వెళ్లిన భర్త తిరిగి వస్తాడేమోనన్న ఆశతో అతడి గదిని ఆమె ప్రతీరోజూ శుభ్రంచేసి, అతడు వాడే వస్తువులన్నీ ఎక్కడివక్కడే వుంచేది. భర్తమీద వున్న ప్రేమను అతడు వాడిన వస్తువులపైన కూడా చూపించేది. అందుచేతనే, ప్రభుత్వం వారు ఆమెకున్న కొద్దిపాటి భూమిలో కొన్ని గజాల స్థలాన్ని కమ్యూనిటీహాలు నిర్మాణం కోసం కలుపుకోవాలని అడిగినా—తనూ, తనభర్త, కూర్చుని కబుర్లు చెప్పుకున్న బండరాయిని కదల్చడానికి వీల్లేదంటూ అభ్యంతరం చెప్పింది. అతి బలవంతంమీద ఆ బండరాయిని కాస్త ప్రక్కకి తొలగించడానికి ఒప్పుకుంది గానీ, కమ్యూనిటీహాలు నిర్మాణానికి అడ్డంగా వున్న చెట్టును మాత్రం కొట్టడానికి ఒప్పుకోలేదు. ఎందుకంటే, ఆ బండ రాయి మీద వున్నవి తను గడిపిన తీయటిరోజుల జ్ఞాపకాలు. తను పోయినప్పుడు, ఆ జ్ఞాపకాల చిహ్నం ఏమయినా ఫరవాలేదు. కాని, తాను చెట్టు మొదటిలో కప్పెట్టింది తన చేదు జ్ఞాపకాలను. అవి మాత్రం—తనతోనే పోవాలి. అందుకే ఆ జ్ఞాపక చిహ్నాన్ని చేజిక్కించుకోవడం కోసం ప్రాణాల్ని కూడా పణంగా పెట్టుకొంది. మనిషిలో వుండే బొమ్మా, బొరుసుల కథను హృదయానికి హత్తుకునే రీతిలో చెబుతాడు బుచ్చిబాబు ఈ కథలో. విదురమ్మ మనస్తత్వంలోని వైచిత్రిని ఆవిష్కరించడం మాత్రమే గాక, బుచ్చిబాబు ఈ కథలో మరొక ప్రయోజనాన్ని కూడా సాధించగలిగాడు. అది, వ్యక్తి ప్రయోజనానికీ, సామాజిక ప్రయోజనానికీ మధ్య గల తేడాను చూపించడం. సంఘానికి కమ్యూనిటీ హాలు ముఖ్యం. ఒక ముదుసలి విధవరాలు బండరాళ్లపై పెట్టుకున్న సెంటిమెంటు ముఖ్యం కాదు. సామూహిక ప్రయోజనాన్ని సాధించదలుచుకున్నప్పుడు వ్యక్తి చేసే ఆర్తనాదం పట్టించుకునే తీరిక ఎవరికీ వుండదనే సత్యాన్ని ఈ కథ మనకు మరోమారు జ్ఞాపకం చేస్తుంది. చాలాకాలం జ్ఞాపకం వుండే కథ యిది. కథకు కావలసిన మొదలు, మధ్య, తుది, భాగాలు మూడూ యిందులో చక్కగా ఇమిరాయి.

కథకి తుదీ,మొదలూ, లేకుండా వుండి—మధ్యలో ప్రారంభమై మధ్యలో అంతమయ్యే ధోరణిని, అంటే, చెహోవ్ రీతిలో కథ చెప్పే ధోరణిని, సోమర్‌సెట్ మామ్ హర్షించనట్టే బుచ్చిబాబు కూడా హర్షించడు "చెహోవ్ పద్ధతి కథ యిసుక మీద కెరటం దిగవిడిచిన చార లాంటిది నాకది తృప్తి నివ్వదు. ఆ కథ కెరటంగా కనబడాలి. కెరటం వెనుక సముద్రం హోరు వినబడాలి" [21] అంటాడతను. సోమర్‌సెట్‌మామ్ కూడా యిదే అభిప్రాయాన్ని తన 'ఈస్ట్ అండ్ వెస్ట్' కథల సంపుటి మొదటి మాటలో వ్యక్తీకరించడాన్ని గమనించవలసి వుంది. "కథకు తుదీ మొదలూ వుండగూడదని అనడం తలా తోకాలేని చేప కావాలనుకోవడం లాంటిది. ఆ రెండూ లేకపోతే అది చేప కానేకాదు" [22] అన్న మామ్, సరిఅయిన తుదీ, మొదలూ దొరకక తన దృష్టిలోకి వచ్చిన మంచి యితివృత్తాలను వదులుకున్న వైనాన్ని కూడా తన 'రైటర్స్ నోట్‌బుక్'లో రాసుకున్నాడు.

బుచ్చిబాబు కూడా యిట్లాంటి వాటిని వదిలిపెట్టాలనుకున్నాడు గానీ, కొన్ని సందర్భాలలో నిగ్రహించుకోలేక పోయాడనుకుంటాను 'రైటర్స్ నోట్‌బుక్'లో మామ్ ప్రస్తావించి, కథగా

రాయకుండా వదిలేసిన ఉదంతాన్ని ప్రాతిపదికగా చేసుకుని 'మామ్ రాయని కథ' అంటూ రాసి దాన్నొక కాశీమజిలీ కథలాగా తయారు చేశాడు[23] "బీ" అనే కథ విషయంలో కూడా పరిస్థితి యింతే!

మాంసం సాహేబు కూతురు 'హషీమాబీ'కి వేగంగా తిరిగే ఏ చక్రాన్నయినా ఆపడం యిష్టం. తిరుగుతున్న ఫేన్‌లోనూ, సైకిల్ చక్రంలోనూ, కుట్టుమిషను చక్రంలోనూ, వేళ్ళు పెట్టి దెబ్బలు తగిలించుకుంటూ వుంటుంది ఈ అలవాటును మనస్తత్త్వ శాస్త్రరీత్యా ఒక అబ్‌సెషన్ అని చెప్పవచ్చు ఇట్లాంటివి ఏర్పడ్డానికి చిన్నతనంలో పెరిగిన వాతావరణం దగ్గిర నుంచి, చాలా కారణాలుంటాయి. 'బీ' విషయంలో ఈ అలవాటు ఒక శాపంగా మారి ఆమె బ్రతుకును విషాదపు అగాధాల్లోకి తోసేస్తుంది. చివరకు ఆమె జీవితాన్నే బలితీసుకుంటుంది. హషీమాబీలోని ఈ అబ్‌సెషన్ వెనుక ఏదో ఒక 'మసోఖిక్' ప్రవృత్తి కారణభూతంగా వుండి వుంటుంది. కాని, బుచ్చిబాబు దీనికొక తాత్త్వికార్థం యివ్వడానికి ప్రయత్నించాడు. నిత్యకర్మ అనే చక్రంలో తిరిగిపోతున్న మనిషిని అందులోంచి తప్పించడానికిగాను, చక్రం ఆపేందుకు జరిగే ప్రయత్నానికి ప్రతీకగా 'బీ'ని నిలుపుదామనుకొని, దానిని సక్రమంగా నిర్వహించలేక అభాసుపాలయ్యాడు. ఈకథను బుచ్చిబాబు ఒక 'సైకలాజికల్ స్టోరీ'గా ప్రారంభించి, మధ్యలో ఆ భావనను వదిలి తాత్త్వికార్థాలవైపు, భగవద్గీత వైపు పరిగెట్టాడు. అందువల్లనే 'బీ' కథ అసమగ్రంగా వున్నట్టు కనబడుతుంది.

యిక, "నేను" అనబడే కథకుడికి 'బీ' పట్ల అంతటి కుతూహలం వుండడానికి మాత్రం సమర్థన చెప్పకోవచ్చు. అతడి అంతరంగంలో 'బీ'కి వున్న 'మసోఖిక్' ప్రవృత్తిలాంటిదే ఉన్నది. తాను చేయదలచి చేయలేని పనుల్ని 'బీ' అవలీలగా చేస్తూండడంతో, అతడు 'బీ'కి ఓ రకంగా మానసికంగా సన్నిహితుడయ్యాడు. యిక, మరెన్నకు 'బీ' పై గల అభిప్రాయాన్ని ప్రమాదం జరిగిన ప్రదేశంలో దొరికిన 'బీ' తల వెంట్రుకను అతడు దాచుకోడాన్ని బట్టే అవగతం చేసుకోవచ్చు. యిట్లాంటి స్టఫ్ ఫెటిషిసమ్ "ముగింపు మీకు తెలుసు" కథలోని అటవీశాఖ ఉద్యోగి విషయంలో కూడా కనబడుతుంది. తను ప్రేమించిన అమ్మాయి తల వెంట్రుకను అతడు తన చేతి పిడికర్రలో దాచుకుంటాడు. "ఆ రాలిన ఆకులు" కథలోని కాంతం తన మరిది పంపిన గులాబీ మొక్కను ఆప్యాయంగా పెంచడం, అది ఎప్పుడు పువ్వు పూస్తుందా, దాన్నెప్పుడు తల్లో పెట్టుకుందామా అని కలవరించడం, కూడా ఈబాపతు అంతరంగ సంక్షోభానికి గుర్తుగా చెప్పకోవచ్చు. 'చివరకు మిగిలేది' నవలలో దయానిధి అమృతం తల వెంట్రుకను దాచుకోవడాన్ని కూడా పాఠకులు ఈ సందర్భంలో గుర్తుకు తెచ్చుకోవచ్చు. మనస్తత్త్వ శాస్త్రంలో తనకు గల పరిజ్ఞానాన్ని యిలా పలు సందర్భాలలో బుచ్చిబాబు పాత్రల స్వరూపాన్ని తీర్చిదిద్దేందుకు ఉపయోగించుకున్నాడు. "వీరేశలింగం ఏం చెయ్యాలి?" కథలోని మైథిలి, "యువపాశం" కథలోని మాయల విషయంలో జరిగిన సబ్లిమేషన్ యాక్టివిటీకి కూడా మనస్తత్త్వ శాస్త్రపరమైన వ్యాఖ్యానం చెయ్యవచ్చు.

ఇదంతా బాగానేవుందిగాని, "బీ" జీవిత కథను బుచ్చిబాబు మనకు చూపించిన తీరు అతని తాత్త్విక పరిజ్ఞానానికి గానీ, మనస్తత్త్వశాస్త్ర పరిజ్ఞానానికి గానీ సూచికగా లేదు "బీ" వింత ప్రవర్తన వెనుకగల విచిత్ర మనస్తత్వాన్ని గాని, ఆ విచిత్ర ప్రవర్తన ప్రేరేపించే తాత్త్విక జిజ్ఞాసను గాని, ఆవిష్కరించడంలో రచయిత దాదాపుగా విఫలీకృతుడయ్యాడు. మనం చెయ్యగలిగిందల్లా దేన్ని గురించీ పట్టించుకోకుండా వుండడమేనన్న మరెన్ని సూక్తి కథకు 'నీతి' కావడం 'బీ' కథను మరింత గందరగోళంలో పడేసింది కథలో ఆలోచించవలసిన విషయం వుండాలి నిజమే! కాని, దానికీ ఒక పరిమితి వుంది సోమర్‌సెట్‌మామ్ అన్నట్టు — పారకుణ్ణి గాలిలో వదిలెయ్యడం మంచిదేగాని, పారకుడితోబాటు రచయిత కూడా గాలిలో వుండిపోకూడదు![24]

ముందే చెప్పినట్టు, బుచ్చిబాబుకి మనిషి మనసులో జరిగే అలజడి వివరించడం చాలా అభిమాన పాత్రమైన విషయం ఇందుకుగాను అతను 'చైతన్యస్రవంతి' విధానాన్ని కూడా ఉపయోగించుకున్నాడు. పాశ్చాత్య సాహితీసీమలో జేమ్స్‌జాయిస్, వర్జీనియా వుల్ఫ్, మార్సెల్ ప్రౌస్ట్ యిత్యాదులచే రచనలు చేయించిన స్ట్రీమ్ ఆఫ్ కాన్షస్‌నెస్ రచనా శిల్పానికి 'చైతన్య స్రవంతి' అని బారసాల చేసింది బుచ్చిబాబే అనుకుంటాను. అయితే — ఈ ధోరణిలో అతడు రాసిన 'చైతన్య స్రవంతి' అనే పేరు గల కథ కథగా రాణించలేదు. ఈ కథ చదివితే చైతన్య స్రవంతి విధానానికి వున్న కొద్దిపాటి ప్రయోజనం కూడా లేదనే భ్రాంతి కలుగుతుంది.

కథకుడుగా బుచ్చిబాబును గురించి తెలిసే ఏ పరిశీలనలో నయినా అతని 'రసెల్‌కి అంకితమైన రెండు కథలు' గురించి చెప్పకపోతే — అది అసమగ్ర పరిశీలనే అవుతుందని నా అభిప్రాయం. పాశ్చాత్య తత్త్వశాస్త్రవేత్తలలో తీవ్రంగా వివాదానికి గురి అయిన వారిలో బెర్ట్రాండ్ రసెల్ ఒకడు. 'నీతి' అనే పేరుతో, 'సంప్రదాయం' అనే పేరుతో, సంఘంలో పేరుకుపోయివున్న కుళ్ళను ఎదుర్కోడానికి రసెల్ చేసినంతటి పోరాటం సమకాలీన ప్రపంచంలో మరే తత్త్వశాస్త్రవేత్త చేసివుండడు. ఆ మహనీయుడు రాసిన "What I believe" అనే గ్రంథంలోని కొన్ని భావాలను ప్రాతిపదికగా చేసుకుని బుచ్చిబాబు 'మరమేకులు - చీరమడతలు', 'కొత్త నీరు — పాతవంతెన' అనే రెండు కథల్ని రాశాడు. రసెల్ భావాల ప్రభావం తెలుగు సాహిత్యంపై ప్రత్యక్షంగా పడడం యిదే మొదలు అని చెప్పవచ్చు.[25] రసెల్ సిద్ధాంతాలలోని 'స్వేచ్ఛా ఆరాధన' సోమర్‌సెట్‌మామ్‌ని ఆకట్టుకున్నట్టుగానే, బుచ్చిబాబుని కూడా ఆకట్టుకుంది.

'మరమేకులు — చీరమడతలు' కథలో బుచ్చిబాబు చెప్పదలుచుకున్నవి రెండు విషయాలు. ఒకటి — నీతికీ, అవినీతికీ, మధ్యవున్న దూరం. రెండోది — మరమేకులకు, చీర మడతలకు గల వ్యత్యాసం. ఈ కథలోని రవిప్రకాశం సౌందర్యాన్వేషణను వ్యభిచారం క్రిందా — వ్యభిచారాన్ని ఘోరమైన నేరం క్రిందా పరిగణించి లోకం ఆతనిని యిబ్బందిపాలు చేయడంపట్ల మనం సానుభూతి చూపించవచ్చు. దైవభక్తుడుగా, నీతిమంతుడుగా చలామణీ అవుతూ గంగాధరం చేసే

పరపీడనా కృత్యాలను మనం ద్వేషించవచ్చు అయితే, అంతమాత్రాన వ్యాపార నిర్వహణలో రవిప్రకాశం అసమర్థతను మనం సమర్థించలేం. వ్యాపారస్తులకు కావలసింది చిత్రకారులు కారు. వాళ్లకు కావలసింది మరమేకులే! పీరమడలలెందుకు? లదెప్పిగాక, రవిప్రకాశం చిత్రం ఆర్ట్ ఎగ్జిబిషన్‌లో ఉత్తమంగా ఎన్నికచేయబడి—ఆటు తర్వాత గంగాధరం పార్టీవాళ్ల 'అవిసెలి మార్కు' ప్రచారం ద్వారా బహుమానార్హతను కోల్పోయిందనడం సమంజసంగ వుండదు

ఇక, 'కొత్తవంతెన — పాతనీరు' కథలో రచయిత అలిమేలు జీవితానికి యిచ్చిన ముగింపు, కథను గందరగోళంలో పడేసింది. నిజాయితీపరుడయిన ఇంజనీరు ప్రభాకరాన్ని, అలిమేలుతో సంబంధం పెట్టుకున్నాడన్న కారణంగా ప్రజలు కించపరుస్తున్నందుకు- అతడి పై పాఠకులకు కలిగే 'సింపతీ', కథ చివరికొచ్చేసరికి అలిమేలు చావు ఫలితంగా కరిగిపోతుంది. బుచ్చిబాబే అన్నట్టు ఈ కథలోని ఇంజనీరు ఉదంతం వెనుక బావం, మెదడు వుంటే — అతని ప్రేయసి అలిమేలు కథ వెనుక హృదయం, ఉద్రేకం వున్నాయి. బుచ్చిబాబుని మొదటి నుండీ ఆకట్టుకునేది ఈ రెండో విషయమే! అందుచేతనే ఒక దోవలో బయలుదేరి మరొక దోవలో బయటకు వచ్చాడు బుచ్చిబాబు.

నిజానికి — ఏ కథకుణ్ణయినా ముందుగా కదిలించేది హృదయానికి సంబంధించిన ఉద్రేకాలే! దీనికున్న శక్తి మెదడుకు సంబంధించిన భావానికి లేదు. అందుచేత ఒక మంచికథ మేధాపరంగా లోతయిన భావాల నెన్నింటినో వ్యక్తీకరించవచ్చు. కాని — ఒక గొప్ప బావం మంచికథకు ప్రాతిపదిక కాగలదని చెప్పలేము.

ఏదిఏమైనా — ఈ వివరణలన్నీ కథ రాద్దామని కూర్చున్న కథకుడికి అవసరం లేదు. ఏదో ఒక భావం, లేదా ఏదో ఒక సంఘటన తనని కదిలించి నప్పుడల్లా అతడు కథ చెప్పడానికి ప్రయత్నిస్తాడు. అతనిది నిరంతర కృషి. ఈ విషయాన్ని గురించి చెబుతూ అంటాడు బుచ్చిబాబు —

"పక్షి గూడుకట్టుకుంటుంది. దానికోసం కావాల్సిన ఆకులలము, గడ్డి, పుల్లలు — ఎన్నెన్నో పోగుచేసుకొచ్చి గూడు కడుతుంది. అందులో గుడ్డు పెడుతుంది. అనుక్షణమూ ఏదో సేకరిస్తూ వుంటాడు కథకుడు. పెద్దగాలికి గూడు పడి గ్రుడ్డు పగులుతుంది. మళ్లా మరో కథ రాస్తాడు. తుఫానుకి ఆ చెట్టు కూలుతుంది. మరోచోటికి పోతాడు. మనుషులను కూలని చెట్లుగా భ్రమించి, వారి హృదయంలో జొరబడి వారి ఆనందానికి కృషిచేసే జీవి కథకుడు."[26] తన అల్పజీవితంలో బుచ్చిబాబు చేసిన అనల్ప కృషి యిదే! కథా రచయితగా బుచ్చిబాబు దృక్పథం ఈనాటి పాఠకులు కొందరికి సరిపడకపోవచ్చును. సామాజిక ప్రయోజనం కానరాదని పెదిమ విరవవచ్చును. కాని, తను చేపట్టిన కృషిలో బుచ్చిబాబుకు గల నిజాయితీని మాత్రం శంకించ నవసరం లేదు. మార్కెట్‌లో ఏ సరుకుకు గిరాకీవుందో పరిశీలించి — దానికనుగుణంగా సోషలిస్ట్ మార్కు కథల్నో, రొమాంటిక్ ధోరణి కథలనో, అతను రాయలేదు. ఇతరుల అభిప్రాయం ఏదన్నాగానీ— తన హృదయాన్ని కదిలించి, ఉద్వేగం కలిగించిన విషయాల గురించే అతను రాశాడు. బుచ్చిబాబు అంటాడు— "నిజాయితీ, ఉద్వేగము ఈ రెండూ కథకుడి ఆయువు పట్లు. ఒకటి — గుండె, రెండవది — నాడి" అని.[27] కథకుడిగా బుచ్చిబాబు మేనిఫెస్టో యిది. అతని కథలు యిప్పటికీ, బహుశా ఎప్పటికీ తమ స్థానాన్ని నిలబెట్టుకోడానికి గల కారణం యిదేననుకుంటాను!

# అధోజ్ఞాపికలు

1. మాడరన్ షార్ట్ స్టోరీ—హెచ్ ఇ. బేట్స్, పు–26.
2. బుచ్చిబాబు వ్యాసాలు, పే–20.
3. సెలెక్టెడ్ ప్రిఫేసెస్ ఎండ్ ఇంట్రడక్షన్స్—డబుల్యు సోమర్ సెట్ మామ్, పు–55.
4. బుచ్చిబాబు వ్యాసాలు, పే–293, 294
5. అదే—పే-39
6. "ఎల్లోరాలో ఏకాంతసేవ" కథలో.
7. "నన్నుగురించి కథరాయవూ?" కథలో.
8. "అనురాగ ప్రస్తారం" కథలో
9. అంతరంగకథనం"—పేజీలు 121, 122.
10. బుచ్చిబాబు వ్యాసాలు, పే–38.
11. సెలెక్టెడ్ ప్రిఫేసెస్ ఎండ్ ఇంట్రడక్షన్స్ ఆఫ్ డబుల్యు సోమర్‌సెట్ మామ్, పు–55.
12. అదే పు–43.
13. 'స్రవంతి' -ఆగస్ట్ 1956.
14. బుచ్చిబాబు వ్యాసాలు, పే–15.
15. అదే పే–16.
16. "నావలిస్ట్స్ ఆన్ ది నావెల్" నుంచి మిరియమ్ ఆల్లాట్ (సం) పు–272.
17. మాడరన్ షార్ట్ స్టోరీ, హెచ్. ఇ. బేట్స్, పు–23.
18. అదే పు–11.
19. 'అంతరంగకథనం'—బుచ్చిబాబు, పే–83.
20. అంతరంగకథనం, బుచ్చిబాబు, పే–82.
21. బుచ్చిబాబు వ్యాసాలు, పే–10.
22. సెలెక్టెడ్ ప్రిఫేసెస్ ఎండ్ ఇంట్రడక్షన్స్, డబుల్యు. సోమర్సెట్ మామ్, పు–51.

23 ఇదే ఉదంతాన్ని ఇచ్ఛాపురం జగన్నాథరావుగారు 'ఖరీదైన ఉత్తరం' అనే పేరుతో కథగా రాశారు. అది కూడా కథగా రాణించలేదు

24 రైటర్స్ నోట్‌బుక్, పు-255.

25 రసెల్ కూడా తన భావాలను ప్రచారంచేస్తూ కొన్ని కథలు రాశాడు. అయితే, ఆ ప్రయత్నం అంతగా రాణించలేదు. తన వ్యాసాలను ప్రచురించడానికి పోటీపడి ముందుకువచ్చే ప్రచురణ సంస్థలు కూడా తన కథలను ముద్రించడానికి ఉత్సాహం చూపించలేదని రసెల్ తన 'ఆత్మకథ'లో రాసుకున్నాడు.

26 బుచ్చిబాబు వ్యాసాలు, పే-297.

27 బుచ్చిబాబు వ్యాసాలు, పే-295.

# కచ్ఛపి

## శ్రీ వేముగంటి నరసింహాచార్యులు

శా॥ వాణీ పాణికి సాలాయాంగుళులు సంభావించి పల్కింపని
ద్రాణమ్మైన జనాంతరంగముల జాగ్రద్దీప్తిగా కచ్ఛపీ
వీణారావ ఝరీ తరంగ నికరావిష్కార సారమ్ముగా
ప్రాణస్పందన క్రందుకో మదిని అశ్రాంతమ్ము కాంక్షించెదన్ !

సీ॥ పలుకుతొయ్యలి ముద్దులొలుకు మాటలతేనె
చినుకు తీయదనంపు తొణకరింపు
వాగ్దేవి కెమ్మోవిపై తళుకొత్తెడు
వెలనవ్వు వెన్నెల చిలుకరింపు
శారదకర సరోజద్వయీ ధృతమణి
కంకణక్వణముల కందళింపు
నలువచెలువ మేలిమొల నూలిబంగరు
మువ్వలసవ్వడి ముచ్చటింపు

గీ॥ మెలపి కలబోసుకొని కళావిలసనముగ
మూగగొంతులలో రాగములు రసింప
చేదుగుండెలలో స్వాదునాదమెసగ
పేర్మి రవళించుమా కచ్ఛపీ విపంచి !

ఉ॥ చేతనావికాసము రచించు విశిష్ట సుధాధురీణతా
గీతిక రాతిగుండె కరగింప మనోహర భవ్యభావనా
రీతిని మేళవించి, సవరించి, వికస్వర సుస్వరావళీ
నూతనగాన వైభవము నూల్కొన పల్కుము దివ్య కచ్ఛపీ

గీ॥ పలుకుపూవుదోట చిలుకు కమ్మనతేట
క్రమభావవాక్కీర్తికముల మూట
జాను తెనుగుపాట వీనులవిందు గా
వింప మ్రోయు కచ్ఛపీ విపంచి !

గీ॥ మసృణ మందార మకరంద మధురిమలను
సవదరించు తంత్రీరణత్ సరిగమలను
గిలకరించి చైతన్య సంగీతమును ధ్వ
నింపవలె కచ్ఛపీ ! విశ్వనిర్వృతముగ !

శ్రీ సోమసుందర్

# కవిత్వం - అనుభవ స్మృతి తరంగం

వంగదేశ విభజనకు ప్రతిఘటనోద్యమ దీప్తితో, బంకిం చంద్రుని ప్రఖ్యాత గీతం—వందేమాతరం ప్రాదుర్భవించింది. బెంగాల్‌లోనే గాక, యావద్దేశంలోనూ మహోద్యమాన్ని ఉత్సేకించింది.

ఏ ఒక్క గీతమో, కావ్యమో జాతిని శాశ్వతంగా మేలుకొల్ప గలుగుతుందా ? అదే దాని శాశ్వత శక్తి అయితే, ఆ వంగదేశాన్ని రెండు ముక్కలు చేస్తే తప్ప భారత స్వాతంత్ర్యం సిద్ధించకపోయే దురవస్థ కలిగేదేనా ?

అంటే జాతి కూడా వ్యక్తిలాగే నిద్రా జాగృతి చైతన్యాల మధ్య నిరంతరం ఊగిసలాడుతూనే వుంటుందని తేలుతుంది. పునః పునఃజాతికి జాగృతీ పవనం సోకుతూనే ఉండాలనీ మనకర్థమవు తుంది

అలాగే ఏ మత్తుమందు సిద్ధాంతమైనా జాతిని శాశ్వతంగా నిద్రపుచ్చనూ లేదు. అది ఎంత శక్తివంతమైనదైనా సరే; ఎంత శక్తిమంతుడు ప్రచలితం చేసిందైనాసరే! ఆధునిక ప్రపంచం హిట్లర్ కన్న ప్రచండ శక్తిమంతుడ్ని చూడబోదు; అలాంటి వాడి దుర్మార్గ స్వరూపాలన్నీ ఒక దశాబ్దం పూర్తికాకముందే మట్టికరిచాయి! కన కనే నిద్రా, మెలకువా, స్తబ్దలా చైతన్యం వంటి ద్వంద్వాలు వ్యక్తికి లాగే జాతికి సైతం ఉల్లాసీదాలు మాత్రమే !

లోకానికి వలెనే సాహిత్యానికి కూడా అటు మెలకువా కాక, ఇటు నిద్రా కాక—ఏదో సందిగ్ధావస్థ వంటిదీ తప్పదు. వేరొక్రపక్క, నిర్దిష్ట మార్గం ఏర్పరచుకున్న సాహిత్య దర్శనకూ స్థానం ఉండక పోదు. ఇలాంటిది కేవలం వైయక్తికమే కానక్కరలేదు; సామూహి కమూ కావచ్చు. వికీర్ణతే కానక్కరలేదు, సంకీర్ణత కూడా కావచ్చు. సాహిత్య పరమైన ఈ దర్శన, ఆంతరిక పారదర్శకత్వం ద్వారా స్పష్టపడనూవచ్చు !

వ్యక్తి సమాజమూ అవిభాజ్యప్రమాణాలైనట్లే, కవీప్రమాతా సైతం అవిభాజ్య ప్రమాణాలే ! కవిత్వంలో ఆత్మాశ్రయ వస్త్వా శ్రయ విధానాల మధ్య విభాజ్య రేఖను నిర్ణయించడమూ అసాధ్యమే! స్వీకృత వస్తువు కవి హృదయంలో మరిగి, ఆవిరి రూపంగానే అభి వ్యక్తమవుతుంది కనక !

## యవనవ్వనం

ఆధునిక ఆంగ్ల కవిత్వానికి వైతాళికుడనదగిన మహాకవి విలియం బట్లర్ ఏట్సు. అతని ఆరంభ యౌవనోద్వేగ కవితా హృదయం గురించి మార్టిన్ గిల్కెస్ అనే విమర్శకుడు చక్కని వ్యాస మొకటి రచించాడు. అందులో అన్ని దేశాలకీ అన్ని కాలాలకీ సరిపడే మాట ఒకటి అన్నాడు. "అతని ప్రారంభ కవితా కృషి యావత్తూ స్వాప్నిక లోకం ద్వారా వాస్తవికతను చేరుకుందుకే కేంద్రీకృతమైంది" అని. ఇది స్థూల దృష్టికి ఉత్త బుకాయింపుగా తోచవచ్చు. లేదా అస్తవ్యస్తంగా ఉన్నట్లు కనిపించవచ్చు !

వివరించుకుంటే పై సూక్తిలోని సత్యం తేటతెల్లం కాక పోదు. కారణమేమంటే, మనిషి దర్శించే స్వప్నలోక మంతా వాస్త వానుభవం మీద ఆధారపడేదే కదా ! అంటే వాస్తవానుభవాలతో దూర సంబంధమో, సన్నిహిత సంబంధమో ఉంటే తప్ప స్వప్నాలు కలుగవని మనస్తత్వ శాస్త్రవేత్తలు నిర్ణయిస్తున్నారు. అలాగే– కవిత్వ మంతా జాగృతానుభవ స్వాప్నిక సమాహారమేనని కవిత్వవేత్తలు ధ్రువపరుస్తున్నారు. ఆ జాగృత, స్వప్న మార్గాలలో సంచరిస్తూ వాస్తవిక లోకాన్ని చేరుకుందుకే యేట్సు కవి కృషి సలిపాడని గిల్కెస్ ఉద్ఘాటిస్తున్నాడన్న మాట.

ఈ సత్యాన్ని సక్రమంగా అవగాహన చేసుకోలేని ఆధునికులు కొందరు అరాచకత్వానికి దిగుతున్నారు. గొంతునరకూ మాదక ద్రవ్యాలు నింపి అప్పుడు కలిగిన అపస్మారక స్థితిలో వెలికివచ్చిన అక్షరాలను రాసుకుంటూ పోతున్నారు. దీనికి ఆటోమేటిక్ రైటింగు అనో, చైతన్య స్రవంతి అనో, అధి వాస్తవికతా స్వప్నచాలనమనో ఏదో ఒక వింతపేరు పెడుతున్నారు. వెర్రి సొరులుగా ఊగిపోతు న్నారు. ఇలాంటి వికార శకారత్వం వల్ల పాఠకులకు ఫలప్రాప్తి చేకూరదు. సాధకులకా నిష్కృతి లభించదు.

ఏట్సు కవి యవనవ్వనం గురించి గిల్కెస్ చెప్పిన స్వాప్నిక లోకం ఇలాంటిది కాదు. ఆరంభ యౌవనుని హృదయం దివాస్వప్న సమాహారంగా ప్రక్కదలి పోతుంది. ఆ స్వప్నలోక సంచారం ద్వారా సిద్ధించిన కవితా గమ్యం వాస్తవికతా రూపం దాలుస్తుంది. దీనినే మరొక రీతిగా వివరించుకోవాలంటే—ముడి పదార్థం ఏంటి వాస్తవి కత, కవితాసాధకుని హృదయంలో స్వప్న తలంలో వస్త్రక్షాళిత చేయబడుతుంది.

## యోచన - భావుకత

ఐతే యవనవ్వనం అనేది స్థూల దృష్టికి ఒక దశా విశేషంగా కనిపిస్తుంది. కాని కవితా పథంలో నిర్దిష్ట వయోపరిమితిలోనే సంభ విస్తుందని చెప్పలేము. తార్కిక బుద్ధి, హేతువాద ప్రధానదర్శనా నైశిత్యమూ, తాత్త్విక చింతనా—వ్యక్తి మనసులో అభివృద్ధి పొందే కొద్దీ—ఈ తొలకరి మబ్బుల ఆర్భాటం తొలగిపోవచ్చు. కాని యోచ

నాదార మితిమీరితే మాత్రం కవితా భావుకత వీగిపోయే ప్రమాదం ఏర్పడుతుంది. చిన్నతనం నుంచే ఆలోచనా పరులై తాత్త్విక సమస్యలపై సదమదమయ్యే వారూ ఉంటారు. అలాంటి వారు కవులు కాలేరు. మేధావులో, శాస్త్రవేత్తలో కాగలరు. ఎన్నేళ్ళు పైబడ్డా—ఆంతరిక సమస్యల జోలికే పోనివారూ ఉండవచ్చు.

యోచనాశీలి మనస్సు విపరీత పరిస్థితులకు లోనై అల్లకల్లోలమైనపుడే అమృతం పుట్టినా, హాలాహలం పుట్టినా సహజంగా ఉంటుంది. ప్రశాంతంగా ఒడిదుడుకులు లేకుండా తారురోడ్డులాగు బ్రతుకు సాఫీగా గడిచిపోతే ఏముంది? చుట్టకుదురుమీది పాల కడవలో ఏ తొందరా తొట్రుపాటూ పుట్టదు; నవనీతమూ పుట్టదు. సామాన్యు లాశించే ప్రశాంతతలో కవితా హృదయం పొంగదు. ఒక దారీ వెదుక్కోదు. జడత్వానికి మారుపేరు నిలకడ; కదలికకు మరో పేరు సంచలనం!

నిజమైన సుఫలాలందుకుందుకు సాహసం వినా మార్గాంతరం లేదు. ప్రతిభ ఆవిష్కరింపబడటానికి ప్రయోగశాలిత వినా మార్గాంతరం లేదు. ఐతే సాహసోపేత ప్రయోగం నవ్యతను మాత్రమే నిర్దేశంగా పెట్టుకుంటే సరిపోదు; భవ్యతను అధిష్ఠానంగా అమర్చుకోవడం మరువ కూడదు. సాహసం దుస్సాహసంగా మారితే—ప్రయోగం ప్రమాదకరంగా వికటిస్తుంది. భాషా సంపద, భావనా శాలితలు ఏ కవి ప్రయోగానికైనా పునాదులే! వారసత్వాన్ని విస్మరించే ఏ ప్రయోగమైనా ఆ మట్టినుంచి పుట్టిన మొక్కలా పెరగదు. మానుకట్టి ఆకాశ శూన్యతలాన్ని ఆలింగనం చేసుకోజాలదు.

అలా పెంపొందే రచన కేవలం కవిత్వమే కానక్కరలేదు. నవల అయినా, కథ అయినా కావచ్చు. నిజంగా గొప్ప నవల సర్వాంగ సుందరంగా అమరిన సాహితీ స్వరూపమే! అలాంటి దానిని గొప్ప గద్య కావ్యం కాదని ఎవ్వడూ అనుకోడు. నవలకు పరిపక్వమైన పరాత్మక దృష్టి అవసరమవుతుంది. వస్త్వాశ్రయ పరిశీలన ముఖ్యం. మనస్తత్త్వ గవేషణ ప్రాధాన్యత వహిస్తుంది. అప్పుడే కథన శిల్ప కౌశలం రాణకెక్కుతుంది.

కవిత్వానికి కావలసిన భూతలం వేరు. విశేష భావుకత దానికి పుష్టినిస్తుంది. కల్పనా వైదుష్యం పరిపోషిస్తుంది. శిల్ప సంవిధాన మర్మజ్ఞత దాని శరీర సౌందర్యాన్ని ఆరోగ్యవంతం చేస్తుంది. సంయమోచిత స్ఫురణ పిచ్చిరెమ్మలు తొలగిస్తుంది. కవితోపకరణలుగా ఉపమారూపకాదులు, పదచిత్రాలు, ఇమేజరీవంటివన్నీ రసధాతువు లందిస్తాయి.

## సాధనతోనే ప్రతిభ

ఇలాంటి సర్వలక్షణ లక్షితంగా కవిత సహృదయోల్లాసం పొందడానికి కవికి నిరంతర సాధన అత్యవసరం. భౌతిక ఆంతరిక లక్షణాల కవితకు ఎంత సమృద్ధిగా సమకూరినా కవి ప్రతిభా విశేషం మీదనే ఉత్తమ కావ్యం ఆధారపడుతుంది కనకనే కవిత ఆత్మాశ్రయ పరిధి నుంచి ఎన్నడూ పూర్తిగా దాటిపోదు. ఉపకరణాలు సమకూరినపుడు కవితకు ఒక స్వయంచాలనశక్తి లభిస్తుంది. ఒక క్లైయిర్ వోయన్సును దోహదం చేస్తుంది. మానసిక నేత్రంలో స్థితినీ గతినీ సమగ్రంగా వీక్షించగల శక్తిని కలిగిస్తుందన్నమాట అదే కవికి దివ్య దృష్టి వంటిది. ఇది కవితకు ప్రధాన విజయమే!

నవలా రచనకు అంత మాత్రం చాలదు. తన్ను ప్రతినిత్యం నిలిపి ప్రశ్నించే వాస్తవ పరిస్థితుల నుంచి ఎంతో కొంత దూరం జరిగి, ఏకాంత గుహాలయ ప్రవేశం చేసేవాడు కవి కాగలడు కాని నవలాకారు డెన్నడూ కాలేడు. నవలా రచయిత వాస్తవికతను ఉన్నదున్నట్లు పరిగ్రహించాలి; దాని గతిని పోల్చుకోగల సాహసమతి నవలా రచయిత కాగలడు. గద్య రచనకు స్వచ్ఛత ప్రధానమైతే కవితకు గుప్తత జీవలక్షణం. అలా అన్నంత మాత్రంలో అన్నిటినీ వాచ్యం చేయాలని అర్థం కాదు. అదే ప్రధాన లక్షణమైతే అడంగి పోసికోలు కబుర్లుగా మారిపోతుంది. ప్రతి సన్నివేశ కథనమూ పాఠకుని విశ్వాసాన్ని చూరగొనాలి. సంశయాలకు తావు కల్పించేవాడు పాఠకుల నాకట్టుకోలేడు. అసంగతాలు, అసందర్భాలు, అబద్ధాలు చెప్పకుంటూ పోయే రచయిత నుంచి సాధ్యమైనంత దూరం వైదొలగి పోతాడు.

కవిత్వానికెన్నో వెసులుబాటులున్నాయి. సదుపాయాలూ ఉన్నాయి. ఉపమా రూపకాదుల మరుగున, అన్యాపదేశాల మాటున ఎంతగానో వాచ్యతను దాచుకోవచ్చు. ప్రతీకలూ సంకేతాలూ వంటి వాటితో ఆడుకోవచ్చు. శబ్దాలతో ఇంద్రజాలం చేయవచ్చు. పదాల పొహళింపు ద్వారా కొత్తరూపు తొడగవచ్చు. కవికి కావలసినదల్లా బ్రహ్మోపయత్వం. అట్టి సారస్వత స్వజనోత్సవం కవికి నిరంతర సాధన వల్ల సమకూరుతుంది. ప్రతిభ పెంపొందుతుంది!

దీనినే ఒక ప్రఖ్యాత ఆధునిక విమర్శకుడు చక్కగా వివరించాడు; "కవి వాస్తవానికీ స్వప్నానికీ నడుమ యథేచ్ఛగా మధ్యే మార్గం ఎన్నుకోగలడు!" అని.

శ్రీ కె. వి. ఎన్. రాఘవన్

# మాలపల్లి - ఐతిహాసికత

## I

ఈ శతాబ్దపు పూర్వార్ధ భాగంలో జాతీయతా పునరుజ్జీవనోద్యమంలో భాగంగా రెండు మహానవలలు ఆవిర్భవించాయి. మొదటిది ఉన్నవ వారి "మాలపల్లి", రెండవది విశ్వనాథవారి "వేయి పడగలు" రెండూ జాతీయతనూ, ఆధ్యాత్మికతనూ ప్రధాన భూమికలుగా చేసుకొని జాతిలోని చైతన్యశక్తిని జాగృతం చేయడానికి ఆవిర్భవించిన నవలలు. స్వాతంత్ర్యోద్యమంలో అంతర్భాగాలైన హరిజనోద్ధరణ, కార్మికోద్యమము, అహింసా సిద్ధాంతాది విషయాలను ప్రధానంగా చేసుకొని వెలసిన నవల మాలపల్లి. మాలపల్లిలో విభిన్నముఖాలుగా విస్తరిల్లిన ఐతిహాసిక, సంప్రదాయ, జాతీయతా విలువలను గుర్తించిన విమర్శలు ఇంతవరకూ రాకపోగా, ఈమధ్యకాలంలో కొందరు విమర్శకులు మాలపల్లిని కేవలం ఒక సామ్యవాద సిద్ధాంతాలను ప్రచారం చేసిన నవలగా చిత్రించుకుంటూ రావడం జరుగుతూంది మరీ వీరి విమర్శ "కమ్యూనిజమే ఒక పరిష్కారమార్గంగా శ్లాఘించి, నేర్పుతో పాఠకులను ఒప్పించి పాత్రగతంగా చిత్రించగల ప్రప్రథమ ధైర్యశాలి నవలా ప్రవక్త ఉన్నవ వారే"[1] అనేటంత దూరంపోయింది నిజానికి ఉన్నవవారు కమ్యూనిజాన్ని పరిష్కారమార్గంగా శ్లాఘించారా అని ? మాలపల్లి రచనాకాలం నాటికే వెంకటపార్వతీశ్వరకవులు మొదలైన వారు జాతీయోద్యమ స్ఫూర్తితో వెలసిన బెంగాలీ నవలలను కుప్పలు కుప్పలుగా తెలుగులోకి అనువదించారు. ఆనాటికే శ్రీ అరవిందుల "భవానీమందిర్" జాతి జాతినంతా కదిలించి, ఒక మహానూత్నోత్సాహాన్ని, కార్యదీక్షా సంకల్పాన్ని కలుగజేసింది. మాలపల్లిని పరిశీలించే ముందు ఈ విషయాలను గుర్తుంచుకోవలసి ఉంటుంది.

వర్తమాన చైతన్యంతో భూతభవిష్యత్కాలాలను సమన్వయించుకొని భౌతిక, సౌందర్య, ఆధ్యాత్మిక శిఖరాల నధిరోహించిన నవల వేయిపడగలు. ఆ మహాప్రయత్నాభిముఖంగా సాగి, సార్వకాలికత నాపాదించుకున్న నవల మాలపల్లి. ఈనాడు కొందరు విమర్శకులు మాలపల్లిని, వేయిపడగలను ఆధునిక నవలా జగత్తులో ఇతిహాసాలుగా నొక్కి చెప్పడం జరుగుతున్నా[2] 1958 నాటికే రంగాగారు మాలపల్లిని టాల్స్టాయ్ 'వార్ అండ్ పీస్'తోనూ, 'రిసరెక్షన్'తోనూ పోల్చి "విరివిలో ఎపిక్ ప్రమాణం కల్గిస్తున్నాయని"[3] పేర్కొన్నారు. శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు మాలపల్లికి వ్రాసిన తొలిపలుకులలో మాలపల్లిని రామాయణ, భారత, భాగవతాదులతో పోల్చడంచేతనూ "నీ గ్రంథము ధర్మపరిణామ నిర్ణయము లందొక మహాభారతము"[4] అని చెప్పడంలో వారు మాలపల్లిని స్పష్టంగా ఇతిహాసంగానే భావించారు. ఇతిహాసమన్నది ఒక్కొక్క కాలంలో ఒక్కొవిధంగా దర్శనమిస్తుంది. అన్ని కాలాల్లోనూ ఒకే విధంగా (వస్తు, నిర్మాణ) ఉండాలని సిద్ధాంతమేమిలేదు. రామకథా స్వరూపంవేరు, భారత కథాస్వరూపంవేరు రెండూ మానవ జీవితంలోని రెండు ముఖ్యాంశాలను కథారూప వ్యాఖ్యానాలు రెండూ విభిన్న కథలైనా రెంటియందూ సమానమైన ఐతిహాసిక గుణాలను చూడవచ్చు. ఆధునిక కాలంలో శిల్పవిమర్శకులు కొందరు మధుర మీనాక్షి దేవాలయాన్ని, మహాబలిపురంలోని గంగావతరణ శిల్పసముహాన్ని ఇతిహాసాలన్నారు. మాలపల్లి, వేయిపడగలు రెండూ తెలుగు నవలా ప్రపంచంలో ఇతిహాసాలే

## II

ఇతిహాసానికి ప్రధానేతివృత్తము అనంత ముఖాలుగా విస్తరించిన మానవుని జీవితం. ఆ వస్తువు పౌరాణికం కావచ్చు, చారిత్రకం కావచ్చు, సాంఘికం కావచ్చు. కాని ప్రధానాంశం మానవుని జీవితాన్ని దర్శింపజేయడం. ఒక బిందువునుంచి బయలుదేరిన మానవుడు, ఆ బిందువు నన్వేషిస్తూ సాగించే మహాప్రయాణంలో జీవితాన్ని అనంత పార్శ్వాలుగా సౌందర్య, ఆధ్యాత్మిక భూములనధిరోహింపజేస్తూ, విశ్వాంతర్గత మహాశక్తులతో సమన్వయం సాధించుకుంటాడు. తాను పొందిన మహానుభూతుల పరంపరను విశ్వచైతన్యశక్తితో సమన్వయం చెప్పకొని ప్రయాణం సాగిస్తాడు. ఆ మానవుని జీవితమొక సుందర వృత్తం. పూర్ణమానవుని జీవితానికి సుందర కథారూప వ్యాఖ్యానం ఇతిహాసం. సమన్వయ సూత్రానికొక భాష్యం. భూమ్యాకాశములమధ్య మహావారధిని నిర్మించి చూపిస్తుంది. అందుకే ఇతిహాసంలో విస్తృతమైన కథ అనంతకాలములమీద పరచుకొని ఉంటుంది. దేశకాలములు రెండూ విస్తృతినిపొంది ఉంటుంది. ప్రధాన కథ విభిన్న కథలతో అంకె వేసుకొని, గంభీరపాత్ర నిర్మాణంతో ధర్మాధర్మ సంఘర్షణాత్మకంగా మంత్ర తంత్రాది అతిలోక విషయాలతో కర్మ ప్రాధాన్యాన్ని చిత్రిస్తూ, మానవునికొక మహాకర్తవ్యాన్ని నిర్దేశిస్తుంది.

ఇతిహాసాన్ని గూర్చి ఆలంకారికులు, లాక్షణికులు అక్కడక్కడ చెప్పిన విషయాలను సమీక్షించి విమర్శకులు ఇతిహాస స్వరూపాన్ని ఈ విధంగా భావించారు.

"౧ సుదీర్ఘమైనకథ :— ధీరోదాత్త ధీరోద్ధత ప్రకృతులైన పురుషుల వీరకృత్యములతో సంబంధించి యుండవలెను ౨ ఉపాఖ్యానములు :— ప్రధానకథ దీర్ఘమైయుండుటవలన నేర్పడు విసుగుదలను తొలగించుటకు, ప్రధాన కథకు బలము చేకూర్చుటకును అనేకములైన ఉపాఖ్యానములు మధ్యమధ్యన చేరియుండును. ౩ దైవశక్తి :— ఇతిహాస కథాపురుషులను వారి కృత్యములను దైవశక్తి పాలించుట యనివార్యముగా నిరూపించవలెను. కొంతవరకు దైవశక్తి ప్రత్యక్షముగా ప్రాధాన్యము వహించియుండుట చూపవలెను.

ఇతిహాస మిట్లెందుకుండవలెననగా నది మానవుని యౌన్నత్యమును నిరూపించుటకును, కర్తవ్యమిదియని బోధించుటకును, విధ్యేతరము లైన సర్వశక్తులు సాధ్యములని ప్రత్యక్షముగా చూపుట కుద్దేశించినది కనుక, మానవుని ప్రయోజకత్వ మంతయును విధికి లోబడి యుండ వలసినదేగాని తద్వ్యతిరిక్తముగా నేమియు సాధింపలేదు. ఈ నిరూ పణము ఇతిహాసమునందు ముఖ్యము. ఈ విధముగా దైవశక్తితో నితిహాసమునకు సంబంధమున్నందున నా దైవమును నేయేవిదములుగా భావించినవో ఆయావిదము లాయాజాతుల ఇతిహాసములందుండును. ४ తాత్త్విక విషయము :— దైవమునననుసరించితాత్త్వికచింతనము, ఆ యాదర్శములును, దృక్పథములును ఇతిహాసములందుండును. ౫ అమానుష లక్షణము :— మనుషులతోపాటు దేవ దానవులును ఇతిహాసమున పాత్రలగుటవలన వారి వారి క్రియాకలాపములందలి మానుష లక్షణములు కనబడుచుండును. ౬ ధర్మము .—నానా ప్రకారమైన ధర్మప్రపంచము బహుముఖములుగా మధ్య మధ్య ప్రవేశించుచుండును. సాంఘిక రాజకీయములును, ఇహపరములును, పుణ్య పాపములును, మంచి చెడ్డలును — ఈ మొదలగు బహువిధ ద్వంద్వములను చుట్టుకొని దర్మము ప్రపంచితమై యుండును."[5]

# III

బ్రహ్మ యజ్ఞంతో ప్రారంభమైన మాలపల్లి బ్రహ్మ యజ్ఞంతో పూర్తవుతుంది (అసలు కథ బుచ్చయ్యవద్ద సంగదాసు, రామానాయుడు ఉపదేశం, కారణం పొందినప్పటినుంచి ప్రారంభమై, విజయ కళాశాల స్థాపనతో పూర్తవుతుంది). యజ్ఞ ముఖంగా నవల ప్రారంభమై యజ్ఞముఖంగా అంతమవుతుంది. మాలపల్లి స్థూలంగా ఒక్క జీవితకాలం కథ వేయిపడగలు మూడు తరాలమీద పరచుకొని ఉంది. మాలపల్లిలో రామదాసు పూర్ణ మానవుడు. భగవంతునకు తనకు మధ్య ఒక మహావారధిని నిర్మించుకున్నవాడు, నైతిక, ఆధ్యాత్మికపు పునాదులమీద జీవితాన్ని నిర్మించుకొని, తాను పొందిన సర్వానుభూతులను, ఏకసూత్రముఖంగా మలచుకొని కడకు మహర్షి యైన ఆదర్శమానవుడు రామదాసు. మట్టినుంచి మానవుడు పెరిగి పెరిగి మహర్షియైనాడు. మాలపల్లె మున్యాశ్రమమైంది. పూర్ణ మానవునకు రామదాసు ప్రతీక. ఇహపరాదుల కొక లంకెవేసుకొని ఐహికాన్ని ఆముష్మికానికి మెట్టుగ వాడుకొని జీవిత యానంలో ఒక్కొక్క బంధాన్ని త్రెంచుకుంటూ పోయి లోకాతీతుడైనాడు. రామదాసు ఇహపరాలను గూర్చి ఆలోచిస్తూ "క్రోధం కూడ మోక్షానికి సాధనమన్నారు. మొత్తంమీద చూస్తే ఐహికం ఆముష్మి కానికి మెట్టులాగ అనిపిస్తుంది. ఈ మెట్టును ఉపయోగించు కోవడంలో ఉంది. నిచ్చెన స్వర్గానికి వేయవచ్చు, నరకానికి వేయ వచ్చు"[6] అని అనుకుంటాడు. జీవితంలో ఏ అనుభవాన్ని కాదనలేదు. అన్నింటిని భగవల్లీలగా, నిర్వాణ సోపానాలుగా భావించిన నిష్కామ కర్మయోగి.

"మానవుడి చరిత్ర అంటే దేవుని చరిత్ర. గడ్డిపోచ చరిత్ర కూడ అటువంటిదే. సృష్టిలో ప్రతివస్తువూ గమనిస్తే చాలు, భగవంతుని చరిత్రను వెల్లడిస్తుంది. కవులు వ్రాసిన కృత్రిమ చరిత్రలు భగవల్లీలలని చదువులారుగాని, మహాకవి రచించిన ఈ సృష్టికావ్యం చదువగలవాడికి ప్రతిఅణువూ భగవల్లీలలనేబోధిస్తుంది. చదువగలవాడికేగాదు, ఆ కవి ప్రతివాండ్లచేత తాను రచించిన మహా కావ్యం పారాయణం చేయిస్తునే ఉంటాడు. ప్రతి క్షణానికి ఒక్కొక్క మెట్టెక్కిస్తు గడ్డిపోచను, పిపీలికాన్ని, మానవునీ, దేవతనూ తన దగ్గరకు చేదుకుంటూనే ఉంటాడు. ప్రతి అణువూ చేదుకో కోటయ్యా అని అరుస్తూనే ఉంటుంది—"[7] అంటూ పిపీలికాది బ్రహ్మపర్యంతమూ పరివ్యాప్తమైన జీవచైతన్య లక్షణమైన 'జీవుని వేదన'ను దర్శించిన క్రాంతదర్శి రామదాసు. తనయందే ప్రాణశక్తి నైతే దర్శించాడు, అణువు మొదలు బ్రహ్మాండపర్యంతమూ ఆ ప్రాణశక్తినే దర్శించాడు. అందుకే కట్టకడపట రామదాసును గూర్చి చెపుతూ "ఆయన జీవితకాలముయొక్క సాయం సమయములో అస్తమయ సూర్యునివలె బ్రహ్మతేజముతోవెలుగొందుతుండేవాడు"[8] అని అన్నారు.

రామదాసుకు ప్రాగ్రూపాలు రెండుచోట్ల కనిపిస్తాయి. మహా భారతంలో ధర్మరాజు, ఆముక్తమాల్యదలో మాలదాసరి. మాలదాసరి ఒక్క రామదాసుకే ప్రాగ్రూపంకాదు. సంగదాసు, వెంకటదాసులను కూడ మాలదాసరిలోనే చూడవచ్చు జీవితంలో ఎటువంటి కష్టం వచ్చినా చలించక, అన్నింటిని అపరిహార్యమైన విధియొక్క లీలగా భావించి, కడకు స్వర్గారోహణ పర్వంలో పాండవులు ఒక్కొక్కరూ రాలిపోతూంటే చలించక ధీరమనస్కుడై నిలిచాడు ధర్మరాజు. రామదాసుకూడ అంతే. సంగదాసు, జ్యోతి, అప్పాదాసు, మహలక్ష్మి, వెంకటదాసు— అందరూ ఒకరితరువాత ఒకరు వెళ్ళిపోతే తనకేమి పట్టనట్టు యోగిలాగ కూర్చున్నాడు. జైల్లో లెక్కలేనన్ని కష్టా లనుభవించినా చలించలేదు. ఆముక్తమాల్యదలో మహాభక్తుడైన మాలదాసరే మాలపల్లిలో రామదాసు. ఒకనాడు మాలదాసరి భగవంతుని మార్గంనుంచి వేరైన కారణంగా బ్రహ్మరాక్షసునితో యుద్ధం చేయవలసివచ్చింది. ఆ యుద్ధంచేసిన మాలదాసరే మాల పల్లిలో వెంకటదాసైనాడు. కడకు రాక్షసునికి శపథంచేసి స్వామిని సేవించి తిరిగివచ్చి తన్ను తాను బ్రహ్మరాక్షసునికి ఆహారంగా నిలిచిన త్యాగమూర్తియైన దాసరి సంగదాసు. ఈ విధంగా రచయిత ఒక్క రూపంనుంచి మూడు రూపాలను నిర్మాణం చేశారు.

రామదాసు, సంగదాసు, రామానాయుడు, ముగ్గురూ బుచ్చయ్యద్వారా కారణంపొందినవాళ్ళు. బుచ్చయ్య ఉపదేశంనుంచే ప్రధాన కథ ప్రారంభమవుతుంది. భారతీయ ఆధ్యాత్మిక శక్తికి బుచ్చయ్య ప్రతీక. సంగదాసు నడిపిన సాత్త్వికోద్యమానికి ఆధ్యాత్మి కపు పునాది బుచ్చయ్య. విద్యా నగర మహాసామ్రాజ్య నిర్మాణం వెనుక విద్యారణ్యస్వామి, మహమ్మదీయ సామ్రాజ్యాన్ని గడగడలాడించిన చక్రవర్తి ఛత్రపతి శివాజీ వెనుక సమర్థ రామదాసు, గాంధీజీ నడిపిన జాతీయోద్యమం వెనుక దయానంద సరస్వతి, రామకృష్ణులు, వివేకా నందులు, అరవిందులు, శ్రీమాత మొదలగు వారి ఆధ్యాత్మికశక్తులు పనిచేశాయి. మాలపల్లిలో సంగదాసు, రామదాసు నడిపిన మహోద్య మాల వెనుకనున్న ఆధ్యాత్మికశక్తి బుచ్చయ్య. మాలపల్లి రచనక్క దాదాపు పదమూడేళ్ళకు పూర్వమే శ్రీ అరవిందులు తన "భవా!

మందిర్''లో, ఆధ్యాత్మికతను వదలి భారతదేశంలో ఏ ఉద్యమం సఫలం కాదని స్పష్టంచేశారు.[10]

నవలలో బుచ్చయ్య, రామదాసు ఆద్యశక్తులు. కోటమ్మకూడ ఆద్యశక్తే. మార్గం తెలియక తిరుగుతున్న సంగదాసుకు, మెఱుపులాగ మెఱసి నిష్కామ కర్మయోగమార్గాన్ని చూపి మాయమైనాడు బుచ్చయ్య. భావిలో సంగదాసు నడపబోవు మహోద్యమానికి ఆధ్యాత్మిక శక్తిని జాగృతం చేశాడు. నవలలో బుచ్చయ్య ఒకచోటే కనబడుతాడు. బుచ్చయ్య ఒక అతిలోక సృష్టి. కడకు విజయ కళాశాల స్థాపనకు ఆధ్యాత్మిక శక్తిని జాగృతం చేసి బుచ్చయ్య స్థానాన్ని ఆక్రమించాడు రామదాసు రామదాసు బుచ్చయ్య అయినాడు. పుల్లిప్ప కామానాయుడు మరికొందరు ఖైదీలు రామదాసుద్వారా కారణం పొందారు. రామదాసు గురురాజైనాడు నవలలో బుచ్చయ్య మాయమైనాడు రామదాసు మాయమైనాడు. ఆధ్యాత్మికతను వదలి భారత దేశం లేదు, భారతీయుడు లేదు, భారతదేశంలో ఏ ఉద్యమం సఫలం కాదన్న శ్రీ అరవిందుల దార్శనికతే మాలపల్లికి ప్రాణభూతమైన మహావిషయమైంది. రామదాసు, బుచ్చయ్య పాత్రల నిర్మాణం వెనుక ఆ మహా రహస్యాన్ని నిక్షిప్తం చేశారు రచయిత.

బుచ్చయ్య ఉపదేశం ఒక సంధి ఘట్టంలో జరుగుతుంది. మహాభారత యుద్ధంలో, అస్త్రసన్యాసంచేసిన అర్జునునకు శ్రీకృష్ణ భగవానుడు బోధించిన నిష్కామ కర్మయోగాన్నే బుచ్చయ్య సంగదాసుకు బోధించాడు ప్రప్రథమంగా చర్చ సంగదాసు బుచ్చయ్యల మధ్యనే నడుస్తుంది. నిష్కామ, సకామ చర్చానంతరం సుకృత దుష్కృతాలను గూర్చిన చర్చలో ''దుష్కృతము కూడ ఫలాపేక్ష లేకుండ చేస్తే ఫలము మన కంటదు గనుక, నరకమూరాదు, బంధహేతువూకాదు''[11] అని సంగదాసంటే దానికి బుచ్చయ్య...''సత్కార్యములు ఎప్పుడూ లోకోపకారకములుగా ఉంటవి. కర్త ఫలమపేక్షించినా లేకపోయినా దుష్కార్యములు లోకకంటకములు''[12] ... ఇంతే కాకుండా ఫలాపేక్షలేని సత్కార్యములయందు ఆదరము హెచ్చు. ఫలాపేక్ష లేనపుడు కర్తృత్వము భగవంతుడిదే అవుతుంది. కార్యస్వామ్యం ప్రత్యేక వ్యక్తినుండి మారి ప్రభువు దవుతుంది. నౌకరు తన స్వంత కార్యమును నెరవేర్చుకొనేటప్పటికంటే ప్రభువు కార్యమును నెరవేర్చేటప్పుడు యెక్కువ అధికారం చెలాయించగలడు. ఫలాపేక్ష లేక అధికార వశమున చేసిన పనులకు నౌకరు జవాబుదారీ లేదు. ఇతరులకు వర్తించే ధర్మములు అతనికి వర్తించవు—

''సర్వ ధర్మాన్ పరిత్యజ్యమామేకం శరణం వ్రజ
అహం త్వాం సర్వపాపేభ్యో మోక్ష యిష్యామి మాశుచ''

అని కృష్ణభగవానుడన్నాడు[13] అని గీతలోని కర్మయోగాన్ని, శరణాగతిని వివరించి ''అదిగో గుర్తు అక్కడ నిలవండి'' అన్నాడు. దానికి వెంటనే సంగదాసు ''నా చిత్తం! గోచరమయింది''[14] అన్నాడు. ఇక అక్కడిమంచి ధర్మాధర్మముల మధ్య మహాయుద్ధం ప్రారంభమయింది. అంతవరకు విర్దిష్టమార్గం తెలియని సంగదాసుకు మార్గం గోచరమయింది. నిష్కామ కర్మయోగపు పునాదులమీద కర్తృత్వాన్ని భగవంతున కంటగట్టి ఉద్యమం నడిపి, ఆ మహోద్యమానికి తన్ను తాను సమర్పించుకున్నాడు. వెంకటదాసు నడిపిన ఉద్యమానికి కర్తృత్వం వ్యక్తి నిష్ఠమయింది. అది సంపూర్ణ ఉద్యమంకాదు. అందుకే అది మధ్యలోనే విఫలమయింది.

# IV

సుఖ దుఃఖాత్మకమైన మానవజీవితం సంఘర్షణాత్మకం' ఇది లోకస్వభావం. ఇతిహాసం లోకానికి వ్యాఖ్యానం కావడంచేత సంఘర్షణ అనివార్యవిషయం. దీన్నే విమర్శకులు 'వార్' ఉంటుందన్నారు. ఈ సంఘర్షణ రామాయణ భారతాదుల్లోలాగా ప్రత్యక్ష యుద్ధమే కానక్కరలేదు. వ్యక్తిలోని మంచి చెడులకు, పాపపుణ్యములకు మధ్య సంఘర్షణ మొదలు, విశ్వంలోని దేవాసుర సంఘర్షణవరకు చోటుచేసుకొని ఉండవచ్చు. మాలపల్లిలో రామదాసు, సంగదాసు, రామానాయుడు, జ్యోతి, అప్పాదాసులు దైవీవర్గం. చౌదరీ,పంతులు, మునసబు,పోలీసులు మొదలగువారు అసురవర్గం.ఇది స్థూలంగాచూస్తే. కానీ ప్రధానమైంది స్వాతంత్ర సంగ్రామం. భావదాస్యంమీద, విజాతీయ శక్తులమీద, ఆ విజాతీయ శక్తులకు కొమ్ము కాస్తున్న దేశీయ శక్తులమీద ఒక పోరాటం. నవలలో జాతీయత దైవీ శక్తిగా, ధర్మమార్గంగా పేర్కొనబడింది. ఒకచోట నారాయణరావు రామానాయుడుతో అంటాడు ''స్వరాజ్యం వస్తుందిగా, అన్నీ నేలురని''.[15] దానికి రామానాయుడు—''అది పొరబాటు. ధర్మమెప్పుడూ అధర్మాన్ని ప్రతఘటించవలసిందే. అధర్మం ఒకప్పుడు గెలిచినట్లు కనబడ్డా, ఆ గెలుపు ధర్మోద్యమానికి ఊపు నిస్తుంది. ధర్మం గెలవక తప్పదు. స్వాతంత్రాభిలాషచచ్చి దాస్యం రుచిస్తే జాతికిగాని, వ్యక్తికిగాని మోక్షంలేదు. బానిస ఎప్పుడూ తన మోక్షానికై కలహిస్తూ ఉండవలసిందే. ఎవడైనా భావదాస్యానికి వశుడైన తరువాత, జాతీయ దాస్యం అసహ్యించుకొని, జాతీయ మోక్షానికి పోరాడగలడని నేను నమ్మను. కాబట్టి ప్రతివాడు దాస్యానికి లోనబడకూడదు. వ్యక్తి మోక్షానికి పోరాడడం దాస్యానికై చేసే పోరాటానికి అడ్డంవస్తే స్వార్థత్యాగం చేయవచ్చు. అంతకుతప్ప దాస్యవిమోచనానికై పాటుబడకుండా ఉండడం ధర్మంకాదు''[16] — అని అంటాడు. ఇవి కేవలం రామానాయుడు మాటలుకావు. ఉన్నవవారు జాతి జాగృతికై భావదాస్యాన్ని నిరసిస్తూ జాతీయశిఖరాల నధిరోహించి పూరించిన శంఖారావం. రామదాసు నడిపిన మహోద్యమానికి పునాదిసూత్రాలు. ఇదే నవలలో సంఘర్షణ. కడకు ధర్మమే జయిస్తుంది. జాతీయతకు దైవీశక్తులకు పట్టాభిషేకం జరగడంచేత రచయిత ధర్మవ్యవస్థను, జాతీయతను, ఆధ్యాత్మికతనూ జాతి పునర్నిర్మాణానికి పునాది సూత్రాలుగా నొక్కిచెప్పారు. ఇంతస్పష్టంగా మొదటినుంచి నవలలో జాతీయతను, ఆధ్యాత్మికతనూ స్థాపించుకుంటూ వస్తే ''కారల్ మార్క్స్ పిలుపుకు ప్రప్రథమంగా తన సాహిత్య కళాత్మక కంఠాన్ని శ్రుతికలిపినవాడు. తద్వారా వర్గచైతన్యానికీ విప్లవ కార్యక్రమానికి ఆద్యుడైనాడు''[17] అని ఒకరంటే, ఉన్నవవారేదో మూడు భాగాల నవలను 'లెఫ్ట్' పంథాలో నడిపినట్లు ''మూడుభాగాల విశ్లేషానంతరం, అచ్చుగాకుండా మిగిలున్న నవల ముగింపు భాగమైన నాలుగోభాగం యిప్పుడు తొలిసారిగా ముద్రణకు నోచుకుంటున్నది గనుక, ఆ నాలుగోభాగంలో అహింసా సత్యాగ్రహోద్యమానికి అభు

కూలంగా కీలకమైన మార్పులేమైనా చేయించాడా? యేమైనా కాశీనాధునివారు మాలపల్లి రెండో యెడిషన్ తీసుకురావడంలో ఆ నవలను అట్లా 'లెఫ్ట్' పంథాలో పడిపోకుండా 'రైట్' వైపుకు మళ్ళించుకోవాలనే ప్రయత్నం ఉన్నదా అనిపిస్తున్నది"[18] – అంటూ తమ అక్కసును కొంత వెళ్ళబుచ్చుకున్నారు మరొకరు. కారల్ మార్క్స్ పిలుపుకు ప్రప్రథమంగ శ్రుతి కలిపినవాడు ఉన్నవ – అన్న వాదానికి చారిత్రక దృష్టితో సరియయిన జవాబిచ్చారు రమణారెడ్డిగారు ఆ వాదాని కా జవాబు చాలు ఇకపోతే నిజానికి మాలపల్లిని గాని, ఉన్నవవారి ఇతర రచనలనుగాని పరిశీలిస్తే, ఎక్కడా వారు లెఫ్ట్ పందాలో రచనను సాగించినట్లుగానీ, సామ్యవాదాన్ని సమర్థించినట్లుగానీ లేదు. ఉన్నవ వారు వీర హైందవ మతాభిమాని. వారి బుడబుక్కల జోస్యంలో

> 'వేదశాస్త్రములు వెలయించినదేశం,
> యజ్ఞయాగములు చేసినదేశం
> ... ... ... ... ... ..
> నాస్తికమతములు ప్రబలములయితే
> నాశనమైపోతుంది బాబు '[19]

అంటూ దేశభక్తిని హైందవ మతాభిమానాన్ని ప్రకటిస్తే "ఈ అన్యమత నిరసనం ఉన్నవ వ్యక్తిత్వానికే మచ్చ. ఇది హిందూమతాభిమాన తీవ్రత"[20] అంటూ వ్యాఖ్యానించారు రమణారెడ్డిగారు ఇంతటి తీవ్ర హైందవమతాభిమానిపైన విమర్శకులు పేర్కొన్నట్లు సామ్యవాదన్ని ప్రచారం చేస్తారా? ఉన్నవవారు అహింసా సిద్ధాంతపు పునాదులమీద ఉద్యమం నడిపినవారు. వారే స్వయంగా ఒకచోట "గాంధీగారి ఉద్యమం అహింసాత్మకం గనుకనూ. మహాత్ముడు తన ఉద్యమమును స్వరాజోద్యమమునకు వర్తింపజేయుటకు మార్గం వెదక ప్రారంభించారు. నేను వారి ఉద్యమంలో చేరాను"[21] అని చెప్పుకున్నారు ఉన్నవవారు పాశ్చాత్యదేశాలు తిరిగి అక్కడిఉద్యమాలను పరిశీలించడం చేతనూ, ఆనాటికే దేశంలోకిచొచ్చుకొచ్చిన సామ్యవాదభావాలను వెంకటదాసుద్వారా వ్యక్తపరచి కడకు "అహింసా పరమోధర్మః" అనే సూత్రాన్ని అనాది సిద్ధంగా ఆచరిస్తున్న భారతదేశమే ఈ ధర్మాన్ని ప్రతిష్ఠించి లోకానికి చూపవలసి ఉంటుంది. ఈ విషయం మీరంతా బాగా గమనించండి. కేవలం స్వాతంత్ర్యము సంపాదించడమే మన ప్రయత్నంగాదు. స్వరాజ్యం నిజంగా స్వర్గరాజ్యమే కావలె. మన మార్గం రక్తసిక్తమయితే స్వర్గరాజ్యం రాదు. నెత్తురుకూడు మనకు బంటదు.[22] అంటూ అహింసా సిద్ధాంతమే పరిష్కార మార్గంగా దర్శించిన క్రాంతదర్శి ఉన్నవ. అంతేకాని సామ్యవాద భావాలకు తనేనాడు శ్రుతి కలపలేదు.

ఇకపోతే శ్రీ కాశీనాథునివారిపై ఆ విధంగా అనుమానపడడంలో అర్థం ఏమాత్రం కనబడదు సరికదా! ఆ విధంగా అనుమానపడడంలో ఆ విమర్శకుడు మాలపల్లి నవలను పరిశీలనాదృష్టితో సమగ్రంగా చదివాడా అని అనుమానం వేస్తుంది. ఆనాటి రాజకీయ పరిస్థితులలో మాలపల్లివంటి నవల వ్రాయడం సామాన్యమైన పని కాదు. అదీగాక అంతటి నవల వ్రాయడానికి రచయితకో నిర్దిష్టమైన పథకం ఉంటుంది రచయిత తాను ప్రతిపాదించదలచుకున్న సిద్ధాంతాన్ని మొదటినుంచి ప్రోది చేసుకుంటూ వచ్చి కడకు ఆసిద్ధాంతానికి పట్టాభిషేకం చేస్తాడు మాలపల్లి నవలా నిర్మాణంలో ఆ విషయం స్పష్టంగా కనబడుతుంది నవలను 'లెఫ్ట్' పంథాలో నడిపిఉంటే, నవలా నిర్మాణ స్వరూపమే వేరుగా ఉండేది. కథ రామదాసుతోను, బ్రహ్మయజ్ఞంతోనూ ప్రారంభమయ్యేది కాదు. బుచ్చయ్య నిష్కామ కర్మయోగాన్ని వివరించి ఆధ్యాత్మికశక్తిని జాగృతం చేయవలసిన అవసరమూలేదు. జ్యోతి, అప్పాదాసులప్రణయం ద్వారా భాగవతంలోని భక్తి తత్త్వాన్ని వివరించవలసిన అవసరమూ లేదు. బెజవాడలో జరిగిన మహాసభలలో సభాపతి ఉద్యమస్వరూపాన్ని గూర్చి చెబుతూ 'మన ఉద్యమం పవిత్రమైంది. దాని యందు ద్వేష భావాలకు చోటులేదు. ద్వేషపూరితమైన ఉద్యమమేమీ నిలువజాలదు ...మావిద్విషావహై' అని భగవంతుణ్ణి మనమందరం ప్రార్థన చెయ్యాలి [23] —అని స్పష్టంగా ఉద్యమ స్వరూపాన్ని వివరించవలసిన అవసరమూ లేదు. నవల మొదటి నుంచి రైట్ పంథాలోనే నడిచింది, రైట్ పంథాలోనే పూర్తయింది. కేవలం ఒక్క వెంకటదాసు ద్వారా రచయిత సామ్యవాద భావాలను వ్యక్తపరచి, దాని వైఫల్యాన్ని చూపించినంత మాత్రంచేత నవలను లెఫ్ట్ పంథాలో నడిపినట్లా?

ఇక వెంకటదాసు కమ్యూనిష్టు అని (ఎవరో అన్నారని, అంటారని కాదు, కేవలం పరిశీలనా దృష్టితో) వెంకటదాసు ఉద్యమం నడిపిన పద్ధతి చూస్తే, అది సామ్యవాదుల ఉద్యమం కాదు. అది సంతానుల ఉద్యమం. సంతానులంటే మాతృదేశము యొక్క సంతానులు. మాతృదేశ దాస్యవిముక్తికై తమ సర్వస్వాన్ని అర్పించి ఉద్యమం నడిపిన సన్యాసులు. పంతొమ్మిదో శతాబ్దపు ద్వితీయార్ధ భాగంలో బంగాళదేశంలో ప్రారంభమైన సంతానుల ఉద్యమం క్రమంగా దేశమంతా వ్యాపించింది. ఆంధ్రదేశంలో అల్లూరి సీతారామ రాజు వంటి దేశభక్తులు ఆ సంతానుల పద్ధతిలో ఉద్యమం నడిపారు. వెంకటదాసు పాత్ర నిర్మాణానికి అల్లూరి సీతారామరాజు నడిపిన ఉద్యమం యొక్క స్ఫూర్తికూడ కొంత యుండవచ్చు. వెంకటదాసు సంతానుడు. వెంకటదాసు తన ఉద్యమాన్ని సంతానుల ఉద్యమమని పేర్కొన్నాడు. వెంకటదాసు ఉపన్యాసాలకు అతను ఉద్యమం నడిపిన పద్ధతికి ఎక్కడా పొందిక లేదు. భగవంతుని ప్రాజాపత్యాన్ని కాదన్నవాడు 'హనుమద్ధ్వజాన్ని' ధరించాడు. ఆవేశంతో 'వీరహనుమాన్' సింహనాదాలు చేశాడు. తక్కెళ్ళ జగ్గని పేరుతో పాడిన బుర్రకథలతో రామనామాన్ని జపించాడు. కృతయుగ ధర్మాన్ని కలియుగంలో స్థాపిస్తానని చెప్తూ "మా సంతానుల చర్యల వల్ల ధనికుల భారం తగ్గుతుంది. లోకమాత ప్రసాదించగల సౌఖ్యాలు ఆమె సంతానమంతా సమానంగా అనుభవించడానికి అవకాశం కలిగే యుగమే స్వర్ణయుగమవుతుంది. దేవరాజ్యం భూమి మీద తిరిగి పునస్థాపితం కావడమే నా పరమావధి. నా పరమావధే నా దేవుడు. .....ఈ ధర్మం నెరవేరడానికి మా సత్యసైవాలు సాధనంగా చేసుకుంటాం నా హయాంలో జరిగిన ఒక్క బందిపోటులో గూడ హత్యలు జరుగలేదు. నా అనుచరులు మద్యపానం, వ్యభిచారం విడిచిపెట్టినారు. నాది హృదయ రాజ్యం. నా రాజ్యం నశించదు." [25] అంటూ సంతానుల గుణాలను, ఉద్యమ స్వరూపాన్ని వివరించాడు. మొదట వెంకటదాసు తన భావాలను, ఉద్యమ స్వరూపాన్ని వ్యక్తపరచినపుడు "అన్నా నీ ధర్మనిష్ఠ ప్రశంసనీయం. రాజుకంటే బలమైన సాత్త్వీక ధర్మ మార్గాన్ని సంగన్న చూపించాడు. నీ మార్గం అధర్మం, అసత్యం, లోక కంటకం" [26] అని జ్యోతి అన్నా "యీ కాలపు వాళ్ళ బుద్ధులు మంచివే కాని లోక విరుద్ధంగా ఉన్నవి. ఆచరణలో పెట్టడంలో సాధ్యమవుతుందా? ఒక పర్యాయం భాగ్యవంతులాస్తి పంచిపెట్టినా స్వల్పకాలంలో పరిస్థితులు మళ్ళీ యథాస్థితికి రావా? బీదలు సోమరులై పనీపాటలు విడిచి ఊరుకోరా? స్వశక్తిని బట్టి భాగ్యవంతులు గావడానికి ప్రతివాడికీ ఉండడం న్యాయం గాని, యీదోపిడీ పద్ధతులు సర్వసామాన్యం అయితే కష్టపడి జీవించే వెర్రివాళ్ళెవరుంటారు? రానురాను స్వయం కృషి కంటే చౌర్యమే మేలని భావించే దుస్థితి దేశానికి పట్టబోతుందేమో" [27] అని రామదాసు భావించినా, కడకు వెంకటదాసులోని దేశభక్తిని, ధర్మనిష్ఠను, మానవకారుణ్యాన్నిచూచి రామదాసు "నీవా జగ్గడివి, ఆశ్చర్యం...ధర్మ దేవతవనిపించుకున్నావు." [28]

"చాలా కొత్త నాటకం. నీ నాటక నియమాలు వేరే. కొత్త పంథాతో కానవు. నేను మామూలు దారిన పోయేవాణ్ణి. నీదిమార్గం కాదని చెప్పలేను కాని, అంతా అవలంబిస్తే ఎట్లా ఉంటుందో చూడాలె. నీ మార్గం నియమబద్ధం మటుకు అవును. ఆ నియమాలు చాలా ఉత్కృష్టమైనవి. అమలులో పెట్టడం కష్టమేమో నని, చాలా మందికి అనుమానం" [29] అని అన్నాడు. వెంకటదాసులో కూడ ఉద్యమం ప్రారంభింపక పూర్వమున్నంత తీవ్ర ప్రకృతి రాను రాను క్రమంగా తగ్గి కడకు పరమ ఆర్ద్రతామూర్తి అవుతాడు. సంతానులు జైలును ముట్టడించి యుద్ధం చేస్తే "వృథా జీవహింస మనకెందుకు" [30] అని యుద్ధాన్ని ఆపివేయించాడు. వెంకటదాసు లక్ష్యం మహోన్నతమైనదైనా అతడవలంబించిన మార్గానికి ఆధ్యాత్మికపు పునాది సంపూర్ణంగా లేకపోవడం చేత అది మధ్యలోనే విఫలమైంది. కాని వెంకటదాసు తను నమ్మిన సిద్ధాంతాలు మంచివైనా చెడువైనా, దృఢ సంకల్పంతో, చిత్తశుద్ధితో పోరాడిన మహావ్యక్తి. వెంకటదాసుది ఒక విధంగా వైరభక్తి మార్గం. అందుకే రామదాసు కొతని జీవితం 'విచిత్ర నాటకం' అనిపించింది. నవలలో వెంకటదాసును మహోన్నత వ్యక్తిగా చిత్రించుకుంటూ వచ్చారు ఉన్నవ. అందుకే వెంకటదాసు ప్రాణోత్క్రమణ సమయాన్ని "ఈ శరీరములో నుండి లోకమంతా వెలిగిన నీలకాంతి గల మహాతేజం గుప్పున ఆకాశానికి లేచింది" [31] అని మహాద్భుతంగా వర్ణించారు. నవలలో వెంకటదాసు కమ్యూనిష్టు కాదు, నడిపిన ఉద్యమం సామ్యవాదుల ఉద్యమమూ కాదు.

# V

ఇతిహాసం మానవ జీవితంలోని అనంత విషయాలను విభిన్న ముఖాలుగా వివరిస్తూ రావడంచేత, విభిన్న కథల సమాహారభూతమై ఉంటుంది. వీటినే ఆఖ్యానోపాఖ్యానాలన్నారు. ఈ కథలు ప్రధాన కథతో ప్రత్యక్షాప్రత్యక్షంగా సంబంధాన్ని కలిగిఉంటాయి.కొన్నిచోట్ల కొన్నికథలు ప్రధానకథతో ఏమాత్రం సంబంధం కలిగిఉండవు కాని అవి మానవజీవితంలోని ఒక మహాసత్యాన్ని వ్యాఖ్యానిస్తూ ఉంటాయి. మాలపల్లిలో ప్రధాన కథయైన సంగవిజయంతోపాటు, జ్యోతి అప్పాదాసుల కథ, కమలా మోహన్‌ల కథ, ఖైదీల కథలు, వెంకటదాసు కథలు చోటుచేసుకున్నాయి. నవలలో చాలా విషయాలు ప్రధానకథ నుండి తొలగి కేవలం విషయ వివరణకొరకే రచింపబడినట్లున్నాయి. కమలామోహన్‌ల కథకు, ప్రధానకథకు ప్రత్యక్ష సంబంధమేమీలేదు. కాని లనంతకాలములమీద బ్రతుకుతున్న మానవుడు అల్పవిషయ ప్రలోభుడై విశ్వనియామక సూత్రమైన ధర్మమును కాలరాచితే, ప్రకృతి ఎలా ప్రకోపించి వాణ్ణి సర్వనాశనం చేస్తుందో, ఆ కథద్వారా రచయిత స్పష్టంచేశారు. లోకంలోని స్త్రీ పురుషుల సంబంధంలోని అధర్మప్రవృత్తిని వ్యాఖ్యానించి దానికి ఫలితాన్ని ఆ విధంగా మాపెట్టడం జరిగింది. వేయిపడగలలో ధర్మానికి అవమానం జరిగితే గుండేరుపొంగి, అగ్ని ప్రజ్వరిల్లి ఊరినంతా నాశనంచేస్తాయి. ఇది సృష్టిలో ఒకమహాలనివార్యమైన సత్యంగా రచయితలు వ్యాఖ్యానించు చుంటూ వచ్చారు. చెలియలికట్టలో రత్నావళి, వేయిపడగలలో మంగమ్మ, మైదానంలో రాజేశ్వరి–వీళ్ళంతా కమలలాగే విచిత్రపుచావు చచ్చినవాళ్ళు.

జ్యోతి అప్పాదాసుల కథకు ప్రధానకథకు కొంతవరకు సంబంధంఉన్నా, కొంతదూరం నడిచాక అది ప్రధానకథతో లంకె త్రెంచుకుంది. ఆనాడు భావకవితోద్యమ ప్రభావంచేత వ్యాప్తికొచ్చిన 'అమలిన శృంగారా'న్ని వారిద్దరిద్వారా వ్యక్తపరచి, అదికూడ సంఘానికి పనికిరాని కారణంచేత, మధ్యలోనే పరిహరింపబడింది.జ్యోతి అప్పాదాసుల ప్రణయం భూమి నంటిపెట్టుకున్నది కాదు. గాలిలో కట్టిన మేడ. రామదాసు లక్ష్మిల దాంపత్యం భూమ్యాకాశములకు వేసినలంకె. అనాది దాంపత్యం. ఈ విషయాన్నే శ్రీ సంపత్కుమార గారు మరింత వివరంగా చెపుతూ "కమలా ప్రణయప్రవృత్తి, జ్యోతి ప్రణయప్రవృత్తియొక్క రెండవ పార్శ్వం. ప్రణయ విషయకంగా శారీరక సంబంధాన్ని జ్యోతి–అప్పాదాసులు నిరాకరిస్తే ఆ శారీరక సంబంధమే పరమార్థంగా భావించింది కమలామోహన్‌ల జంట. ఉభయత్రాఉన్న ఈ 'అతి' సమాజానికి ఉపయోగపడని లక్షణాన్ని ఒక వైపూ, సమాజ సుస్థితికి భంగం కలిగించే లక్షణం మరోవేపూ ప్రదర్శించి, ఆ ఉభయరీతుల నిరర్థకత మాలపల్లి సువ్యక్తం చేసింది. ఉపయోగపడకపోవటంకన్న సుస్థితికి భంగం కలిగించే ప్రవృత్తి తీవ్ర శిక్షకు అర్హమయింది. కమల తనకుతానే శిక్ష విధించుకోవడం అందుకే. అపరాధానికి శిక్ష బయటనుంచి కాదు లోపలనుంచే రావడం గమనించదగిన అంశం. ఈ ఉభయ ప్రవృత్తులకు సమాంతరంగా రామదాసు దంపతులలోని సామరస్యానికి మరో పార్శ్వంగా చౌదరి దంపతులలోని అసామరస్యం ప్రస్తుతీకరించబడింది.[32]

ఇతిహాసం కర్మ ప్రాధాన్యాన్ని కలిగి ఉంటుందని అదినవ గుప్త పాదులు. మాలపల్లిలో చౌదరయ్య రామదాసు కుటుంబానికి చేసిన అన్యాయానికి ఫలితంగా కోడలు లేచిపోవడం, సాహు మరణించడంగా కర్మఫలాన్ని వ్యాఖ్యానించడం జరిగింది కమలా మోహన్‌లు చేసిన పాపానికి ఫలితాన్ని తీవ్రంగా అనుభవించారు.కాని కడకు పశ్చాత్తాపంతో కుమిలి కుమిలి రామశాస్త్రిలో భగవంతుణ్ణి, సాహులో శ్రీకృష్ణుని దర్శించి, మోహన్‌కు నిష్కామ కర్మయోగాన్ని మార్గంగాచూపి వెళ్ళిపోయింది కమల. మోహన్ జీవితంలో కష్టాలననుభవించి కడకు తన సర్వస్వాన్ని దేశానికి అంకితం చేస్తాడు. నవలలో కర్మఫలాన్ని గూర్చిన చర్చ చాలాచోట్ల జరుగుతుంది. రామదాసు జీవితంలో విధియొక్క ప్రాధాన్యాన్ని గుర్తించినవాడు. నవలలో పురుష ప్రయత్నానికన్న అపౌరుషేయానికి అధిక ప్రాధాన్యం కనబడుతుంది."సంగదాసు హత్య, కమలయొక్క చిత్రచర్య, సాహు చౌదరయ్యల మరణం, జగ్గడి బంది పోట్లు, వెంకటయ్య ఉద్యమంలో చేరడం, రామదాసు వగైరాల కారాగార ప్రవేశం, జ్యోతీ అప్పాదాసుల విచిత్ర ప్రయాణం. శ్రీకృష్ణ జన్మస్థానానికి తన యాత్ర–మొదలైనవన్ని; యేదో సర్వజ్ఞత్వంకల వ్యక్తి మహోద్దేశంతో నడుపుతున్నట్లు కనబడ్డది. ధర్మాధర్మాలు ఒకదానినొకటి జయించడానికి చేస్తున్న మహారణరంగంలో యివన్ని అంతర్భాగాలైన స్వల్పకథలుగా తోచినవి. లోకచరిత్ర పారజూస్తే, సత్పథం పొడుగునా సత్పురుషుల రక్తసిక్తమయ్యే కనబడ్డది. ఇది మహాయాగం. యజ్ఞపురుషుడు ఈ మహాయాగంలో తన్నొక యింధనంగా స్వీకరించినందుకు ఆనందపడ్డాడు"[33] అంటూ మహోద్యమాన్ని, నవలానిర్మాణాన్ని మహాయజ్ఞంగా పవిత్రభావంతో పరమేశ్వరునకు కర్తృత్వాన్ని ఆపాదించడంలో మానవ జీవితంలోని విధియొక్క ప్రాధాన్యాన్ని స్పష్టంగా చిత్రించారు ఉన్నవ.

# VI

వేయిపడగలలో గణాచారి, పసిరికవంటి పాత్రలు అతి మానుష సృష్టి. మాలపల్లిలో బుచ్చయ్య, రామశాస్త్రి, రామానాయుణ్ణి అమ్మవారు ఆవేశించడం మొదలైనవన్ని అతిమానుష సృష్టి. ఇవి ఒకవిధంగా మానవ జీవితంలోని అద్భుత భావవ్యంజకాలు. వేయిపడగలలో మంత్రతంత్రాది అనంతవిషయాలు చోటు చేసుకున్నాయి. కాని మాలపల్లిలో ఆ విషయాలు లేవు. రామదాసు అచలయోగి. అచలతత్త్వాన్ని, భక్తితత్త్వాన్ని, కర్మయోగాన్ని వివరించుకుంటు రావడం జరిగింది. వేయిపడగలు, మాలపల్లి రెంటిని పరిశీలిస్తే వేయి పడగలలోని శిల్పదృష్టి గాని, సుశ్లిష్ట నిర్మాణ బంధంగాని, మహాసౌందర్య దృష్టిగాని మాలపల్లిలో కనబడదు. మాలపల్లి రచనకు వెనుక ప్రధానంగా ఆనంద మఠం, భవానీ మందిర్, మాతృమందిరం మొదలగు రచనలు బలంగా పనిచేశాయి. ఒక విధంగా చూస్తే మాలపల్లి మాతృ మందిరానికి విస్తృత రూపము. ఈ విషయంగా విమర్శకు లొకరు "వెంకట పార్వతీశ్వర కవులు మాతృ మందిరం అనే సృజనాత్మక నవలలో యిదే మౌలికాశయానికి కేంద్రీకరణ జరిగింది.కనుక అస్పృశ్యతా నివారణ అనేది మాలపల్లి నవలకు గౌణమే కాని ప్రధానం కాదు"[34] అని అన్నారే కాని మాతృ మంది రంలోని అహింసా సిద్ధాంతాన్ని గూర్చి పట్టించుకోలే దెందుకో ?

మాలపల్లిలో అస్పృశ్యత ఒక్కటే గౌణం కాదు, అహింసా సిద్ధాంతం కూడ గౌణమే. మాతృ మందిరంలోని రంగదాసు, కళ్యాణానందస్వామి (కొంతవరకు)ల సమష్టి విస్తృత రూపమే మాలపల్లిలో వెంకటదాసు. మాతృమందిరంలో రంగదాసు తన మార్గాన్ని వెంకట దాసు లాగే ధర్మమార్గమంటే దానికి అనసూయ "మమ్ము బ్రతికించు పుణ్యమునకై నీవు మరియొకని హృదయమును నొప్పించు పాపమును చేసితివి. నాయనా అమృతమును విషకుంభముతో నెత్తుకొన్నందు వలన లాభమేమున్నది" [35] అని అంటుంది. కల్యాణానందస్వామి కలియుగంలో కృతయుగ ధర్మములు నెలకొల్పిన నాడుగా పేర్కొన్నారు. ఈ విధంగా పరిశీలిస్తు వెళితే మాతృమందిరంలోని వెంకటేశ్వరుడు అనసూయ కధను తిరగవేస్తే (ధర్మాధర్మముల దృష్టితో) కమలా మోహన్‌ల కధవుతుంది. వెంకటేశ్వరుడు పతివ్రతయైన భార్యను త్యజించి, వేశ్య చెంతచేరి, కడకు ఆ పాపఫలాన్ననుభవించి, కల్యాణానంద స్వామి ప్రభావం చేత దేశసేవకు అంకితమవుతాడు. మాతృ మందిరంలో లాగనే మాలపల్లిలో కూడా ముఖ్యమైన పాత్రలన్నీ పశ్చాత్తాపంలో పరివర్తన చెంది, అటు కొందరు దేవసేవ కంకితమైతే, మరి కొందరు భగవానునిలో ఐక్యం చెందారు. మాతృ మందిరానికి విస్తృతరూపమే మాలపల్లి. మాతృమందిరానికి స్ఫూర్తి శ్రీ అరవిందుల "భవానీ మందిర్" బంకింబాబు "ఆనంద మఠం" నవలలు. వీటన్నిటి కాంతి పుంజాలను తనలో యిముడ్చుకున్న నవల మాలపల్లి.

## అధస్సూచికలు

1 మాలపల్లి నవలపై ప్రభుత్వ నిషేధాలు – ఒక అద్భుత పరిశోధనా పత్రం, సోమసుందర్, స్రవంతి–సెప్టెంబరు, 80, పుట–13.

2 తెలుగులో ఇటీవలి కాలంలో మాలపల్లి వేయిపడగలు రెండూ ఇతిహాసాలే. ఒక విధంగా రెంటి నిర్మాణమూ అన్యోన్య విలక్షణమైంది. మాలపల్లి ఒక మహాభారతం లాంటి రచన .........జాతీయోద్యమ వేళలలో భారత జాతిలోని మానసిక ఆధ్యాత్మిక భూమికలలోని అపూత ప్రతిఘాతాలను అతి శక్తిమంతంగా చిత్రించిన మహాగ్రంధమిది అందుచేతనే ఈ గ్రంధంలో సామ్యవాదం నుంచి శరణాగతి పారమ్యమై శ్రీ వచ్య భూషణం దాకా వివేచనాంశం అయింది. ... ... మహా గ్రంథాలు–సహృదయ చక్రం, డా. కోవెల సుప్రసన్నాచార్యులు, జాగృతి, కాళయుక్తి దీపావళి ప్రత్యేక సంచిక, పుట–83.

3 ఉన్నవ రచనలు కొన్ని–కె.వి.రమణారెడ్డి, పుట XXVI

4 మాలపల్లి–చతుర్థ ప్రచురణ. తొలి పలుకులు – శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావు పంతులు, పుట VIII

5 ఆంధ్ర మహాభారతము–సంశోధిత ముద్రణము, ఉస్మానియా ప్రచురణ 1970, పుట–32 & 33.

6 మాలపల్లి పుట 26 & 27.

7 మా. ప. పుట–568.

8 మా ప పుట- 666.

9 భవానీమందిర్.

10 శ్రీ. అరవింద బర్త్ సెంటినరీ లైబ్రరీ, వాల్యూమ్ I, పే. 67, 68.

11 మా. ప. పుట–47.

12 మా. ప. పుట–47.

13 మా. ప. పుట–47.

14 మా. ప. పుట- 48.

15 మా. ప. పుట-505.

16 మా. ప. పుట-506.

17 స్రవంతి–సెప్టెంబరు 80, పుట–9.

18 మాలపల్లి నవలపై ప్రభుత్వనిషేధాలు,బంగోరె, పుట–75.

19 ఉన్నవ రచనలు కొన్ని–పుట–82.

20 అదే పుట–89.

21 అదే పుట–185.

22 మా. ప. పుట–612.

23 మా. ప. పుట–156.

24 మా. ప. పుట–534.

25 మా. ప. పుట–535.

26 మా. ప. పుట–311.

27 మా. ప. పుట–353.

28 మా. ప. పుట–587.

29 మా. ప. పుట–598.

30 మా. ప. పుట–525.

31 మా. ప. పుట–601.

32 మన నవల పరిశీలన–స్వరూపం – పరిణామము, డా॥ సంపత్కుమార, పుట–24.

33 మా. ప. పుట–502.

34 స్రవంతి, సెప్టెంబరు–80, పుట–9.

35 మాతృ మందిరం, వెంకట పార్వతీశ్వర కవులు, ఎమెస్కో ప్రచురణ, పుట–192.


కొత్త రుచులు
ఆప్కో
చేనేతలు
విచిత్రమైన రూపకల్పనల్లో వాణ్య
మైన చేతి అద్దకపు అద్భుతాలు;
ఈ ఉగాదికి మీ అభిరుచులకి అను
గుణంగా_ఎన్నెన్నో రకాలు ఆధుని
కమైన నేతల్లో, సాంప్రదాయపు
సొంపుల్లో కళ్లు జిగేలుమనిపిస్తాయి.
అన్ని సందర్భాలకి సరిగ్గా సరిపోయే
సరికొత్త రకాల్లో-
ఆప్కో చేనేతలు
చేనేత వస్త్రాలకు
పెట్టిందిపేరు
'ఆప్కో'
KIRON/APCO/816
APSHWCSL
ఆంధ్రప్రదేశ్
స్టేట్ హేండ్లూం వీవర్సు
కోపరేటివ్ సొసైటి
లిమిటెడ్
హైదరాబాద్ -500 029.

శ్రీ టి. ఎల్. కాంతారావు

# కవిత్వం - సిద్ధాంత దృక్పథం

ప్రాచీన అలంకారికుల మతం ప్రకారం కవిత్వానికి రెండు ప్రయోజనాలున్నాయి. ఒకటి ఆనందం, రెండు ఉపదేశం. కావ్యప్రయోజన విషయంలో ఉపదేశం ప్రథమస్థానమాక్రమిస్తున్నది. కనుకనే 'విశ్వశ్రేయః కావ్యం' అన్నారు. విశ్వశ్రేయస్సును కవి కాంక్షించడంలో కవికి ఒక స్పష్టమైన దృక్పథం ఉంటుంది. ఆ దృక్పథం ఒక సిద్ధాంతం భూమికగా అతని కావ్యంలో విస్తరిస్తుంది. అంచేత కవిత్వానికి సిద్ధాంతం వెన్నెముకలాంటిది. శిల్పానికి సంబంధించిన విశేషాలన్నీ అంగనిర్మాణం వంటివి. కావ్యానికి అంగి సిద్ధాంత దృక్పథంకాగా అంగం శిల్పం అవుతున్నది. సిద్ధాంతానికి, శిల్పానికి అంగాంగ సంబంధం ఇట్లా ఉంటుంది.

సమాజం అనేక వర్ణాలుగా, అనేక వర్గాలుగా ఏర్పడినపుడు ఆ సమాజంలోని ప్రతి కవికీ ఒకే సిద్ధాంత దృక్పథం ఉండదు. మార్క్సియన్ ఎరిభాషలో అయితే వర్గాలు రెండే రెండు. శ్రామిక వర్గం ఒకటి, దాన్ని దోపిడీచేసే వర్గం మరొకటి. శ్రామికవర్గ కవిత్వంలోకూడా సిద్ధాంతదృక్పథ భేదం ఉంటుంది. ఈభేదం ఆయా కవులకుగల రాజకీయ అవగాహనమీద ఆధారపడి ఉంటుంది. కొంతమంది కవులు సమాజంలో పరివ్యాప్తమై ఉన్న దోపిడీ విధానాన్ని తమ కవిత్వంలో ప్రతిబింబిస్తూ తద్వారా పీడితులను సమాజంపై తిరుగుబాటు చేయడానికి సమాయత్తం చెయ్యవచ్చు. మరికొంతమందికవులు సాయుధపోరాట మొక్కటే పీడితజనులకు విముక్తిమార్గమనివిశ్వసించి పీడిత జనానీకాన్ని సాయుధ పోరాటంవైపు ఆయత్తం చెయ్యవచ్చు. ఇంకొంతమంది కవులు సాయుధ పోరాటాన్ని దోపిడీ సమాజానికి పరిష్కారంగా అంగీకరిస్తూనే సమాజంలో ఇంకా దానికి అనుకూలమైన పరిస్థితులు నెలకొనలేదుగనుక అంతదాకా ప్రజలను ఎడ్యుకేట్ చెయ్యడమే ఈనాటి మార్క్సిస్టు కవితా దృక్పథంగా భావిస్తున్నారు. మార్క్సిస్టేతర కవులలో కూడా ఇట్లాగే భిన్నదృక్పథాలున్నాయి. ఆర్ష దృక్పథాన్ని, వైదికమతాన్ని సమాజ సంక్షోభానికి ప్రత్యామ్నాయ మార్గంగా కొంతమంది కవులు కావ్యాలు రాస్తున్నారు. దానికి వ్యతిరేకంగా వర్ణాధిక్యతను నిరశిస్తూ, ఆర్షధర్మాలను, వైదికమతం యొక్క ఆంతర్యాన్ని ఖండిస్తూ కొంతమంది కవులు కవిత్వాన్ని రాస్తున్నారు. ఇవేవీ పట్టకుండా వ్యక్తివాదం ప్రధానాశయంగా ప్రతీకవాద కవిత్వం, మార్మికవాద కవిత్వం, అధిభౌతిక కవిత్వం ఇట్లా అనేక రకాల కవితాధోరణులు తలెత్తాయి.

ఆంధ్ర కవితారంగంలో వర్తమానకాలం చాలా కల్లోలితమైన కాలం. ఈ కాలంలో పైచెప్పిన భిన్నభావ ధోరణులు కవిత్వంలో తలెత్తటంవలన కవితావిమర్శకూడా కల్లోలమైందనటం ఆశ్చర్యమైన విషయం కానేకాదు. విమర్శకుడు ఈ దృక్పథాలన్నింటికీ అతీతంగా అచ్చమైన, స్వచ్ఛమైన కవితావిమర్శ చెయ్యాలని చాలామంది చెప్పటం పరిపాటి అయింది. అయితే ఈ విధంగా ఆలోచించేవారు ఒక్క విషయాన్ని విస్మరిస్తున్నారు. కవికి వలెనే విమర్శకుడు కూడా సమాజంలో జీవిస్తున్న వ్యక్తి ఈ సమాజ ప్రభావం కవిమీద ఎట్లా ఉంటుందో విమర్శకుడిమీదకూడా అట్లాగే ఉంటుంది. సమాజంపట్ల కవికి ఎంత బాధ్యతఉందో విమర్శకుడికీ అంతే బాధ్యత ఉంటుంది. అంచేత విమర్శకుడు కవిత్వంలో చెబుతున్న సిద్ధాంత భావనకు అతీతంగా కవిత్వాన్ని అంచనా వెయ్యాలనేవాదం సమర్థనీయమైనదికాదు. ఒక ప్రక్రియ కవిత్వం అవునా?కాదా? అని నిర్ణయించడానికి, అది సమకాలీన సమాజానికి ఉపకరిస్తుందా? లేదా? అని విశ్లేషించడానికి అంతరం చాలాఉంది. ఏది కవిత్వం? ఏది కవిత్వం కాదు? నిర్ణయించడానికి సిద్ధాంత దృక్పథం ముఖ్యసాధనం కాదు. కవిత్వానికి సంబంధించిన శిల్ప రహస్యాలు, వీటికిమించిన పాఠక హృదయం ఏది కవిత్వమో? ఏది కాదో నిర్ణయిస్తాయి. అంతేకాని మనకు నచ్చనిభావాన్ని చెప్పినంతమాత్రంలో అది కవిత్వం కాకుండా పోవలసిన అవసరంలేదు. సాధారణంగా కవులు సమాజాన్ని ముందుకు నడిపించే ఇతివృత్తాన్ని, సిద్ధాంత దృక్పథాన్ని కలిగిఉంటారు. వారు గ్రహించే ఇతివృత్తాన్నిబట్టి, వారి సైద్ధాంతిక దృక్పథాన్నిబట్టి వారు పురోగామికవులో తిరోగామికవులో నిర్ణయింపబడుతుంది. పోగా ఒక్కొక్కకాలంలో ఒక్కొక్క ప్రక్రియ కవితా సంప్రదాయంగా స్థిరపడుతుంది. ఒక్కొక్క భావానికి ఒక్కొక్క ప్రక్రియ పరిపడి ఉంటుంది. ఈ సత్యాన్ని మన విమర్శకులలో కొంతమంది అంగీకరించడంలేదు. ఏ భావాన్ని చెప్పినా అది కవితాత్మకంగా ఉండాలని తృప్తిపడేవారు కొంతమంది. ఆధునిక భావాన్ని కూడా సంప్రదాయక ఛందస్సులలో చెప్పి మెప్పించవచ్చునని వాదించేవారు కొంతమంది. ఈ వాదంలో ఒక లోపంఉంది. సమాజపరంగా వీరు సంస్కరణను మనసా వాంఛిస్తారు. భాషపరంగాను, ప్రక్రియాపరంగాను జరుగుతున్న సంస్కరణను వీరు అంగీకరించరు. "ఇంత సంప్రదాయ విరుద్ధంగా వాదించిన రామలింగారెడ్డిగారు భాషవిషయంలో సంప్రదాయాన్ని వదలకపోవడం ఆశ్చర్యకరమే. అంతటి హేతువాది త్రిపురనేని రామస్వామిచౌదరి కూడా భాష విషయంలో హేతువాది కాలేకపోయాడు. తెలుగుదేశపు మేధావుల్లో ఇదొకవిచిత్రమైన వైరుధ్యం"! అంటారు చేకూరి రామారావుగారు. రామలింగారెడ్డిగారు కవితా విమర్శక విధానంలో నూతనపోకడలు ప్రవేశపెట్టినవారు. త్రిపురనేని రామస్వామి చౌదరిగారు పురాణగ్రంథాల్లో ఉన్న అసత్యాలను వెలికి తీసినవారు. మొదటివారికి తెలుగుసాహిత్య విమర్శను సంస్కరించడం ధ్యేయమైతే రెండోవారికి సమాజంలోని మూఢవిశ్వాసాలను రూపుమాపటం ధ్యేయమైంది. భాషపరంగా ఎవరి వ్యక్తిత్వాన్ని వారు

నిలబెట్టుకొనడమే వారి దృక్పథం. కాగా సమాజంలో కనుపించే అనేక లవకతవకలకు ఆర్థికశక్తి మూలమన్నది వీరి దృష్టిపథంలోకి రాక పోవడంకూడా పై వైరుధ్యానికి ఒకకారణం కావచ్చు శ్రీమతి డా. నాయని కృష్ణకుమారిగారు రామస్వామి చౌదరిగారిని గురించి ఇట్లా రాశారు. 'కులవ్యవస్థను సమూలచ్ఛేదం చెయ్యాలనే విప్లవవాది కాడాయన. బ్రాహ్మణాధిక్యం తగ్గించాలని మాత్రమే కంకణంకట్టి కమ్మకులంలో ఉత్సాహవంతులైన యువకులకు సంస్కృత మంత్రాలకు తెలుగుచేతలు నేర్పి వారిని కమ్మ బ్రాహ్మణులుగా తీర్చిదిద్దారు. తెనాలిలో ఈయన ఇల్లు సూతాశ్రమం. అక్కడనుండే సూతాశ్రమ గీతాలు వెలువడ్డాయి. అంతేకాక, కమ్మకుల చరిత్రను వ్రాయించిన కుప్పస్వామి చౌదరి అనే ధనవంతుడైన దాతమీద కుప్పస్వామిశతకాన్ని రచించి, కమ్మ మహాసభల్ని జరిపించి, అధ్యక్షస్థానాన్నలంకరించి ఉపన్యాసాలిచ్చేవారీయన. ఇవన్నీ సంప్రదాయాన్ని ఆమోదించే చర్యలే. అయినా ఈయనకు ప్రాచీన మతగ్రంథాలలో స్థిరపడిపోయి, రాటు దేలిన విప్రత్వంమీద ద్వేషమేకాని విప్రులమీద కోపంలేదు. ఈయన కెందరో బ్రాహ్మణ స్నేహితులు. వ్యక్తిగతమైన కక్షలకు ఈయన హృదయంలో స్థానంలేదు.' [2] రామస్వామి చౌదరిగారు భాషా సంప్రదాయంమీద తిరుగుబాటు తీసుకురాకపోవడానికి కారణం పై అభిప్రాయం స్పష్టంచేస్తున్నది. ఆర్య, ద్రావిడ సంస్కృతుల వైరుధ్యం ఆయన కవితా దృక్పథమైనది. ఇంతగా ఎందుకు చెప్పవలసివస్తున్న దంటే—ప్రసిద్ధమైన, ప్రఖ్యాతమైన కవిత్వంరాసే ప్రతికవికి ఒక సైద్ధాంతిక దృక్పథం ఉంటుందని చెప్పడానికి మాత్రమే.

ఆదికవులదగ్గరనుండి ఆధునిక కవులదాకా పేరెన్నికగన్న గొప్ప కవులంతా ఒకసిద్ధాంత దృక్పథానికి కట్టుబడినవారే. ఆ దృక్పథంవెనుక రాజకీయంఉండవచ్చు;మతంఉండవచ్చు,మరేదైనాఉండవచ్చు. పురాణ, శైవ కవులను మతకవులని, ప్రబంధ, దక్షిణాంధ్ర కవులను శృంగార కవులని భావిస్తున్నట్లే అభ్యుదయ, విప్లవకవులను రాజకీయకవులుగా భావించడం అలవాటయింది. కవుల కావ్యాలలోని ఇతివృత్తం కాల ధర్మమని ఆయాకవులను, వారి కావ్యాలను ఆ కాలధర్మంతోనే అంచనా వేస్తూ వర్తమానకాలంలో వారి అస్తిత్వపరిధిని నిర్ణయించాలని ఇప్పటికీ ఇంకా చాలామంది గుర్తించకపోవడంవలన తెలుగు కవితా విమర్శ సాగివలసిన మార్గంలో సాగకపోవటానికిగల మూలకారణం.

"ఇవి యేమున్ సతతంబు నా యెదఁ గరంబిష్టంబులై యుండుఁ బా
యవు భూదేవ కులాభి తర్పణ మహీయః ప్రీతియున్ భారత
శ్రవణాసక్తియుఁ బార్వతీపతి పదాబ్జ ధ్యాన పూజా మహో
త్సవమున్ సంతత దానశీలతయు శశ్వత్సాధు సాంగత్యమున్"[3]

ఈ పద్యంలో నన్నయ రాజరాజనరేంద్రుని అభీష్టము తేటో చెప్పడం తత్కాల ధర్మమది. ఈ అభీష్టాలవెనుక నిక్షిప్తంగా దాగి ఉన్న కారణం రాజకీయమే. అక్కడ రాజకీయం ఏమీ లేదని వాదించడం వైదికమతంపట్ల ఉన్న గాఢాభిమానమేగాని అన్యంకాదు.

"వైదికమార్గ నిష్ఠమగు వర్ణనముందుఁ నిర్వహించుచున్
భేదములేక భక్తి మతి నిర్మలవృత్తిఁ దాఁ జేయుచునుండు మ
త్పాద నిరంతర స్మరణ తత్పరభావము కర్మి నాత్మ స
మ్మోదముఁ బొందఁ గావ్యరసముం గొనియాడుచు నుండు
దెప్పుడున్"[4]

అని తిక్కనగారు దైవం నోటివెంబడి పలికించడంకూడ తిక్కన జీవించిననాటి కాలధర్మమే. ఆనాటి మతదృక్పథానికి ఆలంబనమైన వ్యవస్థ రాజకీయమని వేరే చెప్పనక్కరలేదు. మతాన్ని అంగీకరిస్తూనే, భక్తిని వారి కవితాదృక్పథంగా ఎంచుకొని తమకాలంనాటి రాజకీయాన్ని ఎదిరించిన పూర్వాంధ్రకవులూ ఉన్నారు.

"ఇమ్మనుజేశ్వరాధములకిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములుఁగొన్ని పుచ్చుకొని సొక్కి శరీరము వాసి కాలుచే
సమ్మెట వ్రేటులంబడక సమ్మతి శ్రీహరికిచ్చి చెప్పె నీ
బమ్మెర పోతరాజొకఁడు భాగవతమ్ము జగద్ధితమ్ముగన్"[5]

"రాజుల్మత్తులు, వారిసేవ నరకప్రాయంబు, వారిచ్చు నం
భోజాక్షీ చతురంతయాన తురగ భూషాదు లాత్మవ్యథా
బీజంబున్, తదపేక్షబాలుఁ బరి తృప్తింబొందితిన్ జ్ఞాన ల
క్ష్మీ జాగ్రత్పరిణామమిమ్ము దయతో శ్రీకాళహస్తీశ్వరా!"[6]

మొదలైన పద్యాలు పై భావనకు ఉపస్కారకములు. ఇట్లా ప్రాచీనాంధ్ర కవులంతా మతం, రాజకీయం, భక్తి మొదలైన సిద్ధాంత దృక్పథాలతో కవిత్వం రాసినవారే. వారి కవిత్వంలో సిద్ధాంత దృక్పథరాహిత్యమే ఉన్నట్లయితే వారుకూడా కవిత్వం, కవిత్వంకోసమే

నని రాసిఉన్నట్లయితే మనం ఈనాడు వారిపేర్లు చెప్పుకొనవలసిన అవసరంకూడా ఉండేదికాదు.

అభ్యుదయ కవిత్వం ఆదిగా ఇప్పటివరకూ వచ్చిన సామాజిక స్పృహ, చైతన్యవాద కవులకు మార్క్సీయ దృక్పథం కవితాసిద్ధాంత దృక్పథమైనది. వేమనచూపిన సంస్కరణవాదం, త్రిపురనేనివారి హేతువాదం, గురజాడ వాస్తవికతావాదం ఈనాటి మార్క్సీయ సిద్ధాంత భావనలో అంతర్భాగాలయ్యాయి.

'కనబడలేదా మరో ప్రపంచపు
అగ్నికిరీటపు ధగిధగలు
ఎర్రబావుటా విగనిగలు
హోమజ్వాలల భుగభుగలు'[7]

అనడంలో తొలిసారిగా మార్క్సీయ సిద్ధాంత దృక్పథం ఆధునిక కవిత్వంలో ధ్వన్యమానమైనది. పై ప్రతీకలన్నీ ఏర్పడబోయే సామ్యవాదవ్యవస్థను సూచిస్తున్నాయి. పాత సంప్రదాయాలస్థానే కొత్త సంప్రదాయాలను నెలకొల్పడం, పాతవ్యవస్థను త్రోసిరాజని కొత్తవ్యవస్థను నిర్మించడం వర్ణ, వర్గాలతో కూడిన పాతప్రపంచాన్ని తొలగించి వర్ణరహిత, వర్గరహిత మరో ప్రపంచాన్ని వ్యవస్థీకృతం చెయ్యడం ఆధునిక కవిత ప్రధాన లక్ష్యం.

'కనకదుర్గా చండసింహం
జూలు దులిపి ఆవులించింది
ఇంద్రదేవుని మదపుటేనుగు
ఘీంకరిస్తూ సవాల్ చేసింది' [8]

అనే పాదాలు సంప్రదాయకంగా సాగుతున్న జీవనవిధానంమీద రాబోతున్న తిరుగుబాటుకి నిదర్శనాలు.

'పుడమితల్లికి
పురుటి నొప్పులు
కొత్తసృష్టిని స్ఫురింపించాయి'[9]

తిరుగుబాటు అనంతరం ఏర్పడే నూతన వ్యవస్థావిర్భావానికి ఈ పాదాలు ప్రతీకలు. కవితా వస్తువులో వచ్చిన మార్పు గమనార్హమైనది. పూర్వ కావ్యేతి వృత్తాలకు, ఆధునిక కావ్యేతి వృత్తానికిగల వ్యత్యాసం పూర్వసామాజిక వ్యవస్థకు, ఆధునిక సామాజిక వ్యవస్థకు గల వ్యత్యాసమే. పూర్వ కవిత్వమంతా కవిత్వంగా కనబడి ఇప్పటి కవిత్వమంతా రాజకీయాలమయంగా కొంతమందికి దృశ్యమాన మవడం ఒక వ్యవస్థపట్లగల అభిమానానికి, మరో వ్యవస్థపట్లగల ద్వేషానికి నిదర్శనమే కాని వాస్తవంమాత్రంకాదు. మార్క్సీయసిద్ధాంత దృక్పథాన్ని కవితా సిద్ధాంత దృక్పథంగా అంగీకరించినప్పుడు కవితా విలువలు మారక తప్పదు. అందుకే కావ్యేతివృత్తం—

''కమ్మరి కొలిమీ, కుమ్మరి చక్రం
జాలరి పగ్గం,
సాలెల మగ్గం,
శరీరకష్టం స్ఫురింపజేసే
గొడ్డలి, రంపం, కొడవలి, నాగిలి,
సహస్ర వృత్తుల సమస్త చిహ్నాలు—
నా వినుతించే,
నా విరుతించే,
నా వినిపించే నవీన గీతికి
నా విరచించే నవీన రీతికి
భావం!
భాగ్యం!
ప్రాణం!
ప్రణవం!''[10]

అయింది. ఇతివృత్తం లౌకికమైనా, తత్కాలికమైనా కవిత్వం కవిత్వం కాకుండా పోదుగదా! కావ్యవస్తు నిర్ణయంలో ఆలంకారికులే కవికి స్వేచ్ఛను ప్రసాదించారు.

''రమ్యం జుగుప్సిత ముదార మథాఽపి నీచం
ఉగ్రం ప్రసాది గహనం వికృతంచ వస్తు
యద్వాఽప్యవస్తు కవిభావక భవ్యమానం
తన్నాస్తియన్న రసభావముపైతిలోకే''[11]

పై శ్లోకంలో కావ్యపరంగా వస్తు నిషేధం ఏమీలేదని చెప్పటం ఆలంకారికుల మతం. అయితే నాయకా, నాయికల విభాగం, వస్తువిభాగం ప్రాచీనాలంకారికులు ఎందుకు చేసారు అంటే—ఏ ఆలంకారికుడుగాని తన లక్షణ గ్రంథానికి అంతకుముందున్న కావ్యాలను లక్ష్యంగా తీసుకుంటాడు. భవిష్యత్కవిత్వపరిణామాలను ఆలంకారికుడు ముందే ఊహించలేడు. అందువలననే ఆ నియమం అట్లా సాగింది. ఈనాటి కవిత్వానికి ప్రాచీన ఆలంకారిక శాస్త్రాలు సర్వత్రా ప్రమాణాలు కావన్నది సర్వులూ ఎరిగిన సత్యమే. అయితే ఏ మేరకు పనికివస్తాయి అనే అంశంపై కృషి జరుగవలసి ఉన్నది. కావ్య వస్తుగతమైన విలువ శాశ్వతమా? తాత్కాలికమా? అన్నది చర్చ కానే కాదు. వస్తువును కవిత్వంగా రూపొందించడంలో కవి జయంపొందాడా? అపజయంపొందాడా? అన్నదిచర్చ. కవివస్తునిర్వహణలో సఫలీకృతుడైతే అతనేవస్తువును గ్రహించినప్పటికీఅది కవిత్వంగా ఆస్వాదయోగ్యమేకదా! అని ఆలోచించే విధానం ఒకటున్నది. కవిగా గుర్తించడంవరకూ ఎవరికీ భేదాభిప్రాయం ఉండవలసిన అవసరంలేదు. ఆ కవిత్వం సమాజ సంక్షేమానికి ఉపకరిస్తుందా? లేదా? అన్న చర్చలోనే కవిస్థానం నిర్ణీతమవుతుంది. పూర్వాలంకారికులు కవిత్వ ప్రయోజనాన్ని పెద్దగా పట్టించుకొన్నవాళ్ళు కారు. అంచేతనే వాళ్ళ లక్షణ గ్రంథాల్లో కావ్యాత్మ కావ్యశరీరంమీద చర్చ ఎక్కువగా సాగింది. కావ్యాత్మధ్వనియై ఛందోలంకార తదితర లక్షణాలన్నీ కావ్యశరీరమయ్యాయి. ఈనాడు విమర్శలో కావ్యప్రయోజనం ప్రథమస్థానం ఆక్రమించడంవల్ల కవిత్వానికి ఆత్మవస్తువై శిల్పాంగాలన్నీ శరీరమవుతున్నాయి. ఆనాడు

శిల్పంముందు, వస్తువు తరువాత; ఈనాడు వస్తువుముందు, శిల్పం తరువాత.అయితే నాడు నేడు కూడా కవిత్వం జీవించడానికి శిల్పం ప్రధానమే అయింది ఏ కవిత్వం సమాజాని కుపకరిస్తుంది? ఏది ఉపకరించదు? అని ఆలోచించడంలో భిన్నాభిప్రాయాలుంటాయి. మానవ మనస్తత్వం అందరిదీ ఒకటిగా ఉండదు కనుక కవిత్వంలో కూడా ఈ రుచిభేదం తప్పదు. ఆధునిక కాలధర్మం ఏమిటంటే— ఈ సమాజ సంపదను సృష్టించడానికి ఎవ్వరు మూలమో వారి క్షేమానికి అంకితమైన కవిత్వమే ఆమోదయోగ్యమైన కవిత్వం. మిగిలినవాళ్ళది కవిత్వంకాదా? అంటే కవిత్వమే కాని సమిష్టి చైతన్యానికి, వ్యష్టిచైతన్యానికిగల భేదమే ఈ రెండు కవిత్వాలకుగల భేదమని విజ్ఞులు గ్రహిస్తారు విశ్వనాథ సత్యనారాయణగారిని, టి. ఎస్. ఎలియట్‌ని కవులు కారని ఎవ్వరూ అనరు. నారు ఎట్టి కవులో శ్రీ శ్రీ చక్కగా చెప్పాడు. "పరిణామం ఎంత వేగంగా సాగింది అనే కాకుండా ఏ దిక్కుగా సాగింది అని కూడా ఆలోచించాలి. పురోగమనమా, పశ్చాద్గమనమా అనే విషయం ఆలోచించాలి. ఇంగ్లండులో టి. ఎస్. ఎలియట్‌ని ఈనాటి మహాకవులలో ఒకడని అందరూ అంగీకరిస్తారు. కాని అతని దృక్పథంమాత్రం అభ్యుదయ నిరోధకం. మన విశ్వనాథ సత్యనారాయణగారున్నారు, ఆయనా అంతే. గ్రీకు రోమన్ కాలాల సంస్కృతి ఎలియట్‌ను ఆకర్షించినట్లే రామాయణ భారత కాలాల వైభవం విశ్వనాథవారిని ముగ్ధుల్ని చేస్తుంది. ఆవేళకీ ఈవేళకీ మానవజాతి చాలా ముందంజ వేసిందంటే ఇద్దరూ ఒప్పుకోరనుకుంటాను."[12] ఈ అంచనాలో ఎలియట్, విశ్వనాథలు అభ్యుదయానికి వ్యతిరేకులు అన్నభావన స్పష్టమైంది. విశ్వనాథను అభ్యుదయవాదిగా, విప్లవవాదిగా భావించేవాళ్ళూ ఉన్నారు. ఇంతకుముందు చెప్పిన రుచిభేదం అంటే ఇదే. విశ్వనాథ తన కవిత్వంలో ప్రదర్శించిన సిద్ధాంత దృక్పథంలో మమైక్యంచెందే వాళ్ళు అలా అనడంలో ఆశ్చర్య పడవలసిన అవసరం ఉండదు. సిద్ధాంత దృక్పథమనేది కవిత్వానికి, అందులోనూ గొప్ప కవిత్వానికి, మహాకవిత్వానికి అపరిహార్యమైన లక్షణం అని, నినాదం కవిత్వం ఏనాడు కాలేదని ఇకముందు కాదని నా అభిప్రాయం. మనకు నచ్చని భావనకి రాజకీయమనో, నినాదమనో విశేషణాల్ని వులమడం సంకుచితదృష్టికి నిదర్శనం. కవిత్వం రాజకీయాలనుంచి దూరంగా ఏనాడులేదు. కవిత్వంలో రాజకీయానికి, కవిత్వానికీ రాజకీయాలకుగల భేదాన్ని గ్రహించవలసిన ఆవశ్యకత ఉన్నది. "కవికూడా మనిషే కనుక, అతనికి కొన్ని అభిప్రాయాలు— రాజకీయమైనవి, సాంఘికమైనవి, తాత్త్వికమైనవి విధిగా ఉండాలని చెప్పనుగాని సాధారణంగా ఉంటాయి. వాటికతడు కమిట్ కావచ్చు. అప్పుడు వాటి ప్రభావం అతని కవిత్వంలో విదిగా కనిపిస్తుంది. కవి ఏ రాజకీయ తదితర సిద్ధాంతాలకూ కమిట్ కారాదని, నిర్లిప్తంగా ఉండాలని, కవిత్వం అన్ని రాజకీయ, తదితర విశ్వాసాలకు అతీతంగా ఉండాలనే వారి వాదంతో నేను ఏకీభవించలేను"[13] అంటారు నండూరి రామమోహనరావుగారు. సిద్ధాంత దృక్పథం కవిత్వానికి లోపంకాదు. సిద్ధాంత రాహిత్యం కవిత్వానికి పెద్దలోపం. కవిత్వం కవిత్వంకోసం కాదు కనుకనే కవిత్వంలో సిద్ధాంత భావన ప్రవేశిస్తున్నది. అందుకు ప్రాచీన కవుల దగ్గరనుంచి ఆధునిక కవుల వరకు గొప్ప కవులందరూ ఉదాహరణగనే నిలుస్తారు.

## ఆధార గ్రంథాలు


1 1900—1947 మధ్య తెలుగు సాహిత్యవికాసం – తెలుగు సాహిత్య విమర్శలో ఆధునిక ధోరణులు: చేకూరి రామారావు, పేజి—114.

2 1900—1947 మధ్య తెలుగు సాహిత్య వికాసం – సంప్రదాయ కవిత: శ్రీమతి నాయని కృష్ణకుమారి, పేజి 21.

3 భారతము: ఆదిపర్వము, ప్రథమాశ్వాసము; నన్నయ, పద్యం—12.

4 భారతము: విరాటపర్వము, ప్రథమాశ్వాసము; తిక్కన, పద్యం—15.

5 సారస్వత వ్యాసములు, రెండవ సంపుటము; సారస్వత జీవనలు, చిలుకూరి వీరభద్రరావు, పేజి 49.

6 శతక సంపుటము, కాళహస్తీశ్వర శతకము: ధూర్జటి, పేజి 98, పద్యం—18.

7 8, 9, 10, మహాప్రస్థానం శ్రీ శ్రీ; మరో ప్రపంచం, అవతారం, ప్రతిజ్ఞ.

11 దశరూపక శ్లోకము–కావ్యాలంకార సంగ్రహము. సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి, పేజి –126.

12 గురజాడ: శ్రీ శ్రీ, పేజి –46.

13 మహాసంకల్పం, కవితా సంకలనం, స్వవిషయం – నండూరి రామమోహనరావు.

# భారమితి

## శ్రీ కె. శివారెడ్డి

కవిత్వానికి కాలం చెల్లిందంటున్నారు
కవిత్వానికి కాలంగాదంటున్నారు
అంతటా స్తబ్దత ఆవరించిందంటున్నారు
అందరూ చేతులెత్తేశారంటున్నారు!

రక్తమాగిపోయినవాడు స్పందనని కొలవలేడు
కళ్ళల్లో సూర్యుడు కదలాడనివాడు ప్రపంచాన్ని స్పృశించలేడు
నాకంతటా కవిత్వం కదలాడుతుందేమిటి!
నాలో ప్రతీదీ కవిత్వంగా పరివర్తన చెందుతుందేమిటి !

చేయిచాచి వేళ్ళకేసీ చూచుకుంటే కవిత్వం
కళ్ళుమూసి నుదటినదిని చేత్తోపట్టుకుంటే కవిత్వం

అడుగుదీసి అడుగేయటంలో కవిత్వం
చేత్తో తలుపుమీద గుద్దటంలో కవిత్వం
సాలోచనగా చూపు ముక్కుమీంచిజారి
కిందపడి మెలిస్తే కవిత్వం
బోర్లాపడుకుని భూమిని వాటేసుకుంటే కవిత్వం
రెండుచేతుల్నిండా దుమ్ముతీసుకుని నెత్తిమీద పోసుకుని
జలకాలాడ్డం కవిత్వం
చదువుతూ చదువుతూ పుస్తకం తెరచి గుండెలమీద
పెట్టుకుంటే కవిత్వం.
చేత్తో నీటి ఆరోగ్యాన్ని మీటటం కవిత్వం
ముక్కుతో గాలిని వలేసి పట్టటం కవిత్వం
అప్రయత్నంగా చేయి మీసంమీదికి పోయి అలా
గడ్డాన్ని సవరించటం కవిత్వం
సాయంకాలమో పొద్దుటిపూటో రెక్కలు దీసి
కిటికీవద్ద నిలబడితే కవిత్వం—
అగ్గిపుల్ల గీయటం కవిత్వం — ఎదురుబద్దవంచి
విల్లంబు చేయటం కవిత్వం

బజాట్లో ఈతేయటం కవిత్వం
కూడలిలో కరెంటు స్తంభమవ్వటం కవిత్వం

తీగల్లో పరుగెత్తే నిరాకార చైతన్యం
దూరదూర తీరాలకు సాగిపోయే శబ్దవిహంగమూ కవిత్వమే-
నా శిరసు శిఖరాగ్రంపైకి నేనెక్కి తలకిందులుగా
జనం జలధిలోకి దూకటమూ కవిత్వమే

ఇటుతిరిగి చేయిచాస్తే శ్రీకాకుళ కవిత్వం
అటుతిరిగి కనుతెరిస్తే జగిత్యాల కవిత్వం
వెనుదిరిగి శిరసెత్తితే ధర్మపురి కవిత్వం
ఆర్కాటుజిల్లాలు కవిత్వం.

నేనో వాహకం
నా రక్తంలోంచి దూసుకొచ్చిన ప్రపంచమంతా కవిత్వం.
తెల్లకాయితం ఆహ్వానిస్తుంది కవిత్వ కదనానికి
తెల్లారబోయే ఆకాశమూ ఆహ్వానిస్తుంది కవిత్వోద్యమానికి
గంటగంటకీ కాలాన్ని మోయించి చూయించే
గడియారం గుండెకాయాపిలుస్తుంది కవిత్వంలోకి—
గుడ్డివాడి కళ్ళలో దారివెతుక్కుంటున్న లోచూపు
చేతికర్రా పిలుస్తుంది కవిత్వంలోకి—
నా చూపుతో ముట్టుకున్నదీ, నా చేత్తో ముట్టుకున్నదీ
నా దేహంతో ముట్టుకున్నదీ కవిత్వమే —
కంటిచూరునుంచి రాలే కన్నీటిచినుకూ
శీతాకాలం రాత్రంతా ఊరికి కాపలాకాస్తున్న
యానాది వాడిజుట్టు చివరనుంచో, బుగ్గలమీంచో
జారే మంచుతుంపరా కవిత్వమే
ఎల్లప్పుడూ మేల్కొని వుండేవాడి చేతికర్రా కవిత్వమే—
నిత్యజాగరణలో జాగృతిభూత పాదయాత్రా
పదయాత్రా కవిత్వమే
'ముడియనుము నల్లనిరేయని' ఎర్రగాకాల్చి సాగ్గొట్టి
రేపటి ఆయుధం చేస్తున్న అరణ్యమూ కవిత్వమే —
ఏ మహాకవో చదువుతూ చదువుతూ

అట్లావదిలేసిపోతే పేజీలు గాలికి రెపరెపా
కొట్టుకుంటున్న, ఆహ్వానిస్తున్న పుస్తక సముద్రమూ
కవిత్వమే-
వాడు దున్నుతుంటే కవిత్వం—వీడు మట్టి పెళ్ళవిరుస్తుంటే
కవిత్వం

వాడు చేయెత్తితే కవిత్వం – వీడు పెళపెళార్భటులో
ఉరిమితే కవిత్వం
చేతులన్నీ ఒక్కసారి లేచి 'ఇక్విలాబ్' అంటే
ఆకాశమంతా కవిత్వమే
గాలిగాలంతా కవిత్వమే – భూమి తనువంతా కవిత్వమే !

# వసంత రాగోదయం

## సాంధ్యశ్రీ

ఝాను మివులంగ మా తెలుగు తోటలలోకి
చిత్ర ప్రాబలుకు తళుకు మిలమిలలతో ఇంపు
చొప్పల పరచి ఏగుదెంచె ! తొలిసారు క్రొందావి
తేనెత్రావి తెలుగు ఇల్లాదిరాకొట్టు పాటపాడ.

తూరుపు వెల్గురేక గమి తోచెను-పైడి వొరంగు పొంగులున్
పొరువ పట్టె రాగ మెగ్రబాకె జనమ్ము జగామొగాలపై
పేరిమి కూరుముల్ పికిలి పిట్టల కూతలు ఘంపిలంగ–చే
కూరె ఉగాది బాన సరిక్రొత్తయొయారపు రాకతెల్గునన్.

నావిగాలికి నెరి కురు లల్లనలాడి మొగమున
వింతడాలు మెరయ సిగను మోదుగలు విరియ
తెలుగు పొలతి ముడికట్టులో సరికొత్త జోకదోప
ఆమని పులుకు తెలుగు నేలపైన నవఘళించి.

తొలిజాము సవురుతో వలినాలి తెమ్మెరల్
గిలిగింత కలిగించె చెలువుమేన
వేప పూవును మావిపూప, చింతపులుపు
చిల్కె క్రొత్తరుచులు నాల్కపైన
ఆమని తలపూవు గోముఘుల్లియకూర్చె
మురువు పొలపములు ముకుపుటాన
జిలుగు పాటలను కోయిల పాములు చిలికె
సవురు మివులు ఛవుల్ చెవులలోన

ప్రకృతి యంతయు కన్నుల పండువగుచు
పోడుములు కుప్పలై తెల్గునాడునందు
అంద చందము లింపొంది పొందుకొనియె
జగ్గు విగ్గులను ఉగాది చానరాక.

కొమ్మ సిగల పూలకోర్కె విరియ రెమ్మ రెమ్మకు
మల్లె గుత్తు లలరి పూచె తెలుగు పెదతోటలో
తలిరాకు తెలిరేకు; విగ్గు నెలకొన్న తొలినాటి
నెలలోన తెలుగు లోగిళ్ల తొలి కలలు పండ.

ఆమె లత సమకూర్చెను ఆమె తలను
పసిడి మామిడి పండుల పనస తొనల
పెరటి కొబ్బరి నీళ్ల క్రొవ్విరుల తేనె
జనుల తలపుల తీపియు జడికొనంగ.

నును చివురాకులో వగరునుం జవిచూచిన నోట తేనె చిం
ద నునుపుగీతి పాడెదు కతమ్మదియేమి యెలుంగు తేడ ? ఆ
నన విలుకాని నేస్తము కనంబడి యుబ్బుటగాక తెల్గు వా
టను మరి ఈ యుగాదివి నెటం కనుగొందువు వానితోరుతన్.

ఈ నవ వసంత శుభ విభాతాననరుచి
అరుణమై–తరుణమై–వితరణమై–మ
దీయ హృదయమూల తిమిరచ్ఛాయలను–గ్ర
సించి వేలసించి వెలుగు చిన్నెలొలుక.

తలివము పూవునాకు వసుధన్ తవు నీలితనంబు దేహమా
కలగొను భావమే బలిమి. కాలమె నెచ్చెలి. శ్వాసతావియౌ
వలిపము పూలపుప్పొడి. నివాసము ఎల్లెడ వీచుగాలియౌ
మలయిక నాకగున్ సరసమార్గ వసంత రస స్రవంతిలో.

నవ వసంత శుభోదయ పవన మాలి
కాము హృదయము మధురారామ దివ్య
సౌరభమ్ముల దెచ్చి నాసాపుటమ్ము
లందు గుమ్మరించి వలపు బిందులొలికె.

ఈ ప్రభాతకాలాన "నిదే వసంత
మని సుషిప్తి పదరిపీడుమ"ని పికమ్ము
మంజుగానలహరి శ్రావ్య మధురసరణి
శ్రవణ యుగ్మమ్మున జిలికిచవులనొలికె.

చిత్తనెలయందున మింటి నీలిగోలము మంటి
పై వింత తళుకొత్త పుడమి చిత్తసౌరుల – బా
సల పెక్కెమెత్తె. ఎలనాగమది వలపుటెడ
నీటి పఱుతజాలున పలుకదత్తడి పడవలాడసాగె.

తెలుగునేల నాలుగు చెరగుల మెలగెను
చెలిమికలుములు. పొలచెను తొలివెలుగులు
నిలిచె కీరితిబావుటా అలరెక్రొత్త
ఏటిమాను తొలినకై ఈ యుగాది.

హర్షోత్కర్షము నూతన
వర్షాగమన శుభవేళ ప్రవిమల వైరా
మర్ష రహితమ్ముగాను ప్ర
వర్షితమై తనరుత అనవరతమ్మాంధ్రిన్.

ప్రాక్తన సంప్రదాయ వినిబద్ధ కవిత్వములోని దేశి మా
ర్గోక్తుల సంస్మరించి మధురోహల దారుల సంచరించి శ్రీ
సూక్తుల రమ్య దివ్య పరిశుద్ధ నవీనత సంతరించి–వే
మౌక్తిక పద్యహారమున మన్ననచేసెద నీ నవాబ్దికిన్ !

# సమాధిలో నేను

## శ్రీ కె. అంజయ్య

అవున్నిజమే
 పుస్తకాలముందు సమాధిలో నేను
తీగతెగి రాగం పట్టుతప్పి
నాగల్ని లాగుతూ బక్కెద్దులు తీస్తున్న శోకం.

ఆలోచనలేకుండా
పండుటాకుల్ని
నలిపిపారేస్తూ కదుల్తున్నకాళ్ళు.
సముద్రంలో మొలకలేస్తున్న చేతులు
అమాయకుల్ని కౌగిట్లోకిలాగి
శవాల్నిచేస్తుంటే రాలిన ఆర్తనాదం.
అలుకుడు పిడచలో జీవితాన్నిమోస్తూ
పేడనీళ్ళలో కలిసిపోయిన విట్టూర్పులు.

'కందెన'లేని ఇరుసుపై
అరుగుతూ కదుల్తూ
గుండెలు బాదుకుంటూ అరుస్తున్న 'గీర' (చక్రం)

లంకెమొద్దు
గిత్త కోడెతనము చప్పరిస్తుంటే
ఉక్కిరిబిక్కిరౌతున్న ఆవేశము.
దృశ్యనాదాలేవీ నన్ను కదల్చలేనపుడు
నిజమే నేనింకా సమాధిలోనే
పుస్తకం నన్ను విద్రలేపనంతకాలం
పుస్తకం ఆయుధం కానంతకాలం
నేనింకా తలరాతలోనే
జాతకచక్రంచుట్టూ గింగిర్లు కొడుతూనే
ఊహల రసపిచ్చిలో నలిగిపోతూనే ... !


దాసరి నారాయణరావు
అలనాడు దేవదాసు.
ఇప్పుడు ప్రేమదాసు
ఉగాది శుభాకాంక్షలు!
మీకు ఆయన కావాలి! నాకూ ఆయన కావాలి!
ఏవస్తువైనా ఇద్దరు కావాలనుకున్నపుడు-
ఇద్దరూ కొనుక్కోవాలనుకున్నపుడు-
ఎవరు ఎక్కువ రేటు పెడితే
వాళ్ళకే దక్కుతుంది
శ్రీమతి అక్కినేని అన్నపూర్ణ సమర్పించు
ప్రేమాభిషేకం
అన్నపూర్ణా స్టూడియోస్
ఈస్ట్‌మన్‌కలర్
నిర్మాతలు: వెంకట్ అక్కినేని, నాగార్జున అక్కినేని
అన్నపూర్ణ
GEETHA
JAGAPATHI

డా. హెచ్. ఎస్. బ్రహ్మానంద

# ఆలంకారికుల వాక్ తత్త్వదర్శనం

అనుపాసిత వృద్ధానాం విద్యానాతి ప్రసీదతి
(వాక్యపదీయం 2-493)

'ది గాడెస్ ఆఫ్ లెర్నింగ్ డస్ నాట్ స్మయిల్
ఆన్ దోస్ హూ నెగ్లెక్టెడ్ ది ఏన్షన్ట్స్'
[J. Brough అనువాదం 1951]

## 0. 0. ప్రవేశిక

భామహాదుల్ని ఆలంకారికులు అని వ్యవహరించడం సాహిత్య రంగంలో అలవాటు. ఈ వ్యాసంలో ఆలంకారికులు దర్శించిన 'వాక్' స్వరూపాన్ని పాఠకులకు అందించడం ప్రధాన ఉద్దేశ్యం. (చూ. అ. సూ. 1.) ఈ శతాబ్దం ప్రత్యేకత ఏమిటంటే భారతీయులకంటె పాశ్చాత్య పరిశోధకులే అధికంగా సంస్కృత గ్రంథాల్ని సమగ్రంగా పరిశీలించడమూ, తమ తమ శాస్త్రాల్లోని లోతుల్ని ఆ గ్రంథాల్లో దర్శించి హర్షించడమూ, విస్తృతంగా రాయడమూ జరుగుతూ ఉండటం. అలాంటి సందర్భం ఒకటి చూద్దాం:

"కంటెంపరరీ స్కాలర్‌షిప్ విథిన్ దిస్ ఫిలలాజికల్ పర్‌స్పెక్టివ్ కంటిన్యూస్ టు ప్రొడ్యూస్ వాల్యుబుల్ రిసల్ట్స్ దట్ ఆర్ న్యూ టు వెస్టర్న్ స్కాలర్స్ దో ఆఫెన్ పర్‌ఫెక్ట్‌లీ వెల్ నోన్ టు ఇండియన్ పండిట్స్. ఆల్ ది సేమ్, దేర్ ఈస్ ఎ రీసెంట్ రివయివల్ ఆఫ్ ఇంటరెస్ట్ ఇన్ ది శాన్స్‌క్రిట్ గ్రమేరియన్స్ విచ్ ఈస్ పార్ట్‌లీ లింక్‌డ్ విత్ ది ఎక్స్‌ట్రార్డినరీ డెవలప్‌మెంట్స్ దట్ హావ్ టేకెన్ ప్లేస్ డ్యూరింగ్ ది లాస్ట్ డికేడ్ ఎండ్ ఎ హాఫ్ ఇన్ వెస్టర్న్ లింగ్విస్టిక్స్."

—జె. ఎఫ్. స్టాల్ (1972) ప్రిఫేస్ xii

0. 1. ప్రొఫెసర్ స్టాల్ అమెరికాలో ఒక తత్త్వశాస్త్ర పండితుడు. ఇండియాలో తిరిగి వైదిక వాఙ్మయంమీద, 'న్యాయ' తత్త్వంమీద చాలా పరిశోధన చేసినవాడాయన. ఆయన ఇంకా ఇలా అన్నాడు:

"బట్ నౌ దేర్ ఆర్ ఎట్‌లీస్ట్ టూ టోటల్లీ న్యూ రీజన్స్ ఫర్ సచ్ ఎ రివయివల్. ఫస్ట్, ది యాక్టివిటీస్ ఆఫ్ ది ఇండియన్ గ్రమేరియన్స్ ఆర్ ది క్లోసెస్ట్ పారలెల్ ఇన్ హిస్టరీ టు కంటెంపరరీ లింగ్విస్టిక్స్. సెకండ్, ఇట్ ఎపియర్స్ దట్ ఓన్లీ కంటెంపరరీ ఇన్‌సయిట్స్ కెన్ పేవ్ ది వే ఫర్ ఏడెక్వేట్ ఇంటర్‌ప్రెటేషన్స్ ఆఫ్ ది వర్క్ ఆఫ్ ది శాన్స్‌క్రిట్ గ్రమేరియన్స్ దెమ్‌సెల్వ్స్."

(ఆదే)

ఆయన రాసింది వైయాకరణుల విషయంగానేనైనా—ఈ సందర్భంలో—ఆలంకారికుల భాషాతత్త్వ దర్శనాన్ని అర్థం చేసుకోవడంలో కూడా స్టాల్ మాటల్లోని యాథార్థ్యం బయట పడుతుంది. ఇక్కడ రెండు విషయాలు గుర్తించాలి. (1) ఏ శాస్త్ర పరిణామంలోనైనా కొన్ని సమానలక్షణాలుంటాయి ఒకప్పటి వ్యాకరణ—తర్క—అలంకార శాస్త్రాల పరిణామానికీ ఆధునిక భాషా విజ్ఞానంలోని భిన్నసంప్రదాయాల సంపుమ కనిపించే చారిత్రక పరిణామానికీ అలాంటి సంబంధ సామ్యాలున్నాయి. (2) అత్యాధునిక శాస్త్రాల పరిజ్ఞానం ఎంత లోతుగా ఉంటే ప్రాచీన శాస్త్రాల 'తత్త్వం' అంత బాగా అవగాహనకు వస్తుంది.

0. 2. ఈ వ్యాసంలో ఆధునిక భాషాశాస్త్రనేపథ్యంలో ఆలంకారికుల్ని పరిశీలించడంవల్ల దాదాపు వేయిసంవత్సరాలక్రితం కొన్ని శతాబ్దాలపాటు భిన్న ప్రాంతాల్లో తిరిగిన ఆలంకారికుల పరిశోధనలో కనిపించే మౌలికమైన 'వాక్'తత్త్వ పరిశీలన బయటపడుతోంది. ఈ దృష్టితో కాకుండా కేవల కావ్యసౌందర్యంకోసమో, అలంకార, ధ్వనుల సంఖ్యకోసమో ఆ శాస్త్రాల్నిచూస్తే ఈ అంశం బయటపడేదికాదు. అందువల్ల ప్రధానంగా గుర్తించాల్సింది — శాస్త్రానికి ఆధునిక ప్రాచీనభేదం లేదనడం. సత్యప్రతిపాదనమే శాస్త్రలక్ష్యం.

0. 3. ఆధునిక భాషాశాస్త్రం భిన్న శాస్త్రాల నేపథ్యంతో చిలువలు పలువలుగా వ్యాపించిపోతోంది. నా పరిశీలనకు అందినంత వరకు ఆలంకారికుల భాషాపరిశీలనలో క్రింది విభాగాలలోని మౌలిక లక్షణాలు కనిపిస్తున్నాయి. స్టయిలిస్టిక్స్ (ఛాట్‌మాన్ ఎడ్.1971) సెమియోటిక్స్ (రోలాండ్ బార్త్స్ 1964, టెరెన్స్ హాక్స్ 1977), ఛైల్డ్ లాంగ్వేజి (పియాజెట్, జెస్పర్సన్, జాకొబ్సన్ 1971), డ్రీమ్ థియరీ—ది ప్రిన్సిపల్ ఆఫ్ అన్‌కాన్షస్ (జుంగ్, 1953), మ్యూసిక్, పెయింటింగ్ ఎండ్ డాన్స్ (ఆనంద కుమార స్వామి, 1928), ఆంత్రొపాలజీ ఎండ్ ఫోక్‌లోర్ (హ్యేమ్‌స్లెవ్, మాలినోస్కీ, బార్త్స్ 1964). ఇంకా కొన్ని విభాగాలున్నాయి. ఈ వ్యాస ప్రయోజనం దృష్ట్యా ఇంత చాలు.

0. 4. ఇన్ని భిన్నశాస్త్రాలు ఎలా పుట్టాయన్న ప్రశ్న వేసుకొంటే 'భాష' ఎలాంటి విశ్వస్వరూపాన్ని కల్గిందో అర్థం చేసుకోవచ్చు. పరిశోధకుడు వేసుకొనే ప్రణాళికనుబట్టి ప్రయోగం జరుగుతుంది. అంచేత పాణిని కాని, భర్తృహరికాని భామహుడుకాని భిన్న నేపథ్యాలనుంచి భాషాదర్శనం చేశారని అర్థం. ఆయా దృక్పథాల్లో మంచిచూస్తే అవి భాషమీద మౌలికమైన సిద్ధాంతాలనే చెప్పినట్టు. అరదరు శాస్త్రకారులూ 'భాష'మీదే పరిశోధన చేస్తారు — మౌలిక

మైన 'సామగ్రి' అదే కాబట్టి—కాకపోతే ఆ కోణాన్ని కనుక్కోవడంలో వుంది సమస్య అంటా—

''ఇట్ ఈస్ ఇండీడ్ నాట్ ఎట్ఆల్ సర్ప్రయిసింగ్ దట్ పాణిని ఎండ్ హిస్ కొలీగ్స్ కెనాట్ బి ప్రాపర్లీ అండర్స్టుడ్ అన్లెస్ దే ఆర్ టేకెన్ సీరియస్లీ ఫర్ వాట్ దె ఆర్, దట్ ఈస్, లింగ్విస్టిక్స్''. (అదే)

అని స్టాల్ అనడంలో ఈ రహస్యముంది.

ఆలంకారికులు చేసింది దర్శనం దానికిది ప్రయోగముఖ నిరూపణం. అన్ని శాస్త్రాల్లోను 'స్ఫురణ'ముందు 'ఆలోచన' తర్వాత (చూ. అ. సూ. 2).

0. 5.ఆలంకారికుల్లో ప్రథముడు భరతుడు. నాట్యశాస్త్రంలో వాక్కు (ఎక్స్ప్రెషన్) అభినయ ప్రభేదంగా గుర్తింపబడింది (చూ. నాట్యశాస్త్రం 6–24) అందువల్ల వాక్కు వ్యంజకం. దేనికి? రస భావానికి—అని అతని సిద్ధాంతం (చూ. 4 6) 'భావ'తత్త్వాన్ని శబ్దార్థముఖంగా నిర్వచించి 'వ్యంజన' సూత్రాన్ని స్థాపించినవాడు ఆనందవర్ధనుడు. భరతానంద వర్ధనుల సిద్ధాంతాలను తాత్త్విక పరిధిలో గ్రహించి వాక్సృష్టిని అభివ్యక్తి (ప్రిన్సిపల్ ఆఫ్ మానిఫెస్టేషన్)గా వ్యాఖ్యానించి వాక్తత్త్వ సీమాంత ప్రయాణం చేసినవాడు అభినవగుప్తపాదులు (ఆయన అభినవ భారతి, లోచనగ్రంథాలు ఈమాట కాధారం). ఈ ముగ్గుర్నీ వాక్తత్త్వ దర్శనంలో ప్రధానమైన 'మజిలీ'లుగా గ్రహించి భారతీయాలంకారికుల్ని సమగ్రంగా అర్థం చేసుకోవడానికి అవకాశం వుంది.

0. 6. ఆలంకారికులు చేసిన భాషాతత్త్వ దర్శనానికి వెనుక వైదిక వాఙ్మయంనుంచీ పుట్టి పెరిగిన భిన్నశాస్త్ర శాఖల నేపథ్యం వుంది. (చూ. లూయీ రినూ, 1941–42. 1961). ఆలంకారిక సిద్ధాంతాలు వైయాకరణ, మీమాంసక, నైయాయిక,వేదాంత వాదాలలో ముడిపడి వున్నాయి (చూ. అ. సూ. 3). ప్రొ. స్టాల్ మరోచోట ఈ విషయాన్నే ఇలా గుర్తించారు :

''ది డిస్టింక్షన్ బిట్వీన్ ప్రయిమరీ ఎండ్ సెకండరీ మీనింగ్ ఈస్ నాట్ కన్ఫయిన్డ్ టు అద్వయితా. ఆన్ ది కాంట్రరీ, ఇట్ ఈస్ వెరీ కామన్లీ మెట్ విత్ ఎమాంగ్ గ్రమేరియన్స్ ఎండ్ ఫిలాసఫర్స్, వయిల్ ఇట్ ప్రొవయిడ్స్ ది ఫవుండేషన్ ఫర్ ది సయిన్స్ ఆఫ్ పొయెటిక్స్ (అలంకారశాస్త్ర)...దేర్ ఆర్ మెనీ లింక్స్ బిట్వీన్ శాన్స్క్రిట్ పొయెటిక్స్ ఎండ్ లిటరరీ థియరీ ఎండ్ క్రిటిసిసమ్ ఆన్ ది వన్ హేండ్, ఎండ్ సమ్ ఫిలాసఫీస్ ఆఫ్ కాశ్మీర్ శైవిసమ్ ఆన్ ది అదర్''

(స్టాల్ 1969 ఇన్ సి. టి. ఎల్., పు.522–23)

0.7. ఆలంకారికుల 'వాక్' తత్త్వదర్శనం — విశిష్టమైందనడానికి ఇంకా ఒక తార్కాణంవుంది. అది భారతీయ తాత్త్విక దృష్టి — వ్యక్తావ్యక్త సమన్వయ ముఖంగా విచారణ చెయ్యడం— ఈ ప్రత్యేకత. ఈ లక్షణం పాశ్చాత్య దేశాల్లో ఎక్కడా స్పూత రూపాన్ని పొందినట్టులేదు. ఈ విషయాన్ని మొదట గుర్తించింది రనయిరో ఎ నోలీ (1968 ప్రిఫేస్ XXXIV)

(చూ అ సూ.4)

0 8 వాగ్వ్యవహారంలో వ్యక్తం — శబ్దం/అర్థం అవ్యక్తం— భావం. ఈ మూటినీ సమన్వయించడంలో పుట్టిన సిద్ధాంతాలే భిన్న ఆలంకారిక మార్గాలు. ఆలంకారికుల్లో ఆనందవర్ధనుడిదాకా ఉన్న భామహ సంప్రదాయం శబ్దముఖ పరిశీలన. భట్టోద్భట వామనాదుల మార్గం అర్థముఖ పరిశీలన — ఆనందుడి తర్వాతి కుంతకుడు శబ్దార్థసంసర్గ వాదం చేశాడు. అభినవులు శబ్దార్థ అభివ్యక్తి వాదం చేశాడు. ఇది ఆనందవర్ధనుడి శబ్దార్థ ఉపసర్జన వాదానికి పునర్వ్యాఖ్యానం భరత మత నిరూపణం

0.9. అందువల్ల వైదికశబ్దవిచారణకు యాస్కుని మొదలు సాయణుని దాకా ప్రమాణంగా కనిపించే పరోక్షమార్గ (ఇంటలెక్చువల్ ఎప్రోచ్) ప్రభావం ఆనందవర్ధనుడిదాకా నిబిడంగావుంది ఆయనతో మొదలైన నిదానమార్గం (ఇన్ట్యూషనల్ మెథడ్) కుంతకుడిలో పరాకాష్ఠను పొందింది. అందువల్ల మీమాంసక నైయాయిక మార్గాలు అద్వైతంలో ఒకరకంగా పర్యవసిస్తే — శివాద్వయ వాదంలో మరోరకంగా రూపునందుకున్నాయి. (ఈనాడు మళ్ళీ శబ్దాన్ని 'స్ఫురణా' దృష్టితో చూడటానికి హేతువు తత్త్వ, మానసిక శాస్త్రాల్లో ఇటీవల వచ్చిన పరిణామాలు. అరవిందుల వేదదర్శనం ఈ పద్ధతికి చెందింది కావడం గమనార్హ విషయం.)

చూ.అ.సూ.5

0.10. భర్తృహరి వైయాకరణ మార్గంలో 'స్ఫోట'కు అద్వైత వ్యాఖ్యానం చెప్పాడు — ఇది నిర్గుణదృష్టి (వాక్యపదీయం 1–1. నిదర్శనం). ప్రత్యభిజ్ఞా, స్పంద సిద్ధాంతాలు 'శివాద్వయ' దృష్టినుంచి పుట్టాయి. ఇవి 'సగుణ' మార్గాలు. ఆనందవర్ధన, కుంతక, మహిమ, అభినవులు —ఈ ప్రస్థానంలో మైలురాళ్ళు.

# 1.0. వాక్ తత్త్వపరిధి

అభిధ — లక్షణ — తాత్పర్య — వ్యంజన మార్గాలు వాక్ తత్త్వపరిధి (ది ఎక్స్టెంట్ ఆఫ్ ది యూస్ ఆఫ్ ఎక్స్ప్రెషన్) ని నిర్వచించడంలో భిన్నత్వాన్ని సూచిస్తాయి. ఒక్క వ్యంజనలో మాత్రమే తక్కిన మూడు మార్గాలూ సమన్వయిస్తాయి. ఆలంకారికుల్లో ఈ నాల్గుమార్గాలూ కనిపిస్తాయి. ఇందరిలోనూ సమానంగా కనిపించే లక్షణాలు కొన్ని వున్నాయి :

1 శబ్దార్థాలను వ్యాపార ముఖంగా పరిశీలించడం. ఇది మొదలు పెట్టింది భామహుడు — (శబ్దార్థౌ సహితౌ కావ్యమ్ కా. అ. 1–16)

2 ఆలంకారిక ప్రతిపాదనలు ఒక భాషాకావ్యానికి సంబంధించిన 'డిస్క్రిప్టివ్ ఎకవుంట్' కాకుండా — శబ్దార్థాలనాధారంగా చెయ్యటం వల్ల — ఇతర భాషలకీ అన్వయించగలగడం.

ఉదాహరణకు – అలంకార గుణాదులు ఒక సంస్కృతానికి మాత్రమే సంబంధించినవికావు అందుకే ప్రాకృతాది భాషం నుంచీ సప్తశతీత్యాది ముక్తకాలనుంచి, భగవద్గీత మొదలైన శాస్త్ర గ్రంధాలనుంచి – వాగ్వ్యాపార వికల్పానికి ఉదాహరణ లివ్వడం.

3 ఒక నిర్దిష్టమైన తాత్త్విక సూత్రాన్నో, తత్త్వమార్గాన్నో అవలంబించి ప్రతి ఆలంకారికుడూ తన పరిశీలన జరపడం. సూత్ర (ప్రిన్సిపల్) ప్రమాణ (మెథడాలజీ)లకు మధ్య ఒక సమన్వయం (సింథసిస్) కనిపించడం

# 1.1. శబ్దార్థ భావత్రికం

క్రిందిపటంలో శబ్దం – ఫోనెమిక్, మార్ఫెమిక్, సిన్‌టాక్టిక్ అన్న మూడుదశల్నీ సూచిస్తుంది అర్థం / సింక్రోనిక్/ హిస్టారిక్ అన్న రెండు భేదాల్నీ సూచిస్తుంది.→గుర్తు గమనాన్ని సూచిస్తుంది. ఊర్ధ్వదిశ అవ్యక్త అంశాన్ని, అధోదిశ వ్యక్తాంశాల్ని సూచిస్తున్నాయి (వివరణకు చూ. బ్రహ్మానంద 1979. అధ్యాయం 2)




(వైఖరి) శబ్దం = – (ఋణధృవం) వాగ్ వ్యవహారం ఇస్తున్నది (శవ్ –టు గివ్)
(మధ్యమ) అర్థం = + (ధనధృవం) వాగ్ వ్యవహారంలో పొందుతున్నది (అదే –టు రీచ్)
(పశ్యంతి) వాక్కు = ± శబ్దార్థాలుగా వినిర్గమించే తటస్థ దశ (ఇనీషియల్ స్టైన్)
(పర) భావం = శబ్దార్థాలు సమన్వయించే దశ (చూ. లోచనాంత వాక్సూత్తులు అ.సూ. 6)

# 2.0. శబ్దముఖ పరిశీలన

(ఫార్మ్ ఓరియంటెడ్)

మీమాంసకులు అభిధా తాత్పర్యవాద ప్రతిపాదకులు. వీరిలో ప్రాభాకర వర్గంలోని వాళ్లే ప్రాథమికంగా శబ్దదృష్టి కల్గినవారు. వీళ్ళు శబ్దాన్ని అభిధాన (నేమ్) మన్నారు. అంటే పేరు. 'అమ్మ' అనే శబ్దానికి 'తల్లి' అనే మరో శబ్దం అర్థం. కాబట్టి అర్థం– అభిధేయం – అంటే శబ్దం ద్వారా బోధింపబడేది కొన్ని నియమాలు అర్థాన్ని నియమిస్తాయి – సంసర్గ, విప్రయోగ, సాహచర్యాది హేతువులు ఇలాంటి నియమాలు (వాక్యపదీయం 2–317)

2.1. అభిధానం, అభిధేయం 'అభిధా' శక్తి – వ్యాపారం (నేమింగ్ పొటెన్షియాలిటీ) చేత కలిసి ఉంటాయి అందువల్ల శబ్దం – వాచకం (విచ్ నేమ్స్) అర్థం– వాచ్యం (దట్ విచ్ ఈజ్ నేమ్డ్) అందువల్ల శబ్దార్థాలమధ్యనున్నది వాచ్యవాచక సంబంధం (వాక్యపదీయం 2–401)

'సమయాపేక్షా వాచ్యావగమనిబంధనం శక్తి రభిధాశక్తిః'
(లోచనం. పుట 62)

కాని వ్యవహారంలో విశేషార్థాలు అనుభవంలోకి రావడం వుంది. దీనికి సందర్భాదిహేతువుల్ని ఊహించారు మీమాంసకులు. అన్వితాభిధానవాదులు అభిధ–బాణంలాగా దీర్ఘదీర్ఘ వ్యాపారం (ఎక్స్‌టెన్షన్) కల్గిందన్నారు.

2.2. పదదశలో 'అభిధ' సమర్థమేకాని వాక్యదశలో అర్థావగాహనను నిరూపించడానికి మరో ప్రమాణం కావాల్సివచ్చింది. అది తాత్పర్యం (పర్పోర్ట్). శబ్దముఖంగా సాగిన మీమాంసక మీమాంస ఉపక్రమోప సంహార, అభ్యాసాది షట్ ప్రమాణాలు చెప్పి వక్తృ వివక్షతో తాత్పర్యసిద్ధికి సంబంధంలేదని తేల్చింది. వక్తృ వివక్షప్రధానమన్న భాట్ట మీమాంసకులు 'అభిధా' మూలం గానే 'లక్షణ' ద్వారా తాత్పర్యం పుడుతోందన్నారు నైయాయికులు ఆకాంక్ష యోగ్యతా సన్నిధుల్ని తాత్పర్యసిద్ధికి ప్రమాణాలుగా చెప్పారు.

# 2.3. ఆలంకారికులు - అభిధాతాత్పర్యదృష్టి

భామహుడే వాచ్యవాచక పరిధికిలోబడ్డ అలంకార విమర్శ మొదలు పెట్టినవాడు. 'ఉపమ'లో శబ్దలక్షణ సమన్వయం ఉండొచ్చు కాని 'సమాసోక్తి'లో కుదరదు – అందుకే భామహుడు

'యత్రోక్తే గమ్యతేఽన్యోఽర్థః' (కావ్యాలంకారం 2–79)

అని సూత్రించక తప్పిందికాదు. 'వక్రత' (ఎంబెలిష్‌మెంట్) అనే మరో లక్షణాన్ని అదనంగా గ్రహించకనూ తప్పిందికాదు. ఈ రెంటినీ అభిధా ముఖంగానే చూశాడనటానికి ఆధారమిది :

'వక్రాభిధేయ శబ్దోక్తి రిష్టావాచమలంక్రియా'
(కావ్యాలంకారం 1–30)

2.31. అందుకే ఉద్భటుడు భామహ వివరణంలో 'శబ్దశ్ఛందోభిధానార్థః' అనే కారికను వివరిస్తూ

'శబ్దానాం – అభిధానం – అభిధావ్యాపారః ముఖ్యోగుణః వృత్తిశ్చ' ,

అని ముఖ్య గుణవృత్తుల్ని రెంటినీ అభిధాంతర్గతంగానే వ్యాఖ్యానించాడు. మీమాంసక ప్రభావం స్పష్టంగా కనిపించేచోటు ఇది.

2.32. తాత్పర్య విషయకంగా కూడా ఈ వాచ్యవాచక పరిధి కనిపిస్తుంది. తాత్పర్యం వాక్య పరిమితివరకేనని కొందరు, శబ్దశక్తిగా వ్యాఖ్యానించాలని కొందరు — ఘర్షణ పడటానికి నిదర్శనం ·

'యదేవం విధేయంతత్రైవతాత్పర్యమ్' (కావ్యప్రకాశం7–51)

సాహిత్యదర్పణం (1–2,8–4)లో చర్చింపబడ్డ అవిమృష్ట విధేయాంశదోషం — తాత్పర్యానికి ఉద్దేశ్య — విధేయ ముఖంగా వాక్యాన్వయంలో ఇచ్చిన నిర్వచనానికి సంబంధించింది. అందుకే కావ్యప్రకాశం (పుటలు 16–18) పదదశలో అభిధాశక్తిని, వాక్య దశలో తాత్పర్యశక్తిని గుర్తించాలన్న మీమాంసకాభిప్రాయాన్ని 'రికార్డు' చేసింది.

2.33. ఈ అభిప్రాయం మీద విమర్శ ఇలావుంది. ఒక వాక్యానికి విలక్షణార్థముంటుంది. అది పృథక్పదార్థాలకన్నా భిన్నంగా వుంటోంది కాబట్టి తాత్పర్యం వాక్యదశకు సంబంధించిందని అంగీకరిస్తే — వాక్యాంతర్గతంగావుండే పదానికివుండే విశేషార్థం (లక్ష్యార్థం) — ఎలా ఏర్పడుతోంది ? కాబట్టి 'అభిధ' వ్యాపారం (తాత్పర్యం కలిపి) సాధించలేని అంశాలున్నాయి. ఆనందవర్ధనుని విమర్శ ఇది :

(1) వాచ్యోఽర్థః సాక్షాత్ శబ్దస్య సంబంధీ తదితరస్తు అభిధేయ సామర్థ్యాక్షిప్తః సంబంధీ అవాచకస్యాపిగీతశబ్దాదే రసాది లక్షణార్థో అవగమ దర్శనాత్ అశబ్దస్యాపిచేష్టాదేః అర్థవిశేష ప్రకాశన ప్రసిద్ధేః (ధ్వన్యాలోకం పుటలు 417,446–47)

(2)యథా పదార్థద్వారేణ వాక్యార్థః సంప్రతీయతే (అదేగ్రంథం 1–10)

(3)నచపదార్థ వాక్యర్థన్యాయో వాచ్యవ్యంగ్యయోః (అదే.పుట.419)

ఈ అంశాలపై వివరాలకు చూ. 4.4.

2.34. లోచనం తాత్పర్యాన్ని ఇలా నిర్వచించింది. 'తదన్యథా నుపపత్తి సహాయార్థావబోధన శక్తి స్తాత్పర్యశక్తిః' (లోచనం పుట. 62).ఆనందుని దృష్టిలోమాత్రం వాగ్ వ్యాపారాలు మూడుమాత్రమే! (తదేవం శబ్దవ్యవహారే త్రయ ప్రకారః—వాచకత్వం, గుణవృత్తిర్వ్యంజకత్వంచ— అదే పుట). అభినవుడు గుర్తించినా తాత్పర్యం—వాక్యార్థకే పరిమితం.

2.35.భోజునికాలానికి 'తాత్పర్య' శబ్దార్థం వాక్యదశనుంచీ కావ్యదశకు పెరిగింది.

'తాత్పర్యమేవ వచసి ధ్వనిరేవకావ్యే' (శృంగార ప్రకాశం. పుట.161.)

తాత్పర్యానికి వాచ్య, ప్రతీయమాన, ధ్వని రూపదశలు మూడున్నాయని భోజుడభిప్రాయపడ్డాడు

2.36 దశరూపక వ్యాఖ్యాతకూడా ధ్వని తాత్పర్యంలో భాగమని వాదించాడు. వాచ్యవాచక సంబంధాన్ని కార్య — రసాలమధ్య నిరూపించడం ధనికుడి దృష్టి. ఇక్కడ ఒకతిర్కం వుంది. వాచ్య వ్యంగ్యాలమధ్య ప్రధానత, అప్రధానతలు ఉన్నాయి. వ్యంగ్యం ప్రధానమైతే అదే ముఖ్యార్థం (ప్రయిమరీమీనింగ్).అపుడు అది వాచ్యార్థ ప్రతిపత్తి కలిగిందేనని ధనికుడు వాదించాడు.

2.37. వ్యంగ్యార్థం అనుభూత మవుతున్నపుడే (సయిమల్టేనియస్‌గా) వాచ్యార్థంకూడా నిలిచివుండటం ఎలాగో—అభిధాతాత్పర్యాలు నిరూపించలేవు. అందుకే ఇది ఘటతదుపదాన న్యాయంకాదు— ఘట ప్రదీపన్యాయమన్నాడు ఆనందవర్ధనుడు (ధ్వన్యాలోకం పుట419) కాబట్టి శబ్దముఖవాదం నాల్గు అంశాలకు సమాధానం చెప్పలేక పోయింది.

(1)అర్థంలేనిచోట్లలో ప్రవర్తించే శబ్దం ఎలాంటిది?

(2)శబ్దం — పరిణామం పొంది (స్వార్థంలో) మరో అర్థాన్ని ఎలా సంక్రమింప చేస్తోంది ?

(3)కొత్త అర్థంతోపాటు శబ్దం తన స్వార్థాన్నీ ఎలా నిలుపుకో గలుగుతోంది ?

(4)పదదశకు, వాక్యదశకూ — అర్థనిరూపణకు భిన్న ప్రమాణాలు ఎందుకు ?

## 3.0. అర్థముఖ పరిశీలన

(కంటెంట్ ఓరియంటెడ్)

లక్షణ/భాక్తవాదం అర్థముఖ పరిశీలనకు తార్కాణం. ఇక్కడ అర్థపరిగ్రహణ (సెమాంటిక్ పర్సెప్షన్) ఎలా జరుగుతుందన్న అంశం ప్రధానం. మీమాంసకుల్లోనే భాట్టులు — ప్రాభాకరుల కంటె భిన్నంగా — 'అభిధ' — లక్షణ ద్వారాకూడా కొన్ని సందర్భాల్లో ముఖ్యార్థాన్ని చెప్పడం ఉందన్నారు. నిరూఢ లక్షణ (ఫేడెడ్ మెటాఫర్) ప్రసిద్ధ నిదర్శనం. పదదశలో కూడా లక్ష్యార్థమున్న చోట్లు ఉన్నాయని ఈవాదం (చూ.ఐ.టి.ఎస్.పి. 187, బ్రహ్మానంద 'సమాస నిర్మాణం —లక్షణం' 1978)

3.1. అభిధావృత్తి మాతృక (పుట17)— లక్ష్యార్థం ఏర్పడ్డానికి అభిధేయ సంబంధ,సాదృశ్య, సమవాయ, వైపరీత్యక్రియా యోగాదికారణాలు చెప్పింది. ఈ లక్షణాన్నే లోచనం ఇలా స్మార్తీకరించింది :

> 'పదార్థేన ప్రసిద్ధతయా ఉత్ప్రేక్ష్యతే ఇతి భక్తిర్ధర్మః తతోఽగతో లాక్షణికోఽర్థః' (లోచనం పుట.2)

ఇక్కడ పదార్థమంటే — అభిధేయమని అర్థం. అందుకే లక్షణ అభిధాపుచ్ఛ (ఎక్స్టెన్షన్ ఆఫ్ ప్రయిమరీ మీనింగ్) భూతమని లోచనం నిరసించింది. రెండు పదార్థాల మధ్యనున్న సంబంధాన్ని ఉత్ప్రేక్షించడం (పర్సెప్షన్) ఇక్కడ గమనించదగింది.

3.12 అర్థ ప్రకరణాపేక్షలో పుట్టే అప్రధాన/ప్రధాన వ్యవహారం 'గౌణ' మనేపేరట వ్యవహరింపబడింది

అర్థప్రకరణాపేక్షో యోవా శబ్దాంతరైః సహ
ఉక్తః ప్రత్యాయయత్యర్థం తంగౌణమపరేవిదుః

(వాక్యపదీయం 2–264)

సిద్ధ/అసిద్ధ అర్థ విశేషంగా భావింపబడ్డ ఈ భేదపరిగణననే తరువాతి ఆనందవర్ధనాదులు వ్యంజన ప్రతిపాదనలో ఒక అంశంగా గ్రహించారు

3.13 'ఉపచార' మనేమాట నైయాయిక మార్గానికి సంబంధించింది. ఇక్కడ 'శబ్ద' ప్రాధాన్య మసలులేదు. అర్థం కేవలం ఇది మేధోమార్గం అందుకే గౌతమాక్షపాదులు ఉపచారాన్ని ఇలా నిర్వచించారు

'తత్సంబంధాత్ ఫలనిష్పత్తే స్తేషు ఫలవదుపచారః'

(న్యాయసూత్రాలు 4–1 54)

విశేషార్థ హేతువులుగా గౌతముడు సహచరణ–స్థాన–తాదర్థ్య–వృత్త–మాన–ధారణాదుల్ని (2–2–64) ఊహించాడు.

ఈ మార్గాన్ని అవలంబించిన ఆలంకారికుల్లో కుంతకుడు, మహిముడు గుర్తించదగిన వాళ్ళు.

3.2. ఆనందవర్ధనుడు 'భాక్తమాహుస్తమన్యే' (ధ్వన్యాలోకం 1–2)అని ఖండించినవాదం–మీమాంసకులది కావాలి. లోచనం లక్షణకు చూపిన నిర్వచనం ఇది :

'ముఖ్యార్థ బాధాది సహకార్యపేక్షార్థ ప్రతిభాసనశక్తిర్లక్షణా శక్తిః' (లోచనం పుట 62)

కావ్యప్రకాశంలో ఈ లక్షణం కనిపిస్తుంది :

'ముఖ్యార్థ బాధే తద్యోగే రూఢితోఽథ ప్రయోజనాత్
అన్యోఽర్థో లక్ష్యతేయత్ సా లక్షణారోపిత క్రియా'

(కావ్యప్రకాశం 2–9)

ముఖ్యార్థానికి నిర్వచనం ఇది :

'శుద్ధస్యోచ్చారణే స్వార్థః ప్రసిద్ధో యస్య గమ్యతే
స ముఖ్య ఇతివిజ్ఞేయో రూపమాత్ర నిబంధనః

(వాక్యపదీయం 2–263)

కాబట్టి 'లక్షణ'లో ప్రధానాంశం అర్థాంతర ప్రతిభాసనం (చూ. అ. సూ 7)

3.3. తనకు ముందటి ఆలంకారికుల్లో గుణవృత్తిని గుర్తించిన భట్టోద్భటవామనాదులు ధ్వనిమార్గాన్ని కొద్దిగా స్పర్శించారు. (ధ్వన్యాలోకం పుట 31)–అంటూ ఆనందవర్ధనుడు వ్యంజనలో లక్షణను అనిర్వచించటానికి ప్రయత్నించాడు. భామహుని గుణ సామ్య ప్రతీతి (కావ్యాలంకారం 2–80), దండి 'సమాధి'గుణం (కావ్యాదర్శం 1–93) వామనుని సాదృశ్యలక్షణ (కావ్యాలంకార సూత్రవృత్తి 4–3–8)–లక్షణకు సమర్థించే అంశాలు. కన్పిటా సమానంగావున్న లక్షణం వాచ్యార్థ సామర్థ్యంమీద ఆధారపడి వుండటం

3.31 లక్షణముఖ వాదంమీద ఒక ప్రశ్నే మిగిలింది. వాచ్యార్థం లేనిచోట్లు గీత శబ్దాదులు–సంగీతం, చేష్ట–ఇవి అవాచకాలు. కాని ఇక్కడ విశేషార్థ స్ఫురణవుంది. స్వప్న సన్నివేశానికి వాచ్యార్థం అసలులేదు. ఇలాంటిచోట్ల 'లక్షణ' మనకిచ్చే–వివరణ ఏమిటి ? అందువల్ల శబ్ద/అర్థ దశల్ని సమన్వయించేమార్గం మరొక్కటి కావాలి

## 3. 4. అనుమితి (అర్థాపత్తి) తర్కం

(ది లాజిక్ ఆఫ్ ఇన్ఫరెన్స్)

ఆలంకారికుల 'వాగ్' దర్శనానికి సమకాలికంగా పుట్టిన శాస్త్రీయ విమర్శ 'అనుమితి'దృష్టి 1. 1.లో చూపబడ్డ చిత్రాన్ని తిరగవేసి అర్థం చేసుకొంటే అనుమితి వాదం అర్థమవుతుంది. మహిమభట్టు ఒకవైపు నైయాయికమార్గంతో, మరోవైపు భర్తృహరి 'పశ్యంతీ' దృష్టితో, మరోవైపు 'పరా' స్వరూప వివేకంతో చాలా 'కాంప్లెక్స్' విమర్శను పుట్టించాడు. తర్కం మేధావంతుల పని వ్యవహార మార్గోత్తీర్ణుల్లు జరిపే చర్చల్లో (ఆధునిక పరిశోధనల్లోలాగా) తర్కానికున్నంత ప్రాధాన్యం అనుభవానికి ఉండదు. మహిమభట్టు ఈ కోవలోని మేధావి.

3. 41. శబ్దార్థాలపైన మహిముడి అభిప్రాయం చాలా విలక్షణమైంది. శబ్దం కేవలం సాధనం (ఇన్‌స్ట్రుమెంట్).

'శబ్దప్రయోగః ప్రాయేణ పదార్థ ముపయుజ్యతే
నహితేన వినాశక్యో వ్యవహారయితుం పరః'

(వ్యక్తివివేకం 1–37)

శబ్దానికి స్వతంత్ర స్థితిలేదు. అందుకే నామశబ్దాలన్నింటికీ క్రియాజన్యత్వాన్ని అంగీకరించాడు (1–10). అందువల్ల అర్థాన్ని తెలిపేది శబ్దంకాదు-దాన్ని సాధనంగా క్రియామూలశక్తి ('సత్త' అని వ్యక్తి వివేకపరిభాష 1–14) అర్థాన్ని ఆపాదిస్తోంది. ఇదే 'అర్థాపత్తి'.

'తస్మాన్నామ పదేభ్యోయః కశ్చిదర్థః ప్రతీయతే
నస సత్తామనాసాద్య శబ్దోవాచ్యత్వ మర్హతి' (1–18)

కాబట్టి శబ్దం-పద, వాక్య భేదాల్ని మాత్రమే కలిగింది. (వర్ణం–అసలులేదు). ఈ రెండూ మూలమైన క్రియాశక్తినుంచే అర్థాన్ని గ్రహిస్తున్నాయి.

3. 42 అర్థం వాచ్యమని, అనుమేయమని రెండు రకాల శ్రుతిమాత్ర వ్యవస్థితార్థం-వాచ్యం. అనుమేయం–

'తథైవ అనుమితాద్వాలింగ భూతాద్ యదర్థాంతర
మనుమీయతే సోఽనుమేయః'
(వ్యక్తివివేకం పుటలు 39–40)

కాబట్టి ఈపరిశీలనలో 'శబ్దశక్తి'అన్నమాటకు చోటులేదు– ఆ చోట క్రియామూలశక్తి ప్రవేశించింది

అర్థాంతర ప్రతిభాసనంగా ఏది భావింపబడుతోందో అదంతా అనుమేయం–పరార్థానుమేయం (ఇన్‌ఫరెన్స్ ఆఫ్ ది కన్సెప్చువల్ మీనింగ్)

'యుక్తం త్రిరూపలింగాఖ్యయా పరార్థానుమితి కేవలంసంజ్ఞాభేదః' (1–24 వృత్తి)

3 43. లింగ–లింగి, సాధన–సాధ్యభావాలు కావ్య వ్యవహారంలో కుదరదనడానికి లోచనం ఘటప్రదీప న్యాయాన్ని చూపింది.

'ప్రదీప లోకాదే లింగలింగి భావ శూన్యేఽపి హి
వ్యంగ్య వ్యంజక భావోఽస్తి' (లోచనం పుట 449)

ఘట ప్రదీప స్వరూపాన్నిగురించి భిన్న వ్యాఖ్యానాలున్నాయి. చిల్లులున్న కుండలో ఉంచబడ్డ దీపం–అని ప్రామాణికమైన నిరూపణం వుంది (మా. అ. సూ. 8).

# 4. 0. శబ్దార్థ ముఖపరిశీలన

(ఫార్మ్ ఎండ్ కంటెంట్ ఓరియంటెడ్)

వ్యంజన (ధ్వని), వక్రోక్తి మార్గాలు శబ్దాన్నీ [–], అర్థాన్నీ [+], రెంటినీ ప్రమాణంగా గ్రహించాయి. మహిముని వాదమంతా ఆలోచనకు సంబంధించింది. కాని శబ్దం 'స్ఫురణా' రూపమైంది. అది పరావాగ్వశలోని భావం–ఉన్మీలన (వికసించడం)పొంది వాక్కుగా అవతరించడానికి సంబంధించింది. శబ్దోచ్చారణ మానవుడిలోని ప్రతిభాగుణం. ఇక్కడ తర్కం పనిచెయ్యదు. ఉచ్చారణ తర్వాతనే విమర్శలన్నీ.

'సా ప్రతిభానాను మీయమానా, అపితు శబ్దాలేశేన
భాసమానేత్యర్థః' [లోచనం పుట 92]

4. 1. వేదోపనిషద్ వాఙ్మయం, రామాయణ భారతాలు చేసిన 'ఆత్మ' ముఖపరిశీలనమే 'వ్యంజన' పరిశీలనకు భూమిక. అందుకే కావ్యానికి 'ఆత్మ' ఏదన్న మీమాంసతో ధ్వన్యాలోకం మొదలు పెట్టింది. 'తత్' పదం వాడటం ద్వారా 'ఆత్మ' ను సూచించడం అద్వైత మార్గం (ప్రథమకారికలో 'తమర్థం' – అన్న ప్రయోగం)

కాశ్మీర శైవాగమ మార్గం లోకంలోని పరమేశ్వరాంశను గుర్తించడంలో శాంకరంకంటె వేరయిన అంశం ఒకటుంది. చిదానంద రూపుడైన మహేశ్వరుడు ఈ జగత్తుకు 'ఆత్మ' స్థానీయుడు. ఆలోకంలో 'రసం' కావ్యానికి ఆత్మగా ప్రతిపాదింపబడటంలో ఈ ఆగమ రహస్యం వుంది.

'శివసూత్రా' లలో ఆత్మ ద్వివిధంగా నిర్వచింపబడింది – చైతన్యమాత్మ – చిత్తమాత్మా నిష్ప్రన్యాస్తం – చైతన్యం. వ్యక్తి పరిమితం – చిత్తం ప్రతీయమానం – చైతన్యం. వాచ్యం–చిత్తం. అందుకే వాచ్య ప్రతీయమానాలు(ఆత్మలుగా) రెండూ ప్రధానంగా గుర్తింపబడ్డాయి. (చూ. జయదేవ్‌సింగ్ 1977. పుట 62)

'యోఽర్థః సహృదయ శ్లాఘ్యః కావ్యాత్మేతి వ్యవస్థితః
వాచ్యప్రతీయ మానాఖ్యౌ తస్య భేదావుభౌస్మృతౌ'
(ధ్వన్యాలోకం 1 2)

ఆత్మలు రెండుగా చెప్పడం అశాస్త్రీయం కదా! దీనికి వివరణ లోచనం ఇలా చెబుతోంది.

'తదాహ సహృదయ శ్లాఘ్య ఇతి ఏక ఏవార్థో
ద్విశాఖతయా వివేకి భిర్విభాగ బుద్ధ్యా విభజ్యతే'
(లోచనం పుట 42)

'శివదృష్టి' అన్న శైవాగమగ్రంథంలో

'శైవమతానుసారికి స్వాత్మజ్ఞానం శైవమతానుసారికి
వస్తువునల్ల కలుగుతుంది'
(చూ. భట్టాచార్య. ఎస్. 1964. పుట 53)

అని చెప్పబడింది. వ్యవహారంలో వస్తువు – శబ్దార్థ రూపంలో వుంటుంది. దాన్నే 'వాక్కు' గా వైదిక గ్రంథాలు విచారించాయి దేవిగాను, ధేనువుగాను నిరూపించి స్తుతించాయి. (ధ్వన్యాలోకం 1–6 కింద లోచన బాలప్రియ వ్యాఖ్యానాలు చూడవచ్చు). ధేనుర్వాగస్మానుపసుష్టు తైతు – వంటి వైదిక మంత్రాలు దీనికి సాక్ష్యం – ఋక్కు. 8–100–11)

బ్రహ్మాద్వయవాదులు కూడా శబ్ద ప్రాధాన్యం గుర్తించారు:

'న సోఽస్తి ప్రత్యయే లోకే యః శబ్దానుగమాదృతే
అనువిద్ధ మివ జ్ఞానం సర్వం శబ్దేన భాసతే'
(వాక్యపదీయం 1 124)

వాగ్ ధర్మం ఒకటుంది. అది ప్రచేతనం (ఇది వైదికమైన అభిప్రాయం) కాబట్టి వ్యక్తావ్యక్తాలకు లంకె వాక్కు. 1. 1. లో వేసిన బొమ్మలో ఈ అభిప్రాయమే నిక్షిప్తంపబడింది. అందుకే దేవివాదుల ప్రకారం వాక్కు వ్యక్తమైన వైఖరిగా (శబ్దం), 'వ్యక్తావ్యక్తమైన మధ్యమ, పశ్యంతులుగా (అర్థం– స్ఫోట). అవ్యక్తమైన పరగా (భావం) ఉంటోందని గుర్తించాల్సి వుంది (చూ. జాన్ వుడ్‌రాఫ్, 1958 పుటలు 218–26). దేవి ప్రకాశమని : స్వామి విమర్శమని వీరి రూపణం. ఒకటి ప్రవృత్తి (ఆవిర్భావం) మరొకటి నివృత్తి (తిరోభావం) (→గుర్తు సూచించే గమనం ఈ అర్థాన్నే తెలుపుతుంది). ఈ రెంటి ఆవృత్తినీ వాళ్ళు 'వ్యంజన' మని పిలిచారు.

4.12 ఈ విరుద్ధ విషయ సమన్వయాన్ని సాధించడానికే శబ్ద – అర్థ శబ్దాలను ఆనందవర్ధనుడు చాలా విస్తృత పరిధిలో

స్వీకరించాడు. అంతకు ముందున్న అన్ని శాస్త్రీయ వాదాలకూ అతీత మైన 'సహృదయ' తర్కాన్నీ, ప్రత్యభిజ్ఞా సూత్రాన్నీ ఆధారంగా, సర్వమానవగతమైన స్ఫురణా (ఇన్‌ట్యూషన్) వ్యాపారాన్ని ఆధారంగా వాగ్వ్యాపారంగా వ్యంజనాశక్తిని నిర్వచించాడు (చూ కుంజున్ని రాజా 1975.)

లోచనం ఇలా నిర్వచించింది ·

'తచ్ఛక్తి త్రయోఽర్థ జనితార్థావగమ మూలజాత తత్ప్రతి భాస పవిత్రిత ప్రతిపత్తృ ప్రతిభా సహాయార్థ ద్యోతకశక్తిః ధ్వని వ్యాపారం' (పుట 62-63)

4.2 ఈ 'ద్యోతన' స్వభావం ఎక్కడా చెప్పబడలేదనే సందేహం పండితులకు కలుగుతుంది ఇదే ప్రత్యభిజ్ఞా సిద్ధాంతంలోని మౌలికాంశం ·

'స్మరణానుభవారూఢా సామాన్యాధికరణ్యధీః
సంస్కారేంద్రియజన్యాచ ప్రత్యభిజ్ఞా ప్రకల్పితా'
– ప్రత్యభిజ్ఞా హృదయం. పుట 117

సంస్కారేంద్రియాల ద్వారా ఒకేసారి జరిగే వ్యక్తి విషయక బోధ (పర్సెప్షన్ – ది రికగ్నిషన్ అఫ్ ది రియల్ సెల్ఫ్ – అని జయదేవ్‌సింగ్ అనువాదం)

4.3. అభిధను అవగమనమని, లక్షణను ప్రతిభాసమని తాత్పర్యను బోధ అని, వ్యంజనను ద్యోతనమని – వింగడించటంలో ఆనందుని సూక్ష్మేక్షిక కనిపిస్తుంది. లింగ లింగి సమన్వయాన్ని, వాచ్యార్థబాధను, గ్రహిస్తూ వాచ్యార్థంలేని దశల్లోనూ – సమన్వ యించేలా అవివక్షితవాచ్య – వివక్షితాన్యపరవాచ్యంగా ధ్వనివి గుర్తించి విరుద్ధ మార్గాల మధ్య ఆనందుడు సమన్వయాన్ని చూపగలిగాడు. అసంలక్ష్యక్రమాన్ని గుర్తించడంతో 'శబ్ద' స్వాతంత్ర్యం స్థాపింప బడింది. (వివరాలకు చూ. బ్రహ్మానంద 1979 అ. 2) 'వ్యంజన' చేసిన ఈ సమన్వయాన్ని కావ్యప్రకాశం ఇలా గుర్తించింది.

సర్వేషాం ప్రాయశోఽర్థానాం వ్యంజకత్వమపీష్యతే
(కావ్యప్రకాశం 2–6)

## 4.4. శబ్దార్థ స్పర్ధ - కుంతకుడు

నైయాయికుల 'ఉపచార' నిర్వచనం కాశ్మీర వాదంలో కొంత అర్థ వివృతిని పొందింది. ప్రపంచగతి (మువ్‌మెంట్)లో పరమేశ్వర స్పంద (కించిచ్చలనమని స్పందకారిక అంటోంది) ఆభాస (రిఫ్లె క్షన్) ను పొంది కనిపిస్తుందన్నది స్పందవాదుల తర్కం. కుంతకుడు స్పందవాది. కాబట్టి శబ్దార్థగతిలో కనిపించే స్పర్ధ (కాంట్రాస్టివ్ మువ్‌మెంట్)ను సూత్రించడానికి 'వక్రోక్తి జీవితం' (జీవితం – అనుప్రాణకం – అని జయరథుని వ్యాఖ్య) ప్రయత్నిం చింది. (చూ. అలంకార సర్వస్వ వ్యాఖ్య. పుట 9)

'స్పంద' తత్త్వం అవ్యక్త వ్యక్త దశల్లో భిన్నంగా ఉంటూ ఒకదానిలో మరొకటి ఔపచారిక లక్షణాన్ని(అప్పారెంట్ సిమిలిట్యూడ్) ప్రదర్శిస్తూ ఉంటాయి.

ఆత్మస్వరూప ప్రతీయమాన నిజధర్మం సామాన్యస్పందం [ఇంటర్నల్ స్టేట్].అనాత్మరూప ప్రభవోర్మిలన[మానిఫెస్ట్ ఎండ్ ఇన్‌ఫెస్ట్ రిలేషన్] రూపజ్ఞానం విశేషస్పందం [సెకండరీ స్టేట్] అందువల్ల లోక/కావ్య కర్మ ఒక వైచిత్ర్య చిత్రకర్మ. రెండు సమాం తర రేఖల్ని కలపడానికి కర్ణం [డయాగొనల్] కావాలి ఆకర్ణస్థానం వక్రం [డీవియంట్]. కవి ఆస్థానంలో ఉంటాడని కుంతకుని నిరూ పణం. ఈ వైచిత్రి శబ్దార్థాలమధ్యనున్న ప్రభవోర్మిల ప్రక్రియద్వారా బయట పడుతోంది [1 1 లో→గుర్తు సూచించే గమనం ఇదే] దీన్ని వాచ్య [స్పోకెన్ ఆఫ్], వాచక [స్పీకింగ్] సంబంధమన్నాడు కుంతకుడు [చూ జె ఎఫ్ స్టాల్ వాక్యాలు 1969 ముందు ఉదా హృతమైనవి]– స్పష్టంగా ఇది అభిధామార్గంలోని వాచ్యవాచక సంబంధంకన్నా విలక్షణమైంది [చూ. అ. సూ. 9]

'ఇతి ఏవం విధం వస్తు ప్రసిద్ధం ప్రతీతమ్. యో వాచకః
స శబ్దః యో వాచ్యశ్చాభిధేయః సోఽర్థ ఇతి ననుచ
ద్యోతక వ్యంజకావపి శబ్దౌ సంభవతః తద సంగ్రహాన్నా
వ్యాప్తిః, యస్మాదర్థ ప్రతీతి కారిత్వ సామాన్యా దుపచారా
త్తావపి వాచకావేవ. ఏవం ద్యోత్య వ్యంగ్యయోరర్థయోః
ప్రత్యేయత్వ సామాన్యా దుపచారాద్వా చ్యత్వమేవ. తస్మాద్
వాచకత్వం వాచ్యత్వంచ శబ్దయోర్లోకే సుప్రసిద్ధం–
యద్యపి లక్షణం తథాప్యస్మిన్ అలౌకికే కావ్యమార్గే
కవికర్మవర్త్మని అయమేత యోర్వ్యక్ష్యమాణ లక్షణః
పరమార్థ కిమప్య పూర్వతత్త్వ మిత్యర్థః'
(వక్రోక్తి జీవితం, పుట 34)

అందువల్ల పరావాక్ పరిస్పందంగా శబ్దాన్ని దర్శిస్తే [అభిధ వాదుల్లోలేని లక్షణం] 'వ్యంజన'మన్న మరో దశను గుర్తించాల్సిన అవసరంలేదని కుంతకమతం [వక్రోక్తి జీవితం 1–40] ఈ పద్ధతి కూడా మార్గాంతరంగా అభిధా వ్యతిరేక మవటంవల్ల మహిమభట్టు వ్యంజన వక్రోక్తుల్ని రెంటినీ సమానంగా ఖండించాడు.
[వ్యక్తి వివేకం 1–73]

## 4. 5. శబ్దార్థ అభివ్యక్తి - అభినవులు

భరతమహర్షి రససూత్రాన్ని వ్యాఖ్యానించడానికి ఏ అభివ్యక్తి సూత్రాన్ని వాడుకొన్నాడో అదే సూత్రాన్ని కావ్యాత్మగా ఆనందుడు ప్రతిపాదించిన 'ధ్వని'లోని వ్యంజనా వ్యాపారాన్ని గుర్తించడానికీ అభి నవులు వాడుకొన్నాడు [వ్యంజ్, వ్యక్తి, వ్యక్త–వీటిలోని ధాతువు అంజ్–అంజూ వ్యక్తి శ్లక్ష్ణకాంతి గతిషు అని నిఘంటువు]

రససూత్రం ప్రసిద్ధం. దానికి అభినవ వివరణం ఇది. [సందర్భం–భట్టనాయక మతఖండనం. భట్టనాయకుడు 'వ్యంజన'ను అంగీకరిస్తూ 'ధ్వని'ని నిరసించాడు. భావ సంయోజనా వ్యంగ్య పర

సంవిత్తిగోచరః—ఇత్యాది భట్టనాయకుడి కారికను ఉదాహరిస్తూ అభినవులు ఇలా అంటాడు.]

'ఇతిఅత్ర వ్యఙ్గ్య మానతయా వ్యఙ్గ్యో రశ్యతే అనుభవేనచ తద్విషయ ఇతి మంతవ్యమ్'

[చూ. నోలి 1968 పుట 12]

"భట్టనాయక ఎప్పారెంట్‌లీ కంసిడర్స్ రసాస్ మాని ఫెస్టెడ్—సో దట్ ది థియెరీ ఆఫ్ మానిఫెస్టెడ్ ఈస్ రాదర్ మెయిన్ టెయిన్డ్ దాన్ డిస్కార్డెడ్" [ట్రాన్స్‌లేటర్ నోలి పే. 51]

4. 6. సప్తమాధ్యాయంలో 'భావ' విషయ ప్రస్తావన భర తుడు చేశాడు అభినవులు రెండు వ్యుత్పత్తులు 'భావ' శబ్దానికి చూపారు ఇవి ధాతు నిరూపణం కాదు ప్రక్రియాముఖ నిరూపణం.

1. భవంతి ఇతి భావాః [పుట్టేవి]
2. భావయంతి ఇతి భావాః [అనుభవింప చేసేవి]

[నాట్యశాస్త్రం అ 7. పుటలు 62–63]

ఆలోక లోచనాలు రెండూ భావాన్ని రెండుదశల్లో వ్యాఖ్యా నించాయి:

1 శబ్దార్థగతంగా 2 వక్తృశ్రోతృముఖంగా వాగ్వ్యవహా రంలో-వక్త/శ్రోత-అలోని భావం [ఐడియా] వ్యవహారంలో శబ్దం/ అర్థంద్వారా పుట్టే భావం [కాన్‌సెప్ట్]తో సమన్వయించడం జరుగు తోందని అర్థం.

నాకర్థమయింది-అనడం, మాటలు చాలవు-అనడం దీనికి ప్రబలమైన నిదర్శనాలు. ఇది ఎంత ప్రాచీన ఆలంకారిక దర్శనమో అంత నవ్యాతి నవ్యమైన వాగ్ వ్యవహారతత్త్వ సిద్ధాంతం. సరిగ్గా ఇలాంటి అభిప్రాయాన్నే ఆధునిక మనస్తత్త్వవేత్తా గుర్తించడం చూడవచ్చు:

"వాట్ ది ఆర్టిస్ట్ ఎయిమ్స్ ఎట్ ఈస్ టు ఎవేకెన్ ఇన్ అస్ ఈస్ ది సేమ్ మెంటల్ కాన్‌స్టెలేషన్ యాస్ దట్ విచ్ ఇన్ హిమ్ ప్రొడ్యూస్డ్ ది ఇంపెటస్ టు క్రియేట్"

[మోడ్స్ ఆఫ్ మయికేల్ ఏంజిలో – ఫ్రాయిడ్, సి. ఎఫ్ విగోట్‌స్కీ 1934 పు. 203]

4.7. ఈ అభిప్రాయ సర్వస్వాన్నీ నాట్యశాస్త్రం ఇలా సమీక్షించింది:

'వాఙ్మయానీహ శాస్త్రాణి వాఙ్నిష్ఠాని తథైవచ
తస్మాద్వాచః పరం నాస్తి వాగ్ఘి సర్వస్య కారణమ్'

(వాచికాభినయం 7–60)

ఈ రహస్యాన్ని పాతికేళ్ళ క్రితమే గుర్తించిన పాశ్చాత్య పండితులూ ఉన్నారు.

"యాస్ ది యేన్షంట్ ఇండియన్ మిథ్ సే, ది అట్టరెన్స్ ఆఫ్ ది కాస్టర్ హంగర్, ది లాంగ్వేజ్ ఆఫ్ ది గ్రేట్ పోయట్ ఎండ్ ది ఫార్ములె ఆఫ్ ది ఎటామిక్ ఫిసిసిస్ట్ ఆర్ ఆల్ ఇన్ సమ్ సెన్స్ మానిఫెస్టేషన్స్ ఆఫ్ ది సేమ్ డివయిన్ వాక్"

(జాన్ బ్రా 'సమ్ ఇండియన్ థియరీస్ ఆఫ్ మీనింగ్, 1953 పే 423.)

4 8. కార్‌ల్ బుహలర్ (1934), రోలాండ్ బార్త్స్ (1964) మొదలైన విమర్శక భాషా పరిశీలకులు చెప్పిన సిద్ధాం తాలు కూడా ఈ దర్శనానికి ప్రయోగతుల్యాలుగా ఉన్నాయి. (చూ. అ. సూ. 10)

# అ ధో జ్ఞా పి క లు

1 ఈ వ్యాసకర్త 1978, 79, 80 లలో ఆంధ్రపత్రిక ఉగాది సంచికల్లో రాసిన వ్యాసాలకు ఈ వ్యాసం పొడిగింపు. ఆలంకారికుల వాగ్దర్శనం వైదికమైన మార్గానికి సంబం ధించింది. 'వాగ్దేను'వన్న భావనా విశేషం – సరస్వతీ, దేవీ నామాంతరాల్లో భరత ఆనందాభినవుల్లో ఒక నిర్దిష్ట మార్గంలో కనిపిస్తుంది. దీనికి చూ. బ్రహ్మానంద 'వాగ్దేనువు' (రిఫరెన్స్‌లలో చూడాలి)

2 హెర్బర్ట్ రీడ్ ఒక వ్యాసంలో (1960 చూ. రిఫరెన్స్‌లు) ఈ విషయాన్ని గురించి విస్తృతంగా చర్చించాడు. విజ్ఞాన శాస్త్రాభివృద్ధి అంతా 'స్ఫురణ' జన్యమనడానికి 'కాంట్' వాదాన్ని ప్రస్తావించాడు (చూ. పుటలు 24–25)

3 కుంజున్ని రాజాగారు తమ గ్రంథంలో (1969. చూ. రిఫ రెన్‌సెస్) ఒక అనుబంధంగా (పుటలు 316–21) విస్తృతంగా భిన్న మార్గీయుల గ్రంథాల్ని, తేదీలను ఉదాహ రించారు. కె. సి. పాండేగారి 1959, 1963 గ్రంథా ల్లోనూ అలంకారమార్గ వివరాలున్నాయి.

4 పాశ్చాత్యదేశాల్లో 'ధ్వని' సిద్ధాంతచ్ఛాయ గలిగిన సూత్రం ఎందుకు పుట్టలేదనడానికి నోలి ఇచ్చిన వివరణం ఇది:

'ది మెయిన్ డిఫరెన్స్ బిట్వీన్ ఇండియా ఎండ్ ది వెస్ట్ ఈస్ బేస్డ్ ఆన్ ది ఫాక్ట్ దట్ విత్ అస్ (ది వెస్ట్ –బ.) దిస్ కన్‌సెప్షన్ (ఆఫ్ డిఫరెన్షియేటింగ్ బిట్వీన్ ది లిటరల్ ఎండ్ ది స్పిరిట్యువల్ మీనింగ్స్ ఇన్ లాంగ్వేజి యాస్ – బ.) విచ్ గోస్ బాక్ టు ది అలెక్సాం డ్రియన్ స్కూల్ ఎండ్ ఎస్పెషల్లీ టు ఆరిజిన్స్ – హాస్ రిమేయిన్డ్ రెస్ట్రిక్టెడ్ టు ది థియలాజికల్ స్పెక్యులేషన్. హాడ్ ఇట్ బీన్ డెవలప్డ్ ఇన్ ఎ లిటరరీ డయిరెక్షన్, వుయి వుడ్ హేవ్ హాడ్ ఎ సార్ట్ ఆఫ్ కవుంటర్ పార్ట్ టు ది కన్సెప్షన్ ఆఫ్ ఆనందవర్ధన'( పే XXXIV 1968)

5 ఒకవిందులు 'అన్ ది వేద' (1956) అనే గ్రంథంలో 'సయికలాజికల్ ఎప్రోచ్ టు వేద' మీద చేసిన విస్తృత చర్చలు ఈ విషయాన్ని స్థిరపరుస్తాయి.

6 ధ్వన్యాలోకంలో 4 ఉద్ద్యోతాలు వున్నాయి. లోచన వ్యాఖ్య చెప్తూ ప్రతి ఉద్ద్యోతానికి చివరా వరసగా పరా—పశ్యంతి—మధ్యమ వైఖరుల్ని స్తుతించాడు. ఆయా ఉద్ద్యోతంలో వున్న విషయ సారమంతా ఒకో వాక్కుకి అన్వయించాడు. కౌలమార్గంత్రికం (కాబట్టే బొమ్మ త్రిభుజాకారంలో వుంది).

7 అరిష్టోటిలుతో మొదలైన అలంకారిక దృష్టి అతని 'మెటఫర్' నిర్వచనంలో రూపుదిద్దుకొన్నది. రీడ్ (1968) ఈ నిర్వచనాన్ని మనకు అందించాడు: క్రింద 'పర్సెప్షన్' అంటే 'ప్రతిభాసనమే.'

'మెటఫర్ ఈస్ది సింథసిస్ అఫ్ సెవరల్ యూనిట్స్ అఫ్ అబ్సర్వేషన్ ఇంటు వన్ కమాండింగ్ ఇమేజ్ : ఇట్ ఈస్ ది ఎక్స్‌ప్రెషన్ అఫ్ ఎ కంప్లీట్ అయిడియా నాట్ బయి ఎనాలిసిస్, నాట్ బయి అబ్స్ట్రాక్ట్ స్టేట్‌మెంట్, బట్ బయి ఎ సడెన్ పర్సెప్షన్ (గీతలునావి – బ్ర)అఫ్ ఏన్ అబ్జెక్టివ్‌రిలేషన్..' రీడ్ (పొయెటిక్స్ XXII పే.16–17; 23, 1968)

8 చూ. ధ్వన్యాలోకము. పుటలు 420–21, వాక్యపదీయం 2–298, కె. కృష్ణమూర్తిగారు (1974) ప్రచురించిన మాత్సధ్వన్యాలోక ప్రతిలో ఈ ఘటప్రదీప చర్చ విస్తారంగా వుంది. కాని ఆయన కూడా 'ఘటమును వ్యక్తముచేయుచున్న' అనే అభిప్రాయాన్నే అంగీకరిస్తారు (పుటలు 376–77) నానాచ్ఛిద్ర ఘటోదరేత్యాది శ్రీ శంకర దక్షిణమూర్తిస్తవం ఈ రచయిత చూసిన వివరణకు నిరూపణం.

9 కుంతకుడి వాదాన్ని కేవలం అభిధాదశకు చెందిందిగా భావించి కృష్ణచైతన్య చేసిన వాదం కొంత ఆలోచించాల్సివుంది. 'ఇన్‌దట్ వుయి సీడ్‌నాట్ ఈవెన్ మూవ్ అన్ టు పర్—పోర్ట్ ఫ్రమ్ డీనొటేషన్' (శాన్‌స్క్రిట్ పొయెటిక్స్, పే. 124, 1965)కుంతకుడి కాశ్మీర శైవాగమ మార్గాన్ని ఆధారంగా గ్రహించేవుంటే ఈ అభిప్రాయం మరోలా వ్యక్తమై ఉండవచ్చు.

10 'స్టయిలిస్టిక్స్' అన్న ఒకశాఖ ఇటీవలి సంవత్సరాల్లో పాశ్చాత్య దేశాల్లో వృద్ధిపొందింది. అది 'లింగ్విస్టిక్స్'లో ఒక ఉపశాఖ మాత్రమేనని కొందరభిప్రాయ పడటంవుంది. ఈ సమస్యను తేల్చుకోవడానికి 1969లో 'విల్లా సెర్బెల్లోనీ'లో ఒక సదస్సు జరిగింది. శైలిని నిర్వచించడానికి: వివరించడానికి ఇప్పటిభాషా శాస్త్ర సిద్ధాంతంలోని అస మర్థతను, అసమగ్రతను ఆ సదస్సు నిరూపించింది. ఆమోదించింది. భాషలోని ఆలంకారికతను కూడా నిర్వచనగతంగా స్వీకరించాలని ఆ సదస్సులో పండితులభిప్రాయపడ్డారు. (చూ. వివరాలకు సేమూర్ చాట్‌మాన్ 1971)

# రిఫరెన్సులు


(ఎ) బ్రహ్మానంద, హెచ్. ఎస్ 'సమాస నిర్మాణంలో లక్షణ స్రవంతి, మార్చి (1978)

" 'వ్యంజన సూత్రం' పిహెచ్ డి. గ్రంథం. (1979)

" 'భారతదేశంలో భాషా శాస్త్రం' ఆ ప. ఉ సం (1978)

" 'వాగర్థాద్వైతం' ఆ ప. ఉ.సం. (1979)

" 'వాక్కు - భాష' ఆ. ప. ఉ సం. (1980)

(బి) సంస్కృత గ్రంథాలు

అభినవగుప్తుడు : 'అభినవ భారతి' (చూ నాట్యశాస్త్రం / భరతుడు)

" 'లోచన వ్యాఖ్యానం' (ధ్వన్యాలోకాంతర్గతం. చూ. ఆనందవర్ధనుడు) (ఉద్ధృతుడు లోచనం నుంచి ఉదా.)

ఆనందవర్ధనుడు : 'ధ్వన్యాలోకమ్', పండిత పట్టాభిరామశాస్త్రి పరిష్కృతి. చౌఖాంబా ప్రచురణ. వారణాశి (1940)

కృష్ణమూర్తి. కె (సం) అంగ్లం, ధార్వాడా యూనివర్సిటీ ప్రచురణ (1974)

కుంతకుడు : 'వక్రోక్తి జీవితమ్', రాధేశ్యామ్‌మిశ్రగారి హిందీ అనువాదం, ఉపోద్ఘాతం, చౌఖాంబా ప్రచురణ (1967) (స్పందకారిక ఇందులోంచి ఉదా.)

గౌతముడు : 'న్యాయ సూత్రాలు', సతీష్‌చంద్ర విద్యా భూషణుల అంగ్లానువాదం. మున్షీరామ్ మనోహరలాల్ ప్రచురణ, న్యూఢిల్లీ (1975

దండి : 'కావ్యాదర్శమ్', భండార్కార్ ఓరియంటల్ ఇన్స్టిట్యూట్ ప్రచురణ, పూనా (1938)

ధనికుడు : 'దశరూపక వ్యాఖ్యానం' (చూ. భోజుడు)

భట్టనాయకుడు : 'హృదయ దర్పణం' (చూ. అభినవ భారతి)

భరతుడు : 'నాట్యశాస్త్రమ్' మన్‌మోహన్‌ఘోష్ (సం) మనీషా గ్రంథాలయ ప్రచురణ (1967)

భర్తృహరి 'వాక్యపదీయమ్', అభ్యంకర్, కె. పి, లిమాయె వి. పి. (సం), పూనా సంస్కృత ప్రాకృత ప్రచురణలు న్యూఢిల్లీ (1965)

భామహుడు 'కావ్యాలంకారమ్', నాగనాథశాస్త్రి ఆంగ్లానువాదం, మోతీలాల్ బనార్సిదాస్, న్యూఢిల్లీ (1970)

భోజుడు 'శృంగార ప్రకాశ', వి రాఘవన్ (సం ఆంగ్లం) పునర్వసు ప్రచురణ, మద్రాసు (1963)

మమ్మటుడు 'కావ్యప్రకాశమ్', ఆర్. సి. ద్వివేది (అంగ్లానువాదం) మోతీలాల్ బనార్సిదాస్ ప్ర. (1966)

మహిమభట్టు · 'వ్యక్తివివేకమ్', (కారికలు 'మహిమభట్ట' అన్న హిందీ గ్రంథం నుండి ఉదా.) వ్రజ్ మోహన్ చతుర్వేది ఢిల్లీ (1967)

రుయ్యకుడు : 'అలంకార సర్వస్వమ్, (జయరథ వ్యాఖ్యతో) గిరిజాప్రసాద్ ద్వివేది (సం) నిర్ణయసాగర్ ప్రచురణ (1939)

వామనుడు : 'కావ్యాలంకార సూత్రవృత్తి', పూనా ఓరియంటల్ సిరీస్ (1928)

విశ్వనాథుడు . 'సాహిత్య దర్పణమ్', వేదంవారి ఆంగ్లానువాదం, మద్రాసు (1954)

(సి) ఆంగ్లగ్రంథాలు, వ్యాసాలు

Ananda Coomara Swamy — The Dance of Shiva, Sagar Publications (1918 repr 1956)

Aurobindo — 'On the Veda', Aurobindo Ashram Pub (1956)

Barthes, Roland — 'Elements of Semiology', Cape Editions, London (1964/67)

Bhattacharya ^ P — 'Corner Stones of Rasa ideology and 'Saiva Darsana of Kashmir' (1964)

Brough, John — 'Theories of General Linguistics in the Sanskrit Grammarians. T P S (1951) (See Staal 1972)

" — 'Some Indian Theories of Meaning', I. P. S (1953. see Staal 1972)

Buhler, Karl — 'Sprach theories (Jena 1934) (See Chatman 1971)

Chatman, Seymour (ed), 'Literary Style', O U P (1971)

Gnoli, Raniero 'Aesthetic Experience According to Abhinava Gupta', Chowkhamba pub (1968)
'Abhinava Gupta', Chowkhamba Skt Series (1963)

Hawkes, Terence 'Structuralism and Semiotics', Methean & Co. London (1977)

Hjemslev, Louis 'Prolegomena to a theory of language', F J. White field (tr Eng) Univ of Wisconsin press (1961)

Jakobson, Roman 'Why mama and papa ?—Some studies on Child language and aphasia', Monton (1971)

Jesperson, Otto 'Mamma and Papa—some fundamental problems'—Language, its nature and development and Origin(1922 , repr. London(1964)

Jung C. J 'Psychological Types', Routledge and Kepan Paul (1953)

Malinovsky, B. 'Coral Gardens and their magic'' George Allen & Unwin Ltd London (1935) from Chatman (1971)

Pandey K. C 'Comparative Aesthetics', Chowkhamba Skt Series (1959)

Piaget, Jean 'The language and thought of the child', Meridian Books, New-York (1966)

Raja, Kunjunni 'Indian Theories of Meaning' Adyar Library series (1963, 69, 77) 'Vyanjana-Suggestive function of Language', Annals of the O. R. I. Madras (1975)

Renou, Louis 'Les connexions entre le rituel et la grammaire en Sanskrit', (1941-42) (see Staal, 1972)
'Grammaire et Poetique en sanskrit' (1961) (see Staal 1972)

Singh, Jayadev 'Pratyabhijna Hrdayam', Motilal Banarsidas Pub (1977)

Staal, J. F. 'Sanskrit philosophy of Language' in C. T L. 5 (1969)
'A Reader on the Sanskrit Grammarians', M I T Press (1972)

Vigotsky L. S. 'Thought and speech' (1934) in Sal Saporta (ed) (1966)

Woodroffe John, 'The Garland of Letters', Shri Ganesh Pub. Co (1958)

# నిద్రపోయే వేళ

శ్రీ కొడవంటి లీలామోహనరావు

నిద్రపోయేవేళ
ఏమిచేస్తున్నావని అడక్కు —
సుప్తసాగర గర్భంలో
కలల తిమింగిలాల వేట.

సప్తాశ్వాల స్వారీలో
పట్టుతప్పి నేల కొరిగే తరుణంలో
నేను పెట్టే చావుకేక
నూరడుగుల దూరాన వింటావు.

సుళ్ళుతిరిగే కళ్ళల్లో
ఎగజిమ్మిన రక్తం
చూడదలిస్తే అడుగు
పొద్దుతిరుగుడు పువ్వు చూపిస్తుంది.

శ్రీ పి. యస్. శాస్త్రి

# ఉటోపియా 2081!

మళ్ళీ ఉద్యోగం పోయింది! విశ్వనాథానికి విరాగ్గావుంది! ఎన్ని సార్లిలా? ఈ "లీవ్ వేకెన్సీ టెంపరరీ" వుద్యోగాలనుంచి తనకు విముక్తిలేదా? ఈ జన్మకు తను పెర్మనెంటు వుద్యోగంలో స్థిరపడ లేడా? విసుగు—కోపం—నిస్పృత్తువ—నిస్పృహాయత — విశ్వనాథాన్ని ముంచెత్తుతున్నాయి.

మళ్ళీ ఎన్నాళ్ళు పడుతుందో మరో టెంపరరీ వుద్యోగం దొరక డానికి! సగటుమనిషి భారతదేశంలో యాభైయేళ్ళు జీవిస్తాడంటారు! అందులో సగంపైన చదువుకోవడంలో, ఉద్యోగాల వేటలో గడిచిపోతే యింక జీవితంలో సారం యేం వుంది? ఇటువంటి గొడవలు, గోలలు లేనికాలంలో పుట్టివుంటే ఎంత హాయిగా వుండేదో! అసలీ గోలలు లేని లోకం లేదా ఎక్కడా?

ఎండలో నీరసంగా కాళ్ళీడ్చుకుంటూ నడుస్తున్న విశ్వనాథానికి తల తిరుగుతున్నట్టనిపించింది.. కళ్ళు చీకట్లు కమ్మాయి. చాప చుట్టలా క్రిందపడ్డాడు.

ఎంతోసేపటికి కళ్ళు తెరచిన విశ్వనాథానికి తన మనస్సంతా ఆనందంతో నిండి, శరీరం తేలికై, ఎక్కడికో తేలిపోతున్నట్టు అని పించింది వంటికి పరుపు మెత్తగా తగులుతోంది!

గదిచుట్టూ ఎటు చూసినా పాలరాతితో చేసినట్టున్న తెల్లటి గోడలు మెరిసిపోతున్నాయి. గది గుమ్మాలకు మల్లెపూలంత తెల్లటి తెరలు! అవి పాతకాలపు కథల్లో వర్ణించే చీని చీనాంబరాలో, ఢక్కా మస్లిన్‌లో తెలియడంలేదు!

ఎక్కడనుండో మంద్రస్థాయిలో మనోహరమైన సంగీతం వినిపిస్తోంది. ఆ సంగీతం ఎంతో ఆనందం కలిగిస్తూ ఎన్నిరోజులైనా, నిద్రాహారాలు మాని అలా వినాలనిపిస్తోంది!

తన ఆనందాన్ని ఎవరితోనైనా పంచుకుంటే బావుండుననిపిం చింది విశ్వనాథానికి. అసలు తను ఆ గదిలోకి ఎలా వచ్చాడో తను బ్రతికి వున్నాడో, చచ్చిపోయి మరో లోకం చేరాడో కూడా తెలుసు కోవాలనిపించింది.

అతనికి ఎవరినేనా కలుసుకుని మాట్లాడితే బావుండుననిపిం చిన మరుక్షణమే, ఎవరో ఆ గదివైపు నడిచివస్తున్న శబ్దం విని పించింది!

ఆ వచ్చినవాళ్ళు అత్యంత సుందరంగావున్న యువతులు! వాళ్ళు విశ్వనాథం చూసిన సినిమాల్లోని దేవకన్యల్లా వున్నారు! వడ్డాది పాపయ్యగారి బొమ్మల్లా వున్నారు!

"నేనెక్కడ వున్నాను? మీరెవరు?" ఎంత వద్దనుకున్నా, సినిమాల్లోని డైలాగుల్లానే అడిగాడు వారిని విశ్వనాథం.

"నువ్వు కోరుకున్న లోకంలో వున్నావు! మేము నీవు కోరు కున్న సుఖాలను అందించడానికి వచ్చినవాళ్ళం!" ముసిముసిగా నవ్వుతూ వాళ్ళు తమ చేతుల్లోని బంగారు పళ్ళేరాలను అక్కడి దంతపు బల్లలమీద పెట్టారు. వాటినిండా సన్నజాజుల దండలు, కస్తూరి జవ్వాజిలాంటి సుగంధద్రవ్యాలు, చందనం, వగైరా లున్నాయి!

". వీళ్ళెవరు? తెలుగులోని గొప్ప నాటక కర్తల డైలాగు ల్లోలా యింత గుంభనగా, గంభీరంగా మాట్లాడుతున్నారేమిటి? అడిగినదానికి తిన్నగా జవాబివ్వకూడదూ?" తనలో తనే విసుక్కు న్నాడు విశ్వనాథం.

"అడగ్గానే తిన్నగా జవాబిస్తే సంభాషణలో సొగసుపోతుంది వినేవాళ్ళకి సస్పెన్సు పోతుంది! అందుకే తిన్నగా జవాబివ్వకూడదు! అలా జవాబివ్వనందుకు నువ్వు మనస్సులో కూడా విసుక్కోకూడదు!" నవ్వుతూ అందో అందాల సుందరి!

విశ్వనాథం ఖంగుతిన్నాడు! తన మనసులో ఆలోచనలు, పెదవి దాటి మాటలుగా వెలువడకుండానే వీళ్ళు చదివేసి జవాబులు చెప్పే స్తున్నారు! చాలా అసాధ్యుల్లా వున్నారు! వీళ్ళు ఇలా మనసులో మాటలు చదివేస్తూంటే తనకు చాలా కష్టం! మనసులో పుట్టే 'సెక్స్' గురించిన వెధవాలోచనలను పసిగట్టేరంటే వాళ్ళు హూనం చేసెయ్యగలరు?

"నిజమే! అసాధ్యులమే! నువ్వు జాగ్రత్తగా వుండటమే మంచిది!" మరో అమ్మాయి అంది నవ్వుతూ!

"బ్రతికించారు! ఆ తరువాత విషయం గురించి ప్రస్తావించ లేదు!" అనుకున్నాడు విశ్వనాథం.

"నువ్వు సిగ్గుపడుతున్నావనే ప్రస్తావించలేదు!" మరో అమ్మాయి అంది అతనికేసి చిలిపిగా చూస్తూ!

పాతికేళ్ళ విశ్వనాథం పదేళ్ళ కుర్రవాడిలా ముడుచుకుపోయాడా మాటలకి!

"పాతికేళ్ళ యవ్వనంలోఉన్న కుర్రాడివి! అలా ఆడపిల్లలా సిగ్గుపడిపోతున్నావేమిటి? కమాన్ యంగ్ మాన్! మాటలు రావా నీకు? అందమైన అమ్మాయిలు చుట్టూ పరివేష్టించిఉంటే మీ జానపద సినిమాల్లో మహారాజుల్లా పరిచర్యలు చేయించుకోవాలను కున్నావుగా? ఎన్నోసార్లు కలలు కన్నావుగా? ఇంతాచేసి అలాంటి

పరిస్థితుల్లో మూగగా మారిపోయానేమిటి? ఏం మగాడివయ్యా నువ్వు?"

ఓ అందాల చిన్నది ఒక మాటనిలా నవ్వించింది అతన్ని!

ఇప్పటికి కొంచెం తేరుకున్నాడు విశ్వనాథం!

"అన్నీ నిజమే కాని అమ్మాయిలూ! మీ మనసుల్లోని ఆలోచనలు నాకు తెలియకుండా నా మనస్సులోని మాటలు మాత్రమే మీకు తెలియచెయ్యటం న్యాయమేనా?" చిరునవ్వుతో అన్నాడు

"అమ్మయ్య! నువ్వు మ్రాన్పడిపోయేసరికి నీ మాట పడిపోయిందేమో, డాక్టర్ని పిలవాలేమో అనుకున్నాను! పరవాలేదు!" ఓ చిన్నది చిలిపిగా పలికింది.

"పెద్ద! మీరంత గొప్పగా యేం లేరు! మా జయప్రద, జయసుధ, శ్రీదేవిలు మీకంటె అందంగానే వుంటారు మా సినిమాల్లో! మీరు వాళ్ళముందు తీసికట్టే!" రోషంగా అన్నాడు విశ్వనాథం!

"జననీ జన్మభూమిశ్చ..." అని మొత్తానికి నువ్వు పుట్టిన తెలుగుదేశం, తెలుగుజాతి, తెలుగు సినిమాలమీద నీకున్న అభిమానానికి సంతోషించాం! మా ఆతిథ్యం స్వీకరించు! ఆ తర్వాత నీ ప్రశ్నలకు జవాబులు మెల్లిమెల్లిగా తెలుసుకుందువుగాని!

ఆ అమ్మాయిలు అతనిమీద పన్నీరు జల్లుతూ, చిరునవ్వుల పువ్వుల్తో కొడుతూ, సన్నజాజుల, మల్లెపూల దండలతో అతన్ని అలంకరించి, అతను ఎప్పుడూ తిని వుండని రకరకాల పక్వాన్నాలతో, అద్భుతమైన రుచులలో ఉండేవన్ని పదార్థాలను పళ్ళెంలో పెట్టి, కొసరి కొసరి తినిపించారు!

ప్రక్కన కూర్చుని హాస్యాలాడుతూ, చతురోక్తులతో అతన్ని తన్మయుణ్ణి చేసారు.

అలా ఎంతసేపు గడిచిందో అతనికే తెలియదు. కళ్ళు మూతలు పడుతూంటే ఓ అందాల సుందరిని చెయ్యి పట్టుకుని మీదకు లాక్కున్నాడు ఆమె కాదనకుండా అతని కౌగిలిలో కరిగిపోయింది!

ఇలా ఎన్నాళ్ళు గడిచాయో కూడా మొదట విశ్వనాథం గుర్తుపెట్టుకోడానికి ప్రయత్నించలేదు కాని కొన్నాళ్ళుపోయాక యీ జీవితం విసుగెత్తించినట్టనిపించేసరికి మళ్ళీ పాత ప్రశ్నను వాళ్ళమీద ప్రయోగించాడు.

"అబ్బ! అరిగిపోయిన గ్రామఫోను రికార్డులా అస్తమానం ఆ ప్రశ్న యెందుకు? ఇది యేదో ఓ లోకం! మేం ఎవళ్ళమో, యీ లోకంలోకి నీవెలా వచ్చావో, యీ ప్రశ్నలన్నీ యెందుకు నీకు? అన్ని ప్రశ్నలు, ఆలోచనలు మాని, సుఖంగా వుండలేవు? ఏం మనుషులో ఏమిటో! సుఖం లేనన్నాళ్ళు సుఖం కావాలో అని గోలకెత్తుతారు! తీరా ఆ సుఖం అనుభవంలో కొచ్చేసరికి సమస్త ప్రశ్నలూ వేస్తారు! అన్ని అనుమానాల్తో బాధపడలేరు! మళ్ళీ ఉదయం సాయంత్రం 'నిష్కామకర్మ' అంటూ భగవద్గీతలో శ్లోకాలు వల్లిస్తారు. అటువంటి వో నిష్కామకర్మగానే 'సుఖపడటం' చెయ్యలేరు!"

విసుక్కుంది అతని అందాల ప్రేయసి !

ఆ దెబ్బకు హడలిపోయాడు విశ్వనాథం ! మళ్ళీ కొన్నాళ్ళు ప్రశ్నలు వేయలేదు !

కాని యీ జీవితం అతనికి విసుగెత్తసాగింది. మళ్ళీ నోరోజు "మీరెవరు? నే నెందుకిక్కడ కొచ్చాను ? ఎలా వచ్చాను ?" అన్న ప్రశ్నల్ని మళ్ళీ వేశాడు !

"పోనీ చెబుదామే ! చెప్పకపోతే బెంగతో చచ్చిపోయేలా వున్నాడు!" ఆ సుందరీమణుల్లో వో అమ్మాయి అంది

"సరే నీ ఇష్టం !" అయిష్టంగానే ఒప్పుకున్నారు మిగిలిన వాళ్ళు

"నువ్వెప్పుడేనా 'టైమ్ మెషిన్' అన్న హెచ్. జి వెల్స్ కథ చదివావా?" ఓ అమ్మాయి ప్రశ్నించింది అతన్ని

"విన్నాను ! కథ బాగుందని చాలాసార్లు అనుకున్నాను. అలా జరిగితే ఎంత బావుంటుందో అని కలలు గన్నాను !" విశ్వనాథం విస్మయంతో అన్నాడు, టైమ్ మెషిన్‌కూ వీళ్ళకూ సంబంధం ఏమిటో తెలియక.

"అందులోవున్న టైమ్ మెషిన్‌లాంటిదాన్ని మీ ఇండియాలోనే వున్న వొక శాస్త్రవేత్త తయారుచేసాడు. అది ఎవరిమీదైనా ప్రయోగించడానికి భయం వేసిందాయనకి. చివరకి నువ్వు కనిపించావు. నీమీద ప్రయోగించాడు ! ఆ 'మెషిన్' కాలంలో ముందుకూ వెనక్కూ వెళ్ళగలదని నీకూ తెలుసుగదా! అలా నువ్విప్పుడు 'ఇండియా క్రీ. శ. 2081'లో వున్నావు. అంటే మేమంతా క్రీ. శ. 2081 వాళ్ళం! నువ్వు క్రీ. శ. 1981లోంచి హటాత్తుగా 2081లోకి అడుగుపెట్టడంవల్ల నీలో పాత వాసనలు పోలేదు !"

ఓ అమ్మాయి వివరించింది అతనికి.

విశ్వనాథానికంతా వింతగావుంది. 'వెల్స్' సరదాగా కథ అల్లాడని అనుకున్నాడు గాని తను అది సాధ్యపడుతుందని ఎప్పుడూ అనుకోలేదు.

అసలు వీళ్ళు చెప్పిందంతా నిజమేనా ? ఇదంతా తనమీద ప్రయోగించబడుతున్న వో పెద్ద ఇంద్రజాలం కాదుగదా ! లేక తను యేదేనా పెద్ద కలను కంటున్నాడా ? వీళ్ళు తాము చెప్పినట్టుగా '2081'లో వాళ్ళా లేక మహాభారతం కథలో నాగకన్య ఉలూచి అర్జునుణ్ణి నాగలోకానికి తీసుకుపోయినట్టు తనయిక్కడికి యెత్తుకు వచ్చిన కామపిశాచులా ?

విశ్వనాథం తనలో తనే గుంజాటన పడుతున్నాడు.

"నీ అనుమానాన్నిప్పుడే పటాపంచలు చేస్తామోయ్ విశ్వనాథం!" మరో అమ్మాయి అంది అతని చెయ్యి పట్టుకు లాగుతూ!

మరో అమ్మాయి హటాత్తుగా అతనిబుగ్గ పట్టుకు కొరికింది మెత్తగానే!

"అమ్మా!" అని బాధలో బుగ్గ తడుముకున్నాడు విశ్వనాథం!

"కనుక నువ్వు కలగనటం లేదని నీ కర్థమైందికదా!" మరో సుందరి కిసుక్కున నవ్వింది.

"బైటకు రా! యిక్కడి వింతలు చూపిస్తాం !" ఆ అమ్మాయిలు అతన్ని మృదువుగా ప్రక్కమీంచి లేపి నూతన వస్త్రాలతోటీ, పూల హారాలతోటీ, సుగంధ ద్రవ్యాలతోటీ అలంకరించారు.

"ఆంధ్రుల అభిమాన సినిమా హీరోలకంటే గొప్ప అదృష్టం పట్టింది నాకు!" విశ్వనాథం మురిసిపోయాడు, బయటకు నడుస్తూ.

ఎదురుగా పెద్ద మైదానం ! వెన్నెల్లాంటి మెత్తటి కాంతి అంతటా ఆవరించివుంది ఆ మైదానంలో రంగురంగుల పకులు, చక్కటి కంఠంతో కూస్తూ ఎగురుతున్నాయి రంగురంగుల హరివిల్లులు అన్నివైపులా మెరుస్తున్నాయి దిగంతాలలో ! దివ్యనాదాలు అన్నివైపుల్నించీ వినిపిస్తున్నాయి.

"ఆ పకులు మేం తయారుచేసినవే ! ఆ హరివిల్లుల్ని యెప్పుడుపడితే అప్పుడు ఆకాశంలోకి ప్రసరించగలం ! చంద్రుడు లేకుండా వెన్నెలని సృష్టించగలం ! మధుర నాదాల్ని యెంత దూరమైనా సమ్మోహనకరంగా పంపి వినిపించగలం !"

గర్వంగా చెప్పింది ఓ సుందరి !

ఓవైపున ఆ మైదానంలో పెద్దపందిరి వేసివుంది. వెండి స్తంభాలకు బంగారు తోరణాలు కట్టివున్నాయి. పందిరినుండి వజ్రాలూ, మాణిక్యాలూ, మరకతాలు, నీలాలూ వ్రేలాడగట్టివున్నాయి.

వాటిని చూస్తూనే విశ్వనాథం అదిరిపడ్డాడు

"అవి నిజం వెండి, బంగారు వస్తువులే ! ఆ మరకత మాణిక్యాలు అన్నీ నిజమైనవే ! కాకపోతే వాటిని కృత్రిమంగా తయారుచేశాం ! వాటిని టన్నుల్లో చవగ్గా ఉత్పత్తిచేసేసరికి, వాటిని కొనేవారూ, అమ్మేవారూ లేరు ! ప్రజలకు వాటిమీద మోజు పోయింది !" ఓ అమ్మాయి వివరించి చెప్పింది.

హంసతూలికా తల్పాల్లాంటి వాటిమీద సభికులు విశ్రమించి వున్నారు. వారిచేతుల్లో వున్న స్ఫటికపు గ్లాసుల్లో బంగారురంగు ద్రవాలు మధుర పరిమళాన్ని గుబాళిస్తూ వున్నాయి. వాటిని మెల్లి మెల్లిగా త్రాగుచూ వాళ్ళు ఎదురుగావున్న పెద్ద రంగస్థలంమీద ప్రదర్శించబడుతున్న నృత్యాలు, నాటకాలను ఆనందంగా చూస్తున్నారు. అవన్నీ మనకళ్ళ కెదురుగా నిజజీవితంలో వున్న దృశ్యాల్లో కదులుతూ కనిపిస్తున్నాయి.

తమకు నచ్చిన అంశాలు వచ్చినప్పుడు సభికులు పెద్దపెట్టున హర్షధ్వానాలు చేస్తున్నారు.

అదంతా కొంతసేపు చూశాక విశ్వనాథానికి విసుగేసింది.

"నీకు విసుగ్గా వున్నట్టుంది ! ఈ ప్రక్కకెడదాం రా !" మహాసుందరి మరోవైపుకు తీసుకువెళ్ళిందతన్ని.

"దీనికి సంగీతం గోల" మొదటి అమ్మాయి విసుక్కొంది ఆమెను.

"నేను రాను మీరు వెళ్ళండి!" అంది నృత్యాలు చూస్తూ.

వేరేవైపున మొదటి రంగస్థలంకంటే చిన్నరంగస్థలం వుంది. కాకపోతే యిక్కడ రకరకాల సంగీత కచేరీలు జరుగుతున్నాయి. ఇంత వరకూ గాలిలో మంద్రంగా తేలివస్తున్నట్టు వినిపిస్తున్న మధుర నాదాలు యిప్పుడు స్పష్టంగా వినిపిస్తున్నాయి.

హిందుస్తానీ, కర్నాటక, పాప్, జాజ్, రాకెన్‌రోల్ అవీ యివీ అనికాదు! అన్ని రకాల సంగీత కచేరీలు జరుగుతున్నాయి! ఎవరి కిష్టమైన సంగీత కచేరి వచ్చినప్పుడు వాళ్ళు రెట్టింపు ఉత్సాహంతో చప్పట్లు చరుస్తున్నారు.

విశ్వనాధానికి అక్కడా విసుగేసింది.

"నీకు యిక్కడా విసుగ్గావుంది! అవైపుకు వెడదాం రా!" మరో అమ్మాయి అంది.

"దానికి కవిత్వం పిచ్చి!" రెండో అమ్మాయి విసుక్కుంది మూడో అమ్మాయిని.

ఒకవైపు వేదికమీద కవితాగానాలు సాగుతున్నాయి. కాకపోతే యీ వేదిక గుండ్రంగా నిర్మించబడింది! ప్రేక్షకులవి చక్రాలకుర్చీలు! ఎవరి భాషా కవితాగానం వున్నవైపుకు వాళ్ళు తమ మరకుర్చీల్లో వెళ్ళి వింటున్నారు. ఎన్నెన్ని భాషలలో కవిత్వాలు వినిపిస్తున్నా యక్కడ!

అందాల సుందరులతో సొడి మాటలు మాట్లాడటంతప్ప మరేమీ చెయ్యని విశ్వనాధానికి తెలుగు కవితాగానం వినగానే వొళ్ళు పులకరించింది. మనస్సు పరవశించిపోయింది.

కొంతసేపయ్యాక అతనికి విసుగేసింది!

"ఇంకా ఏంకావాలి నీకు?" ఆశ్చర్యంగా ప్రశ్నించింది అతన్ని నాలుగో అమ్మాయి.

"ఇంతే? ఇంతేనా? ఇంకేంలేదూ?" విశ్వనాధం ప్రశ్నించాడామెను.

"ఇంకా ఏం కావాలి? ఇక్కడ నువ్వు కోరుకున్నట్టుగానే తిండికి, గుడ్డకు, వసతికి, ఆనందానికి దేనికీ లోటులేదు! ఇంతకంటే ఇంకా ఏంకావాలి?" విసుగ్గా అందా అమ్మాయి.

"అందరూ యిలాగే వుంటారా? ఇదే అందరి జీవితమూనా?" విశ్వనాధం ప్రశ్నించాడు ఏదో ఆలోచిస్తూ.

"అంతే!" వెల్ఫేర్‌స్టేట్, "సర్వమానవ సమానత్వపూర్వక శ్రేయో రాజ్యం" అంటే యింతకంటే మరేమిటి? ఎదురు ప్రశ్నించిందామె!

"నేనూ అందరిలాంటివాడినేనా? ఏమీ లేడా లేదా? నా వ్యక్తిత్వం, ఆలోచనలు, అభిరుచులు, వీటికేం విలువలేదా?" ఏడుపు మొహంతో ప్రశ్నించాడు విశ్వనాదం!

"అంతే! నువ్వు అందరిలాంటివాడివే! నీ గొప్పేముంది!" వెక్కిరించిందా అమ్మాయి

"ఇక్కణ్ణుంచి కష్టపడి, మరెక్కడికైనా, యింకా అందమైన లోకంలోకి "

"ఎందుకు కష్టపడటం? ఈ సుఖం చాలదూ?"

"ఇక్కడ వృద్ధత్వం, అనారోగ్యం ఇలాంటివేవీలేవూ?"

"ఏమీలేవు! అన్నింటినీ జయించాం! నిత్య యౌవనం. నిత్యానందం! ఇదేగా మీ దేశంవాళ్ళు కోరుకునేదీ, మీ పూర్వుల యజ్ఞాలుచేసి సాధించాలనుకున్నదీను!" చిరాగ్గా జవాబిచ్చింది ఆ సుందరి!

"ఇలా బ్రతకడం విసుగుపుడితే ..." భయపడుతూనే అడిగాడు విశ్వనాధం!

"ఇది కష్టమని ఎవరికీ అనిపించదు! ఎవరేనా వో పిచ్చి వాడికి అలా అనిపిస్తే ఆ మైదానం చివరవున్న గదిలోకి వెళ్ళి స్విచ్చి నొక్కితేచాలు! మరుక్షణం శూన్యంలో కలిసిపోతాడు!"

''అది 'చచ్చిపోవడం' ఆత్మహత్య కాదూ?''

''కాదు! స్వేచ్ఛగా, యీ విశ్వంలో కష్టంలేకుండా లీన మవడం! మీ కాలంలోకూడా భీష్ముడికో యెవడికో అతని తాలో, దంగ్రో అలాంటి 'యిచ్ఛామరణం' వరంగా ప్రసాదించాడట గదా! హాయిగా ఏబాధా లేకుండా, గాల్లో కలవటం 'చావు' అనే భయంకర విషయం ఎందుకవుతుంది? ఇంకచాలు! ఇప్పటికే చాలాసేపు మాట్లాడాం!'' అగిందామె.

''రా! హాయిగా వుందాం! ఏ ఆలోచనలు పెట్టుకోకు! సుఖాన్ని అనుభవించటం నేర్చుకో! అవకాశం వచ్చినప్పుడు ఏ ఆలోచనలు లేకుండా అనుభవాల నందిపుచ్చుకోవడమే యీ-2081 అలవాటు'' అతన్ని గదిలోకి లాగుతూ అందామె!

గదిలోకి వచ్చినా విశ్వనాథం ఆలోచించకుండా వుండటానికి ప్రయత్నిస్తూనే ఆలోచిస్తున్నాడు. మనసుకు శాంతి లభించటంలేదు!

ఒకరోజు, రెండు రోజులు, మూడు రోజులు.. ఎన్నాళ్ళిలా నిర్వ్యాపారంగా గడపడం? ఏ రకమైన బాధా, కష్టం, ప్రయత్నం ఏవీ లేకుండా, గానుగెద్దు బ్రతుకులా బ్రతకడమేనా? ఇలా బ్రతకడంవల్ల ఏమిటి ప్రయోజనం?..తను సాధించవలసినవి కాని, సాధించానన్న తృప్తి పొందటానికి అవకాశాలుకాని లేవు! గొర్రెల మందలో వొకడిగా బ్రతుకుతూ వుండటమేనా? తనదంటూ వో జీవితంకాని, తను నలుగురికంటే భిన్నంగా, సాహసవంతంగా బ్రతకడానికిగాని అవకాశమే లేదు!

విశ్వనాథాన్ని యీ ఆలోచనలే తినేస్తున్నాయి! అసంతృప్తి అతన్ని తొలిచేస్తోంది! ఇలా కాదు యీబ్రతుకు తనకు నచ్చటం లేదు. పురుషప్రయత్నానికి అవకాశంలేని యీ సమాజం తనకొద్దు అనుకున్నాడు.

''ఎందుకు విశ్వనాథం అనవసరపు ఆలోచనలు! ... మాలా హాయిగా కాలం గడిపివెయ్యలేవూ?'' ... ఆ సుందరీమణులు అతన్ని జాలిగా ప్రశ్నించేవారు.

విశ్వనాథం జవాబిచ్చేవాడు కాదు.

ఒకరోజు మైదానం వేపుకు వెళ్ళాడు. అటూ యిటూ నడుస్తూనే శూన్యమందిరంవైపుకు పరిగెట్టుకు వెళ్ళాడు.

''విశ్వనాథం అటు వెళ్ళకు! ఇటురా! వెళ్ళకు!'' ఆ సుందరీమణులు అతన్ని వెనక్కి పిలుస్తున్నారు.

''నేను రాను! నేను శూన్యంలో కలిసి మళ్ళీ మా లోకంలో జన్మిస్తా! నా కష్టాలు, నా దుఃఖాలు, వాటిని అధిగమించటంలో నాకు లభించే తృప్తి యివి కావాలి నాకు! సుఖం, దుఃఖం, మానవ ప్రయత్నానికి విలువ, మానవులక్కొక్కొక్కరికీ వుండే విలక్షణ వ్యక్తిత్వం కావాలి నాకు! ఈ సర్వసమానత్వ 'మోనాటనీ' ని నేను భరించలేను! నా లోకమే నాకు కావాలి! ఎన్ని కష్టాలు పడినా, ఏదో వొకనాటికి సుఖిస్తాననే ఆశ, సుఖాన్ని సాధించానన్న విజయ గర్వం, కావాలి నాకు! ఎన్నిసార్లయినా, మా లోకంలోనే జన్మిస్తాను'' అరుస్తూ విశ్వనాథం స్విచ్చినొక్కాడు!

శూన్యం శూన్యం మహాశూన్యం .. తను ఏదో అయిపోయాడు.

.ఇదేమిటీ ఎవరివో మాటలు వినిపిస్తున్నాయి! ఎక్కడున్నాడు తను? మళ్ళీ తనలోకంలో కొచ్చేశాడులావుంది! విశ్వనాథం ఆలోచనలో పడ్డాడు.

''పాపం . మొహం తిరిగి పడిపోయినట్లున్నాడు! కాసిని నీళ్ళు జల్లండి మొహాన్ని లేస్తాడు!''

''కొంచెం కాఫీని పట్టించండి! నీరసం మూలాన్ని పడ్డాడో యేమో!''

''ఈ అరుగు మీద పడుకోపెట్టండి! కొంచెం గాలి తగల నివ్వండి!''

విశ్వనాథం మెల్లగా కళ్ళు విప్పాడు!

ఆశ్చర్యం! ఇది తన లోకమే! తన లోకాన్ని దర్శించగానే అతనికి ఆనందం వుప్పొంగింది! అయితే తను శూన్యంలో కలిసి మళ్ళీ క్రొత్తగా పుట్టలేదు! పాతికేళ్ళ విశ్వనాథం లానే వున్నాడు! అంటే తను యింతకు ముందు చూసిన లోకంలో శూన్యంలో కలవ లేదన్నమాట! అయితే కలగన్నాడాతను?

''ఏం జరిగిందయ్యా! సడిరోడ్డు మీద చాపచుట్టలా పడి పోయావ్! నీ అదృష్టం బావుంది... కొద్దిలో పెద్దప్రమాదం తప్పింది! లారీ అవతలగా పోయింది! కాస్త జాగ్రత్తగా వుండు!'' ఒకాయన హెచ్చరించాడు.

''అలాగే! అలాగేనండి!'' తనలో ఉబికివస్తున్న ఆనందాన్ని, ఉత్సాహాన్ని అణచుకుంటూ అన్నాడు విశ్వనాథం.

అందరూ ఎవరిదారిని వాళ్ళు వెళ్ళారు.

''ఎంత పెద్దకల! ఎంతగమ్మత్తైన కల! ఎంత వింత అనుభవం కలిగింది కొద్ది క్షణాల్లో నాకు! నాకు నిర్వ్యాపారత,కష్ట పడకుండా వచ్చే సుఖం వద్దు! రేపు మరో మంచి వుద్యోగం లభిస్తుంది! ఏదీ కాకపోతే నేనే ఏదో ఒక చిన్న వ్యాపారం ప్రారంభిస్తా! మనిషి తలుచుకోవాలే కాని సాధించలేనిది ఏమిటి? కావలసిందల్లా పట్టుదలే! దాన్ని నాకు ప్రసాదించిన యీ కల యెంత గొప్పది!... థాంక్యూ ఉటోపియా 2081!...థాంక్యూ వెరీమచ్! నా జీవితంలోని మాధుర్యం నాకు తెలియజెప్పావ్!'' నవ్వుకంటూ ఆనందంగా తనలో తనే ఏదో మాట్లాడుకుంటూ పోతున్న విశ్వనాథాన్ని, జనం వింతగా చూస్తున్నారు!

శ్రీ కుంటముక్కల లక్ష్మీనారాయణశర్మ

# భాషా వైవిధ్యం-జానపద సాహిత్యం

**0.** సజీవ భాషకు మార్పు సహజం. మార్పు వల్ల భాషకు బహురూపత, వైవిధ్యం సిద్ధిస్తాయి. వైవిధ్యపు పూర్వాపరాల సాధారణ చిత్రం లోగడే గీయబడింది [1979 (a)]. ప్రస్తుత వ్యాసం జానపద (గేయ) సాహిత్య 'వైవిధ్యాన్ని' వివరిస్తుంది. జానపదేతర సాహిత్య వైవిధ్య పరిశీలన ఇతర వ్యాసాల్లో [1977 (a) (b) 1978, 1979 (b)] సూక్ష్మప్రాయంగా చిత్రించడం జరిగింది.

1.1 అనాదిగా ఆవృత్తమవుతున్న ఆశు, లిఖిత సంప్రదాయాలలో జానపద సాహిత్యం మొదటి కోవకు చెందింది. అనతికాలంలో 'లిఖిత' సాహిత్యంతో ఉన్న పరస్పర సంబంధ బాంధవ్య సన్నికర్షల ఫలితంగా రెండు సంప్రదాయాలకు ప్రతినిధులుగా లిఖిత సాహిత్య ప్రవర్తకులే రక్షకులుగా నిల్చారు. ఈదృష్టితో జానపద సాహిత్యాన్ని సంకలితం, ప్రచారంగా విడదీయవచ్చును. ప్రజా సమూహం నుంచి సేకరించి 'సంస్కరణ'లకు లోనయి ప్రచురణకు నోచుకున్నది, ఆధునిక రచయితలు 'జానపదుల' పేరిట సృష్టిస్తున్న సాహిత్యంతో కూడినది 'సంకలిత' జానపద సాహిత్యం. సాంకేతిక పరికరాలను ఉపయోగించి యథాతథంగా సంగ్రహించగలిగిందీ, అప్పుడప్పుడూ జరిగే ఈ సంగ్రహణలకు అతీతంగా, సజీవంగా సమాజంలో నిలువగలిగిందే 'ప్రచార' జానపద సాహిత్యం. సంకలిత జానపద సాహిత్యం రెండు రకాలుగా ఉంటుంది. వ్యక్తిగత లిఖితాలు కావచ్చును లేదా ప్రచురితం కావచ్చును. అచ్చుయంత్రం వచ్చిన తర్వాత, సమాజంలో పెరిగిన నాగరికత కొద్దీ, మానవుడికి అబ్బిన సోమరితనం దృష్ట్యా మొదటి విధానం కరువవుతూ వచ్చింది. మొత్తం విభజనకు సూచిక రూపం ఇవ్వవచ్చును.




1.2 వ్యవహారంలో కలిగే మార్పులన్నీ సాహిత్యంలో చోటు చేసుకోవడం ఎంత అరుదో, ప్రచార సాహిత్యంలో కన్పించే మార్పులన్నీ సంకలిత సాహిత్యంలో కన్పించడం అంతే అరుదుగా ఉంటుంది. లేఖనానికి, వ్యవహారానికి ఎంత అంతరం ఉందో 'ప్రచారాని'కి, 'సంకలితా'నికి అంతే అంతరం ఉండటం ముఖ్యమైన కారణం. రెంటికీ వాహిక తుదిగా భాష కావడంవల్ల పోలికలు తేడాలు కన్పిస్తాయి. ఈ వ్యాసంలో వర్ణ విభాగంలో కలిగే వైవిధ్యం చర్చించబడినా వివరాలన్నీ సంకలిత సాహిత్యానికి సంబంధించినవి. ప్రచార సాహిత్యంలో కన్పించనిదీ సంకలిత సాహిత్యంలో మాత్రమే కన్పించే ముఖ్యమైన విషయం 'సంస్కరణ'. సంస్కరణలు భాషలో కన్పించే వైవిధ్య చిత్రాన్ని చెరిపివేస్తూ అప్పుడప్పుడూ అసాధురూపాల్ని అందిస్తుంటాయి.

వ్యక్తిగతంగా సంకలనం చేసేప్పుడు వ్యక్తిగత,స్వమాండలికాల ప్రభావం తప్పనిసరిగా ఉచ్చారణ, లేఖనాల్లో తొంగిచూస్తుంటుంది. ఉదా. గాయకుడు 'ఉన్నడు' అని పాడితే, సేకర్త వ్యవహారంలో 'ఉన్నాడు' ఉంటే, స్వలేఖన ప్రమాదం వల్ల 'ఉన్నేడు' రాసుకోవడం అర్థం దృష్ట్యా ఇబ్బంది కలిగించకపోయినా భాషా పరిశీలకులను తప్పుదోవను పట్టిస్తుంది. వీటిని మించి సంప్రదాయ జ్ఞాన ప్రభావమూ కన్పిస్తుంది. ఉదా: గాయకుడు 'దనం' అంటే సేకర్తకు 'ధనం'గానే వినబడ్తుంది మరి! ఈ విషయం అన్నివిభాగాల 'సంస్కరణ'ల్లోను తప్పనిసరిగా కన్పిస్తుంది.

ఇది సాహిత్యం 'ఆశు'వు నుంచి 'లిఖిత' దశకు చేరే సమయంలో జరిగే సంస్కరణ.

'లేఖనం' నుంచి 'అచ్చు'కు చేరే దశలో కన్పించే సంస్కరణలు 'ప్రచురిత' విభాగానికి చెందుతాయి. నైతికంగా సంస్కరణలు చేయడానికి 'అచ్చు' వారికి ఏ మాత్రం హక్కు లేనప్పటికీ 'ముద్రారాక్షసాల'కు అందని సంస్కరణలు 'సామూహికంగా' (కాంపోజిటర్ నుంచీ ప్రచురణ కంపెనీ మేనేజర్, ఎడిటర్ వరకూ) జరిగిపోతూనే ఉంటాయి. వ్యక్తిగత విజ్ఞానం, సంప్రదాయ జ్ఞానం ఈ పరస్పర సంస్కరణలకు దారితీస్తాయి.

2. జానపదుల యెద సందళ్లను దాచుకున్న జానపద సాహిత్యం ఇన్ని వడబోత సంస్కరణలకు తట్టుకొని సజీవంగా ప్రజల మధ్యకు వైవిధ్యంతో వస్తోంది. కన్పించే భాషా వైవిధ్యాన్ని [1] ఈ క్రింది రకంగా విభజించి చూపవచ్చును.

2.1.1.1 వర్ణ, అప్రధాన వర్ణ వైవిధ్యం నియత స్థానంలో నిర్దేశించిన వర్ణానికి బదులుగా మరొక వర్ణం కన్పించినా అర్థంలో మార్పు రాకపోవడం దీని లక్షణం జానపద సాహిత్యం[2] లో కన్పించేవి సాధారణంగా క్రింది రకాలుగా ఉంటాయి

(ఎ) పదాదిని తాలవ్య, కంఠ్యోష్ఠ్యాచ్చులుంటే ముందు అభేదక శ్రుతులు (య, వ) అదనంగా గోచరిస్తాయి [3]

అప్పుడు ఇ,ఈ=యి,యీ ఉ, ఊ=వు,వూ లకు సమానం
ఎ, ఏ=యె, యే ఒ, ఓ=వొ, వో

ఉదా యిగ (=ఇక), యేడ (=ఏడ), ఒూపున(=ఈవున <వీపున) యెన్నెల (=ఎన్నెల<వెన్నెల), వుత్తముడ (=ఉత్తముడ) వోలలాడు (=ఓలలాడు)

(బి) వ, య లను అనుసరించి వచ్చే వ్యానాచ్చులు వర్తులీకృత, నిర్వర్తులీకృతాలై ఉండడం చేత వైవిధ్యానికి తావిస్తుంటాయి. వ, వా=వొ,వోలుగాను, య, యా=యె, యే లుగాను చలామణీ అవుతాయి ధ్వని నియత రూపలేఖనం, లేఖన ఆధార రూపం ప్రచురణలో వొ,వో/వ,వా; యె,యే/య,యా లు గాను కన్పిస్తుంది. ఈ మార్పు ముఖ్యంగా అనుశ్రుతులతో మొదలయే ఒ,ఓ, ఎ,ఏ లలో గమనించవచ్చును.

1) (ఎ) ఒ,ఓ=వొ,వో/వ,వా (ఒడి=) వడి
(బి) వ=వొ, వ వొండు (=వండు)

2) ఎ ఏ=యె,యే/య,యా యాకటి (=ఏకటి)
యాడ (=ఏడ)

(సి) ఇయాంత[4] వాను ప్రాతిపదికలు భిన్నరూపాల్తో కన్పించడం మరొక వర్ణపు ఉనికిని తెలియజేయడమే. ప్రచురణలోను లేఖనంలోను సంకేతం లేనందువల్ల కలిగే మార్పిది. ఆధునిక తెలుగులో ప్రయోగించే మ్యాన మధ్య వివృతాచ్చు(X)కావచ్చును [5]

ఇయ ∼ అ ∼ ఎ విడిం ∼ విడియెం ∼ విడం, వీణియ ∼ వీణ పద ప్రారంభంలో ఏ (X) కారం య్యా, ఏ లతో కూడి ఉంటుంది. మ్యానత్త (=మేనత్త) ల్యాగ (=లేగ)

(డి) అకారం ఇ, ఉ, ఎ లుగా మారడం.

దండి (=దండ), తలుబ్రాలు (=తలంబ్రాలు), చెంద్ర (=చంద్ర)

(ఇ) 1) ఎ, ఏ లు ఇ, ఈ లుగా మారడం: చింగు (=చెంగు) కీక (=కేక)

2) ఇ కారం ఎ కారంగా కావడం: గోరెంట(=గోరింట)

3) ఉ కారం ఒ కారంగా మారడం: మొయ్యేడు (=ముయ్యేడు)

4) ఎ,ఏ లు అ,ఆ లు గాను, ఒ,ఓలు అ,ఆ లు గాను మారడం: పయ్య (=పెయ్య), చాప (=చేప), జన్నారం (=జొన్నవరం) సాయి (=సోయి)

(ఎఫ్) తాలవ్యాచ్చుల ముందు దంత్యోష్మం (స) తాలవ్యోష్మంగా (శ) మారుతుంది. కాశె (=కాసె), బాడిశె (=బాడిస) పాశెం (=పాయసం)

(జి) మకారం వకారంగా మారడం[6] లేవుడి (?=లేమి) బావనిది (=బ్రాహ్మణివి)

2.1.1.2 భేదక లటస్థీకరణం ఏ స్థానంలోనైనా అర్థభేదక వర్ణం తటస్థీకరింపబడితే ఆ స్థానంలో రెండు వర్ణ సంకేతాలు, లేఖన రూపాలు ఆవృత్తమవుతాయి [7] ఆ,ప లలో కూడిన య, చ వర్ణరూపాలకు వైవిధ్య రూపాల్ని గుర్తించవచ్చును పూర్వం [2.1.1.1 (ఎ)] గమనించినట్లుగా అభేదకశ్రుతి వర్ణం 'య' ఎ, ఏ లకు ముందు పద ప్రారంభంలో ఉంటుంది ప్రతి చోటు రూపాలు (యె,యే) య,యా లుగా మారుతుంటాయి

ఉదా యాడివే(=యేడివే<ఏడివే),యాడ(=యేడ<ఏడ)
యాటల (=యేటల<ఏటల)

చ కారంతో కూడిన ఎ, ఏలు, అ, ఆ లలో మార్పు చెంది (పర్యాయ రూపాల్తో) కన్పిస్తుంటాయి. చ వర్ణ సంయుత అ,ఆ లు ఎ, ఏ లుగా పరివర్తన పొందవు. దేశ్య చ వర్ణానికి నివృతాచ్చుల ముందు సవర్ణరూపత కన్పిస్తుంది [8]

సాదెడు (=చేదెడు) సాయమను (=చేయమను) సారెడు (=చేరెడు)

2.1.1.3 వర్ణ పర్యాయ ప్రవృత్తి. ఒకే వర్ణస్థానంలో భిన్నవర్ణం ఉన్నప్పటికీ అర్థభేదకం కాకపోవడం (2.1.1.1లోవర్ణం కానీ, ఇతర వర్ణ సవర్ణాలు కానీ ఉన్నప్పటికీ అర్థభేదకత్వానికి దారి తీయవు).

(ఎ) పదాంతం దీర్ఘాచ్చు సాధారణంగా వ్రకతమాలలో పర్యాయ ప్రవృత్తి పొందుతూ ఉంటుంది.

కాస్తో (=కాస్తూ), మేస్తో (=మేస్తూ)

(బి) య/వ, వ/య ల పర్యాయ ప్రవృత్తి సర్వసాధారణం అయిరేణి/అవిరేణి, బాయి/బావి, వావిలి/ఆయిలి, రావె/రాయె.

2.1.1.4 అస్తవ్యస్త వర్ణరూపాలు: సంబంధం లేని వర్ణాలు వస్తూ వైవిధ్యాన్ని సూచిస్తూండడం.

సింగిణి (=శింజిణి), చేరెలు(=చేడెలు), పరమటి (=పడమటి) లొట్ట (=సొట్ట), మూగలు (=మువ్వలు), బుజిలి (=బిజిలీ)

2.1.2.1 కృతక సాధురూపాలు: సాంఘిక, రాజకీయ, ఆర్థిక కారణాల మూలంగా సంఘంలో ఉన్న అధమవర్గం వారు ఉన్నత వర్గం వారిని అనుకరించాలన్న తపన వలన సన్నికర్ష ద్వారా వ్యవహారంలో ఉన్న సాధురూపాలు తొలగి వాటి స్థానే కృతక సాధురూపాలు ఆక్రమించుకుంటాయి.[9]

(ఎ) స్పర్శ స్థానంలో మహాప్రాణ స్వరాలుంచడం జానపదుల అప్రమాణ స్పర్శ ఉచ్చారణను తెలియజేస్తుంది. [10]

ఢట్టంబు (=దట్టంబు), కంఠకము (=గంటకము)

(బి) స,శ కారాలకు బదులుగా పదాదిన చకార కృతక సాధు రూపాలు విరివిగా కన్పిస్తాయి. చితఫలం (=సీతాఫలం) చేరు (=శేరు)

2.1.2.2 ప్రాంతీయ, సమాజ మాండలికరూపాలు. ప్రాంతీయతా వైవిధ్యాన్ని గుర్తించినంత తొందరగా సామాజిక వైవిధ్యాన్ని గుర్తించలేం. సామాజిక వైవిధ్యం విడదీసి చూపేప్పుడు బ్రాహ్మణ మాండలికాన్ని, బ్రహ్మణేతరుల మాండలిక విభేదాల్ని ప్రమాణ, అప్రమాణ శైలీ వైవిధ్యాన్ని చూపించినంత సులభంగా చూపలేం.

[ఎ] ర/న, నాత్రి (=రాత్రి) [బి] ల/న, చాన (=చాల) [సి] ర/ల, లెంకె (=రెంకె), కలియాకు (=కరివేప) [డి] ణ/ల, వడ్డాల్యం (=వడ్డాణం) [ఇ] ద/న, మీన (=మీద) [ఎఫ్] బ/మ, మోకాలి మంటి (=మోకాలి బంటి) [జి] ణ/డ, కంకడం (=కంకణం) [హెచ్] న/ళ; దాలిమ్మ (=దానిమ్మ) [ఐ] డ/ణ, పణతి (=పడతి)

పై ఉదాహరణల్లో (ఎ) నుండి (ఇ) వరకు ఇచ్చిన వైవిధ్య రూపాలు తెలంగాణా ప్రాంతానివి (ఎఫ్) ఆధునికాంధ్ర సంప్రదాయ కుటుంబాల్లో కన్పించే వైవిధ్యం (జి) నుండి (ఐ) ఇతర సామాజిక కుల వర్గాల వైవిధ్య లక్షణాలు.[11]

2.1.2.31 ప్రాచీన, నవీన శైలీ మిశ్రమం : నవీన రూపాలతో పాటు పూర్వరూపాలను ప్రయోగించడం. యవ్వనం/జవ్వనం, ఇక/ఇగ, అగు/అవు. మొ.

2.1.2.32 సాహిత్య/వ్యావహారిక శైలీ మిశ్రమం : (ఎ) రవర్ణ యుతమైన సంయుక్తాక్షరాలు పదాదిన ప్రాచీనాంధ్రంలో ప్రచురంగా ఉండేవి. వాడకంలో అసంయుక్త రూపాలున్నా ఇంకా జానపద సాహిత్యంలో వీటి ఉనికి తగ్గలేదు.

ప్రాకు (=పాకు), త్రాగు (=తాగు)

(బి) ర వర్ణయుత వ కార సంయుక్త చారిత్రకంగా కోల్పోయినా జానపద సాహిత్యంలో సంయుక్త రూపాలే కన్పిస్తుంటాయి. వ్రాసి (=రాసి)

2.1.2.33 ప్రమాణ, అప్రమాణ శైలీ మిశ్రమం: భాషా వ్యవహారంలో ఆదిన ఏది ప్రమాణమో, ఏది అప్రమాణమో తెలుసుకోవడం కష్టమే అయినా కాలమానంతో ప్రాంతీయ మాండలిక లక్షణాలను నెట్టివేస్తూ అధికంగా ఆదరించబడే రూప లక్షణాలను గుర్తించవచ్చును. అవే కాలక్రమేణా ప్రమాణంగా నిలుస్తాయి.[12]

కింద చర్చించే ప్రమాణ లక్షణాలు భాషా వైవిధ్యాన్ని అత్యధికంగా తెలియజేస్తాయి.

1) (ఎ) మహాప్రాణాలు జారిపోవడం : జానపద సాహిత్యంలో కన్పించే సాధారణ వైవిధ్యం. ఇందుకు వ్యతిరేకంగా జరిగితే కృతక సాధురూపాలు [2.1.2.1 (ఎ)] నిలుస్తాయి. మొకం (=ముఖం), గోరం (=ఘోరం), చ్రలి (=ఛ్రలి), రదం (=రథం) దార (=ధార), సీతపలం (=సీతాఫలం), బంగి (=భంగి)

(బి) హకారం కోల్పోవడం ఇంది (హిందీ), ఆరతీయ (=హారతీయ), ఇమ్మతు (=హిమ్మతు)

(సి) ఆంగ్ల, పర్షియన్, అరబిక్ భాషలలో కన్పించే ఫ (=f) కారం 'ప'గా పలకడం కాపీ (=కాఫీ) పలుకునమ (=ఫలక్‌నుమా)

(డి) ఆంగ్ల, ఉర్దూ భాషలలో కన్పించే జ (=Z)ను జ కారంగా పలకడం మజా (=మజా), బాజార్ (=బాజార్)

2) తాలవ్యీకరణం (ఎ) పదాది చకారం సకారంగా మారుతుంటుంది దీన్ని సరిదిద్దుకోవడానికి ప్రయత్నించినప్పుడు కృతక సాధురూపాలు [2.1.2.1 (బి)] కన్పిస్తాయి

సంపు (=చంపు), సలు (=చల్లు), సిగురు (=చిగురు)

(బి) ధ కారం జ గా మారుతుంది: గోజుమలు(=గోధుమలు)

3) పదాది వకారం కోల్పోవడం : ఈదుల్ల (=వీధుల్ల), అద్దు (=వద్దు), ఇరిగిన (=విరిగిన)

4) సంయుక్తాక్షరాలు సవినాకరణం కానీ, స్వరభక్తి కానీ చెందుతాయి. [ఎ] లచ్చిమి (=లక్ష్మి), అగ్గి (=అగ్ని), లగ్గం (=లగ్నం) [బి] సరం (=స్వరం) సామి (=స్వామి), సౌరం (=క్షౌరం) [సి] చేసుతారా (=చేస్తారా)

5) శ, షలు స కారంగా మారుతాయి.[13]

ష/స : దోసకారి (=దోషకారి), ఆయుస్సు (=ఆయుష్షు)

శ/స : సూల (=శూల), ఆకసం (=ఆకాశం)

ఆదాన పదాల్లో షకారం శ (>స)గా మారటానికి అవకాశం ఉంది. శోకు (=షోకు), శేకు (=షేకు)

6) మూర్ధన్యాలు దంత్యమూలీయా లవుతాయి : పానం (=ప్రాణం) గన (=గణ)

7) ఊష్మీకరణం: ఊష్మేతర స్పర్శాలు ఓష్ఠ్య ఊష్మంగా మారుతుంటాయి. పవడాల (=పగడాల) వరిమళాల్ (=పరిమళాల్), బావనిది (బ్రాహ్మణది)

ఇవికాక ఇతర లక్షణాలు (2.1.1) ప్రమాణ, అప్రమాణ లక్షణాలుగా సందర్భాన్ని బట్టి ఉపయోగపడుతుంటాయి.

2.1.2.34 లిఖిత వ్యావహారిక శైలీ మిశ్రమం : ఈ వైవిధ్యానికి మిగిలిన విభాగపు వైవిధ్యాలకు ఎక్కువగా పోలికలు కన్పిస్తుంటాయి.

సరం (=స్వరం), సామి (=స్వామి), యవసాయం (=వ్యవసాయం) సౌరం (=క్షౌరం), సామల్ (=శ్యామల), బ్యారెడు (=బారెడు)

2.1.3 (ఎ) ద్విత్వరూపాలు పదాంతంలో ద్విత్వత (ఎక్కువగా దంత్యమూలం అనునాసికం, పార్శ్వికం, తాలవ్య అనిరుద్ధం పాల్గొంటూ) కన్పించడం సాధారణం. గాని సౌలభ్యంకోసం భాషపొందే వైవిధ్యాల్లో ఇది ముఖ్యమైంది ధాత్వక్షరగతమైన ఉనికి కదలి అఘాతగతంగా మారటం ప్రాథమికమైన కారణం

అందెల్ల(=అందెల), నాయిన్న (=నాయన) మొ॥

సమీకరణపొందిన ఆదాన పదాలకు, పొందని పదాలకు ద్విత్వర సామ్యధోరణిలో వ్యాప్తిపొందడం గమనించదగిన విషయం.

సివ్వరెడ్డి(=శివారెడ్డి), అయ్యోధ్య (=అయోధ్య)

దీర్ఘాచ్చు లోపంవల్ల ఏర్పడిన ద్విత్వరూపాల్ని గమనించ వచ్చును.[14] తొవ్వ (=దోవ<త్రోవ), పువ్వు (=పూయి)

(బి) సంక్షిప్తరూపాలు వ్యవహర్తల సౌలభ్యం కోసం రూపాలు సంక్షిప్తీకరించబడుతాయి. అప్పుడప్పుడు సంధిగతంగా వస్తే మరికొన్నిసార్లు విడివిగల రూపాలు కుంచించుకుపోతాయి.

బోనగిరి (=భువనగిరి), అనసా (=అనసూయ,) ఈదు (=విభూతి), ఎముడాల రాజన్న (=వేములవాడ రాజరాజేశ్వరుడు)

2. 2. అసాధు రూపాలు. 'అందరి' పడబోతలకు తట్టుకొని ప్రచురిత జానపద సాహిత్యంలో కన్పించే పచ్చినిజాలు. సందర్భాన్నిబట్టి రూపాన్ని అవగాహన చేసుకోవాల్సిందే తప్ప వేరేరకమైన ఆధారం లభించదు.

2. 2. 1. ప్రచురణ / లేఖన వ్యత్యయాలు : వ్యక్తిగత సంకలనాలవల్ల వచ్చిన ముప్పిది. వ్యవహార వ్యత్యయాలను చూసి భ్రమపడి లేఖన వ్యత్యయాలు తద్వారా ప్రచురణ వ్యత్యయాలుగ మారే అవకాశం ఉంది.

వ్యవహారంలో : ఎముడాల (=వేములవాడ), గావరాన (=గారాబాన) పర్గిన (=పగిలిన)

లేఖనంలో : మార్పాకపురి (=మార్కాపురి)

2. 2. 2. అశుద్ధ లేఖ్యాలు : అక్షరరూపంలో పోలికలవల్ల ప్రచురణకర్త అశ్రద్ధవల్ల ఏర్పడుతాయి.

(ఎ) అ (=ఆ) అటపాట (=ఆటపాట)
ఆ(=అ) ఆమ్మ (=అమ్మ)

(బి) న (=వ) వెలుమలా (=వెలుమలా)

2. 2. 3. సంగ్రహణకర్తల అశ్రద్ధకు నిదర్శనాలు ఈ ముద్రారాక్షసాలు.

(ఎ) ఆగమం : కంఠ్లం (=కంఠం)

(బి) లోపం: కంకజమ (కంకరజవ), జా (=జాజి)

2. 2. 4. క్రిందిరకపు అసాధు రూపాల వివరణకు పాఠకుల/శ్రోతల సందర్భజ్ఞానం తప్ప వేరేదీ సహకరించదు. బట్టూ (=పెట్టూ), పిల్లసగొయ్యి (=పిల్లనగ్రోవి) రామారాం (=రాముడు) సాయిరేసి (=వెయివేసి)

3 ముందుభాగాల్లో విస్తృతంగా ఉదాహరించిన వైవిధ్య ఫలితాలు వర్ణవిభాగానికి సంబంధించినవి ఇవి కాదు, వాక్యవిభాగాల్లో జరపాల్సిన కృషిని నొక్కి చెప్తోంది. ఇంతేకాక శిష్ట, ప్రచార సాహిత్యపు పున్నాగ రచనలెన్నో ఉన్నాయి లోతుగా పోనప్పటికీ వైవిధ్యపు వివరాలన్నీ శైలీశాస్త్రపు పరిధుల్లోకి చొచ్చుకుపోతుంటాయి. ఆ వివరాలను మరొకమారు ప్రస్తావిస్తాను.

# రిఫరెన్సులు


బాపూజీ చౌదరి, ఎ., 1979 లాంగ్వేజ్ స్టాండర్డైజేషన్ వెర్సస్ ఐడెంటిటీ ఇన్ హైదరాబాద్ తెలుగు, పరిశోధనా సిద్ధాంతవ్యాసం, ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాదు.

చిన్నయసూరి, పరవస్తు 1858: బాలవ్యాకరణము, (పునర్ముద్రణ, 1972) బాలసరస్వతి బుక్ డిపో, మద్రాసు.

దొణప్ప, టి., 1971. "మై పర్ఫార్మెన్స్ ఇన్ లిటరరీ ఎండ్ కొలోక్వియల్ తెలుగు" ఇన్ ప్రొసీడింగ్స్ ఆఫ్ ది ఫస్ట్ ఆల్ ఇండియా కాన్ఫరెన్స్ ఆఫ్ లింగ్విస్ట్స్, డక్కన్ కాలేజ్, పూనా

కోస్టిచ్, డి. అలోకానంద మిత్తర్, భ. కృష్ణమూర్తి, 1977: ఎ షార్ట్ అవుట్‌లైన్ ఆఫ్ తెలుగు ఫొనెటిక్స్, ఇండియన్ స్టాటిస్టికల్ ఇన్‌స్టిట్యూట్, కలకత్తా.

కృష్ణమూర్తి, భ., 1972: "బైలింగ్వలిజమ్ ఎండ్ సోషియల్ డైలెక్ట్స్ ఇన్ తెలుగు" (మిమియో)

(ఎడి) 1974 : తెలుగు భాషాచరిత్ర, ఎ. పి. సాహిత్య అకాడెమీ, హైదరాబాద్.

1974 : "తెలుగు మాండలికాలు — ప్రమాణ భాష" కృష్ణమూర్తి 1974లో

1976 : "లాంగ్వేజ్ స్టాండర్డైజేషన్ ఇన్ ఇండియా" ఇన్ ఉస్మానియా పేపర్స్ ఇన్ లింగ్విస్టిక్స్, 2:1-22, హైదరాబాద్.

లక్ష్మీనారాయణశర్మ, కె

1977 (ఎ) "శైలీశాస్త్రం–యెంకి", తెలుగు, 6/1. 67-77, హైదరాబాద్.

1977 (బి) "కనుబొమల్లో .", భారతి 54/7 : 52–54.

1978 : "జానపదగేయం–వ్యవస్థ", భారతి, 55/6. 33–35.

1979 (ఎ) : "భాషావైవిధ్యం–తెలుగు", సిద్ధార్థి నామ సంవత్సరాది ఆంధ్రపత్రిక సంచిక, విజయవాడ.

1979 (బి) : "కనుబొమముడి ..కనువిప్పు", భారతి 56/6 : 53–55.

1980 : "కృతక సాధురూపాలు –దార్ఢ్యతా సూత్రం", భారతి, 57/6 : 59–64.

ది లింగ్విస్టిక్ ఎనాలిసిస్ ఆఫ్ తెలుగు ఫోక్ సాంగ్స్, (సమర్పించబోతున్న) సిద్ధాంత వ్యాసం, అణ్ణామలై విశ్వవిద్యాలయం, అణ్ణామలైనగర్.

మహాదేవశాస్త్రి, కె., 1969 : హిస్టారికల్ గ్రామర్ ఆఫ్ తెలుగు ఎస్. వి. యూనివర్సిటీ, తిరుపతి.

పొలిట్జర్, ఆర్. ఎల్.,

1951 : "ది ఫొనీమిక్ ఇంటర్‌ప్రిటేషన్ ఆఫ్ లేట్ లాటిన్ రికార్డ్స్", లాంగ్వేజ్, 27/2.

ప్రకాశం, వి., 1975 : "నాదోత్పత్తి", తెలుగు 4/3 : 167–72.

రాధాకృష్ణ, బి, 1971 : ప్రాచీనాంధ్ర శాసనాలు, ఎ. పి. సాహిత్య అకాడెమీ, హైదరాబాద్.

రామారావు, సి., 1974 : "ఆధునిక భాష–సంగ్రహవర్ణనం", కృష్ణమూర్తి 1974లో.

రామరాజు, బి., 1978 :

[ఎడి] తెలంగాణా పల్లెపాటలు [మొదటి భాగం], ఆంధ్రసారస్వతపరిషత్తు, హైదరాబాదు.

రంగనాథాచార్యులు, కె. కె,

1978 : ఎ హిస్టారికల్ గ్రామర్ ఆఫ్ తెలుగు, పరిశోధకసిద్ధాంతవ్యాసం,ఉస్మానియా విశ్వవిద్యాలయం హైదరాబాదు.

శాంతి, జి., 1977 : లింగ్విస్టిక్ ఎనాలిసిస్ ఆఫ్ తమిళ్ ఫోక్ సాంగ్స్, పరిశోధక సిద్ధాంత వ్యాసం, అణ్ణామలై విశ్వవిద్యాలయం, అణ్ణామలైనగర్.

శివానందశర్మ, పి., 1977 : "హైపర్ కరెక్షన్స్ ఇన్ తెలుగు · ఎ సోషియో లింగ్విస్టిక్ స్టడీ" ఇన్ తెలుగు అకాడెమీ 1977.

సుబ్రహ్మణ్యం,పి.ఎస్.,1970 "లాంగ్ వొవల్స్ బిఫోర్ య ఇన్ తెలుగు", ఇండియన్ లింగ్విస్టిక్స్, 31/3 : 1–7, పూనా.

1974 : ఏన్ ఇంట్రడక్షన్ టు మాడ్రన్ తెలుగు, అణ్ణామలై యూనివర్సిటీ, అణ్ణామలైనగర్.

తెలుగు అకాడెమీ, 1977. సెమినార్ లన్ సోసియో లింగ్విస్టిక్స్, తెలుగు అకాడెమి హైదరాబాదు.

# అధోజ్ఞాపికలు

1 ఇంకా వివరాలకు ఇదే రచయిత [సమర్పించబోతున్న]సిద్ధాంత వ్యాస గ్రంథాన్ని సంప్రదించవచ్చును. ప్రస్తుత వైవిధ్య విభజన శాసన సాహిత్య [వైవిధ్య] పరిశీలన [మహాదేవశాస్త్రి 1969; రంగనాదాచార్యులు1978; రాధాకృష్ణ 1971] ఆధారంగా చేసింది. పాలకుల ఒత్తిడికి గొనవుతున్నా తాకిడికి తట్టుకొని సజీవభాష శాసనాల్లో దాచుకుంటే, లిఖిత సాహిత్య ప్రవర్తకుల అణచివేతలకీ, ఛీత్కారాలకీ, సంస్కరణలకీ బలయిపోగా మిగిలింది జానపద సాహిత్యంలో ఉండటమే ఈ విధానాలను ఎన్నుకోవడానికి ముఖ్య కారణం. ఇదివరలో శాంతి [1979] జానపద సాహిత్య వైవిధ్య రూపాలను ఉదాహరించారు కాని విభజించి చర్చించలేదు. వైవిధ్యం కలగడానికి నాలుగు కారణాలు పేర్కొన్నారు. అవి: 1] గాయకుల పొరపాట్లు 2] ప్రాంతీయతా భేదాలు 3] అన్యదేశ్య పదాదాన ప్రభావం 4] లిఖిత, వ్యావహారిక రూపాల వాడకం.

2 ఈ వ్యాసంలో సూచించిన ఉదాహరణలు అధిక భాగం 'తెలంగాణ పల్లెపాటలు' [సంపాదకుడు, రామరాజు: 1968] లోనివి.

3 లిఖిత, వ్యావహారిక శైలి కావ్యాల్లో ప్రవేశించకుండా ఉండ టానికి వీలుగా బాల వ్యాకరణం [=బా.వ్యా.]లో సూత్రం [సంజ్ఞా, 17] ఉండటం గమనించవగిన విషయం

4 ఈ వైవిధ్యాన్ని గుర్తిస్తూ బ.వ్యా లో [ఆచ్చిక: 23] సూత్రం ఉంది బహుశా ఇది వ్యవహారం నుంచి 'లిఖిత' సాహిత్యానికి పాకి ఉండాలి.

5 సుబ్రహ్మణ్యం [1974 5] క్రియలో [ఇయ+అ,ల] సంధి ఫలితంగా సంభవించిన ధ్వనిగా గుర్తిస్తున్నారు.

6 ఆధునిక తెలుగులో ఈ వైవిధ్యం కన్పిస్తుంది రామారావు [1974. 354] .. "మ వర్ణానికి అచ్చుల మధ్య, పదాంతంలోను, అనునాసిక వకారోచ్చారణ ఉంది. సంస్కృ తాది భాషల నుంచి వచ్చిన శబ్దాల్లో మాత్రం ఈ ఉచ్చారణ విన్యాసంతుల్లో లేదు. సంస్కృత శబ్దాలయినా సంవత్సరం, సంశం, మాంసం, సింహం వంటి మాటల్లో పదాంతంలోను, సంయోగంలోను, వ, శ, స, హ ల ముందు ఈ ఉచ్చారణ ఉంది. అనునాసిక వకారోచ్చారణ కోస్తా జిల్లాల్లో ఎక్కువగా ఉంది. తెలంగాణా, రాయలసీమ వ్యవహర్త లందరిలో ఈ ఉచ్చారణ లేదు."

సుబ్రహ్మణ్యం [1974. 12] ... ... "ఇట్ ఈస్ ప్రనౌన్స్‌డ్ యాస్ బయిలేబియల్ నాసలయిజ్‌డ్ ఫ్రికేటివ్ బిట్వీన్ వొవెల్స్ [బట్ నాట్ ఇన్‌డబ్లింగ్] బిఫోర్ వి ఎండ్ హెచ్ ఎండ్ ఇన్ వర్డ్ ఫయినల్ పొసిషన్.

కోస్టిచ్,మొ॥[1977:170]..."ఇన్ స్టాండార్డ్ స్పీచ్ 'ఎమ్' ఈస్ ప్రొనౌన్స్‌డ్ యాస్ అక్లూసివ్ వర్డ్ ఇనిషియల్లీ ఎండ్ ఇన్ జర్మినేషన్. వర్డ్ ఫయినల్లీ ఇంటర్ వొకాలికల్లీ వెన్ సింగిల్ ఎండ్ బిఫోర్ ది కాన్సొనెంట్ 'వి,ఎస్,హెచ్' ఇట్ ఈస్ ప్రొనౌన్స్‌డ్ యాన్ ఎ బయిలేబి యల్ ఫ్రిక్షన్‌లెస్ కంటిన్యుయంట్ విత్ నాసలయిసేషన్ దట్ ఈస్ 'వఀ'. దిస్ ఎల్లోఫోనిక్ డిఫరెన్స్ డస్ నాట్ ఎక్సిస్ట్ ఇన్ ది ఈష్టర్న్ ఎండ్ నార్తరన్ డయలెక్ట్స్.

7 పోలిట్జర్ [1951] లాటిన్ సామగ్రిని పరిశీలిస్తూ ఈ విషయాన్ని పేర్కొన్నారు.

8 ఈ పరిసరంలో ఏ/అ మార్పు ఏ [=X] వర్ణాన్ని సూచి స్తుందని సుబ్రహ్మణ్యం గారు వాదిస్తున్నారు.

9 తూమాటి దొణప్ప [1971] సాహిత్య, వ్యావహారిక భాషలో కన్పించే కృతక సాధురూపాల విభజన చేసారు. శివానందశర్మ [1977] కృతక సాధురూపాల వెనుక గల సాంఘిక అవ గాహనను సూచించారు ప్రస్తుత వ్యాస రచయిత మరొక చోట [1980] వర్ణ వ్యవస్థకు కృతక సాధురూపాలకు మధ్య గల సంబంధాన్ని తెలియబర్చడం జరిగింది.

10 ఆధునిక తెలుగు [సంఘ ఉన్నత వర్గ వ్యవహారంలో] స్పర్శ స్థానాన్ని మహాప్రాణం ఆక్రమిస్తే తీవ్రతను సూచిస్తుందని ప్రకాశం [1975], రామారావు [1974] గార్లు అభి ప్రాయపడుతున్నారు

11 సమాజ మాండలికాల విభజన నిమిత్తం ద్విభాషా ప్రభావం; ప్రమాణ, అప్రమాణ శైలుల ప్రభావం పరిశీలించాలని కృష్ణమూర్తి [1972] గారి అభిప్రాయం.

12 ప్రమాణ, అప్రమాణ శైలీ లక్షణ చర్చ కృష్ణమూర్తి [1974 402, 1976 1-21] గారు చేసినప్పటికీ, ఇటీవలి బాపూజీ చౌదరి [1979] ప్రమాణ లక్షణాల పట్టిక పదాంశ లక్షణాలు గ్రహిస్తూ మరికొన్ని కొత్త విష యాల్ని చెబుతోంది

13 శ, ష, స లలో చివరిది ప్రాచీనమనీ, మిగిలిన రెండు ఇండో ఆర్యన్ భాషల్నించి ప్రవేశించాయని సూచిస్తూ,నిరోష్ఠ్యాచ్చుల ముందు [ఇ,ఈ, ఎ,ఏ, అ,ఆ,] శ, ష లకు భేదం కన్పించ దనీ,ఓష్ఠ్యాచ్చుల ముందు కన్పిస్తుందని రామారావు[1974: 352] భావిస్తున్నారు శుభ్రం, త్రిశూలం, శోభనం మొ॥

14 ఇటువంటి రూపాల చారిత్రక వివరణకి సుబ్రహ్మణ్యం [1970. 31-3] ను సంప్రదించవచ్చును

శ్రీ నిడుదవోలు వేంకటరావు

# మల్లికార్జున పండితారాధ్యుని జీవితము పునః పరిశీలన

## అవతరణ

శ్రీవృషాది నాయకునకు బసవనామం బిడి ప్రమథానుమతిని భూలోకమునకు పంపుసమయమున అనుపమ పరమసరానంద మొసగు తన పాదభక్తియు, నందికేశు సర్వజ్ఞతయు, భృంగి సహజ నిష్ఠ, దుర్వాస ముఖ్యుల ధ్రువశాపశక్తి, అక్షపాదాదుల వాగ్విచక్షత, ఉపమన్యు సద్గురుత్వము, రుద్ర ప్రమథ గణాధిపుల సహజ స్వకీయ ప్రసాదైకరతియు, ప్రాక్తన నూతన భక్తగణముల వ్యక్త దృష్ట ప్రత్యయారూఢమహిమ, వీరభద్రుని శౌర్యము — వీనినన్నింటిని శివుడొక మూర్తిగా దలప, ఆ తలపే మూర్తీభవించినది ఆమూర్తి పరమేశ్వరునకు వ్రాలి మొక్కెను దానికి శంభుడానందమొంది నానా పురాణ విజ్ఞానమొసగి

"బసవకుమారుని పజ్జను నీవు
వసుధకు శివభక్తి వర్ధనార్థముగ
నరుగు"

మని యాదేశించెను.

తాను మానవరూప ధారియై భూలోకమునకొచ్చి శిష్య ప్రశిష్య ప్రసిద్ధుగావించి, లోక గురుత్వము, అసమశాపానుగ్రహ సమగ్రత, శివమహత్వ ప్రతిష్ఠిత వచస్సిద్ధి, శివతత్త్వ సారసంచిత కళావృద్ధి, శివయోగ సంపత్సమృద్ధి, అమిత దృష్ట ప్రత్యయాంచిత మహిమ, ఘోరనిస్సార సంసార వారాశి పారగత్వము మొదలగు శక్తులిచ్చెదనని యమూర్తిని దీవించెను. శివుడింకను నిట్లు చెప్పెను.

## భూలోక జననము

వేంగిమహోర్వీస్థలమున దక్షారామమున శ్రీ భీమేశ్వరోరులింగము సముద్యన్మహామహిమ నొప్పారుచుండును. అద్దేవు పురోహిత శ్రేష్ఠుడు భీమన పండితుడు — విద్వన్మహిష్ఠుండు, వీరభక్తి సత్తముడు, సద్బ్రాహ్మణోత్తముడు. వానసవంశవర్ధనకరుడు. ఆతడు పుత్రార్థియై శ్రీదివ్యపంచాక్షరీ శుభమంత్రమును శుద్ధాత్ముడై బహుపురశ్చరణులు పాటించి (శివుడామూర్తితో మాట్లాడుతున్న సమయమున) శ్రీ గిరి మల్లికార్జునుని సన్నిధిని నొక పురశ్చరణ కావింపుచున్నాడు. ఆతనికి యుదయింపుమనుడు వెంటనే భీమాఖ్య సాధ్విగౌరాంబ గర్భమున ప్రవేశించె. మల్లికార్జున కృపాసంభూతుడగుటచే గౌరాంబా భీమపండితులు తమ బిడ్డనికి మల్లికార్జునుడని పేరు పెట్టిరి. ఆ పేరుతో పండిత మల్లికార్జునుడు దాక్షారామమున కొచ్చి కోటిపల్లి యారాధ్యుల హస్తమస్తక సంయోగమును, దీక్షను వీరశైవోక్త విధిని పొందెను

## దక్షారామవాసులు పండితుని వీరశైవవేషమునుజూచి వెక్కిరించుట

మల్లికార్జునపండితు డీవిధముగా నొక కొత్తపద్ధతికి లోనై ఒడలనిండ విభూతిని పూసుకొని, రుద్రాక్షలు, లింగమును ధరించి దక్షారామమున దిరుగుచుండగా నచ్చటి బ్రాహ్మణులు, నరులు పండితయ్యను జూచి నవ్వి పక

'పండితయ్యా! నీవు పౌరాణికుడవు
సద్విజోత్తముడవు, సత్పుత్రుడవు
విద్వాంసుడవు, వేదవిదుడవట్లయ్యు
భూతియు, రుద్రాక్షములు దాల్పనగునె?
నీతియే లింగ సన్నిహితమైన యున్కి
పాదోదకంబుఁ బ్రసాదంబు గొనఁగ
భూదేవతాత్మమే వైదికమతమె?
హరివిరించ్యాది సురాసురమునిని
శిరసుఁ దాల్చినవారుఁ గలరె మున్నాది"

అని ప్రశ్నించిరి. పండితుడు చిరునవ్వునవ్వి వారికి విభూతి, రుద్రాక్ష, పాదోదక, లింగార్చన, లింగధారణ, ప్రసాదస్వీకారాది వీరవ్రత విధులకు వేదేతిహాసపురాణాదులనుండి యనేక సాక్ష్యములను గుమ్మరించి తెలియ జెప్పగా నా విప్రులు పండితుని కీర్తించి తమతమ వీళ్లపట్టున కరిగిరి.

## వేమనారాధ్యులు, సూరసానమ్మ, యితర జంగములు పండితుని చూడవచ్చుట

పేరండ్ల సూరసానమ్మ, పేరెన్నబడిన శ్రీ బెల్లెవి వేమనారాధ్యులాదిగా నలరు జంగములు [దక్షరామముననున్న] పండితారాధ్యుని జూచువేడుక బయలుదేరిరి. అంత [దక్షారామమున] పండితు డొకనాటి మధ్యాహ్నవేళ లింగార్చనోద్యుక్తుడయ్యెను. మజ్జన మాచరించు సమయంబునకు సూరసానమ్మ వేమనారాధ్యులు వచ్చిరి.

## పండితుని కరస్థలమునన్న లింగము తాత్కాలికముగా నంతరిక్షమున నిలుచుట

కరస్థలమున లింగమున్న సంగతి మరచి వారి దర్శనము జంగమదర్శనముగా భావించి లేచి, వారికి మ్రొక్కగా కరస్థలము నందున్న విగ్రహము యంతరిక్షమునకెగసి తిరిగి పండితుని దేహమున జేరెను పండితయ్య వారిని కౌగలించుకొని సాష్టాంగపడి లేచువరకు నాలింగమట్లే యుండెను. [ఇక్కడ లింగార్చనకంటె జంగమార్చన ముత్తమమని తెల్పుట]

పండితుని గురార్చనా నియతికి, జంగమునిష్ఠకు వచ్చిన వారు అద్భుతానంద పరవశులయి పండితుని కొనియాడిరి. శివభక్తికి ప్రఖ్యాతుడయిన బసవన్న చరితమును పండితునకు వినిపించిరి [అందు వారు పుట్టిన మొదలు జంగమ పారవశ్య సద్భక్తియందు బసవన చేసిన ఘన కార్యములరసు మాత్రమే చెప్పబడినది]

## వెల్లగొండ మహాదేవయ్యకు పండితుడు శిరచరణాదు లొసగుట

పండితారాధ్యులొక్కనాడు తానును శిష్యవర్గము సుప్రభాతమున నుల్లుకరి మల్కాంచి పువ్వులు గోయుచుండిరి తన శివార్చన సమయమునకు ముందు నెవ్వరేని కోసుకొని పోవుదురేమనియు తుమ్మెదలందరి మనుపును గ్రోలకమునుపు తాను గోసుకొనెడివారు. పండితుని శిష్యవర్గము పువ్వులగోయు శబ్దము వినవచ్చి లేచి ముందుకు పోగా శివార్చోపకరణములు కాళ్లకు తాకెను. వెంటనే నాయయ్య తాన రెండు కాళ్లను గుల్ఫములవరకు గడికొండలుగా నరికికొనెను మహాదేవుని వీరభక్తికి పండితుడు మెచ్చుకొని శరణు వేడెను. వృషభదీప తైలంబు దెచ్చి పూసెను. తునకలను గుత్తులను జక్కొల్పి సందించి విభూతి మంత్రించి వాటిపై జల్లెను. మహాదేవయ్యకు కాళ్లు వచ్చినవి అప్పటనున్న శివభక్తులందరకును మహాదేవయ్యచే పండితుడు నమస్కరింపజేసెను

## చందవోలులో వెలనాటి బోడుని సభ : పండితుని వాదము!

పండితుడు చందవోలను పురి యందు మహాసద్భక్తి మహిమతో వర్తించుచుండెను. అతని సర్వజ్ఞత్వము, శీలసంపద చూడజాలక వెలనాటిబోడనికి గురుడగు బౌద్ధుడు తన శిష్యుని రావించి పండితయ్యతో వాదమిప్పింపుమని, శైవము మోక్షైక సాధనమని, రుద్రుడే దైవమను వార్త వారింతునని

"బౌద్ధదర్శన పట్టబద్ధుండు గురుఁడొ
శుద్ధ వైదిక శైవ బద్ధుండు గురుఁడొ" (వాద.116)

తేల్చినై చెదరని చెప్పెను. చోడుడు ఊరిలోన వారినెల్ల పేరుపేరున బిల్చుటయేగాక

"ఊర నీసభకు రాకొకడు సిక్కినను
ధారుణీశ్వరునాజ్ఞఁ దప్పినవారు
నుండోయనుచు బురిచుట్టు చాటించె"

ను. పండితుడు సభకు వెడలెను. ఆయనవెంట

"పరమ లింగార్చనపరులు స్వాధ్యాయ
పరులునై చను మహాబ్రాహ్మణోత్తములు"

వేదభాష్యములు చదువుచు, చెప్పుచు వచ్చిరి. వేమనారాధ్యులు, నూరసానమ్మ వారివెంట నుండిరి. పండితుడు పరవాది మత్తేభ పంచాననుడువలె నుండెను శ్రుతివిరుద్ధము, భవపాశబద్ధము, భువి నిషిద్ధము, దుఃఖ సమృద్ధము, పాపబద్ధము శుద్ధ యబద్ధమని బౌద్ధమును, నితర సమయములను పాశుపత మతముతో సరికావని వాదించి తుదకు

"గౌరీశుమీద
దైవంబు లేడని తలియిచ్చి పడయు
దును, మంటఁబట్టుదు, దొడరిన గెలుతుఁ
బనుగొన వాదజల్ప వితండములను
జెలగి, యట్లునుగాక శివుమీదనొకడు
గలడన్న నా యఱకాలెత్తి వాని
నడుదల దన్నుదు నాదు ప్రతిజ్ఞ
యెడపక యేను గాలెత్తితి ననుచు"

శ్రీ మహాదేవు మహిమ నారూఢముగా మల్లికార్జున పండితులాద్యు లేనవ ప్రతిష్ఠించె. (పుట 162)

## బౌద్ధగురుని హత్య: పండితునికి అక్షిదండన

బౌద్ధగురువు నోరు మెదల్పలేక సభాస్థలిని విడిచెను. లోక గురుత్వము, పండితత్వము మల్లికార్జు నారాధ్యులవారికే తగునని పౌరులు, బుధులు కీర్తించిరి. ధరపుట్టిన సాక్షాత్ దక్షిణామూర్తి యని వర్ణించిరి.

కొన్నిదినములు చనినవెనుక బౌద్ధగురుడు తనకు జరిగిన యవమానమును సహింపలేక మల్లికార్జున దీపమాలె గంబమును యెల్లవారు చూడ తన శిష్యునిచే పగులగొట్టించి తెప్పించెను. అట్టి పాపము చేసినవానిని చంపక విడవరాదని రేమయ దేవయలను నిద్దరు నొకనాటి వేకువజామున సరవర లింగావసరములు చెల్లించి హరు ప్రసాదంబు భోగించి జనులెర్గకుండ సమీప సముద్రాంతరస్థలి నున్న లంకయందుగల బౌద్ధాలయమును ప్రవేశించి దీపమాలెకంబము పగుల గొట్టినట్లు బౌద్ధగురుని దేహము కడికండలుచేసి, తలత్రెవ్వి పొట్టలో బెట్టి, యాతని దేహముపై నిది యసంఖ్యాత మహేశ్వరుల పంపనుచు నొక లేఖ రొమ్ముపై బెట్టి యవతలిదిక్కు రేవున యదృశ్యమైరి.

## పండితుని అమరావతి ప్రయాణము : వెలనాటి క్షయము

ఈవార్త విన్న చోడుడు పండితున కక్షిదండన విధించెను. పండితుడు లింగోద్భవ దేవునికి నమస్కరించి 'లింగొద్భవగద్య' చదివెను. పండితుడే తన కండ్లను రెండుసార్లు నూడబీకుకొనియుంచగా దిరిగి కండ్లు వచ్చెను. చోడడిది యవమానమని తలచి మూడవసారి దృష్టి రాకుండ పండితుని యామికుల చేబట్టి తెప్పించి, నేత్రములుప్పించి జీళ్లపాలు బోయించి వెడలిపోయెను. అమరారామమున తిరిగి దృష్టి దెప్పించి బౌద్ధవికృతి పొగమునట్లుగా నుండవేయుమని పండితుడు శివుని ప్రార్థించెను. తానిక పసదువోలున నుండజాలనని మహేశ్వర క్రోధోత్కాటానల పటల విరచిత జ్వాలల వెలనాటిబోడ ధరణీ తలేశ్వరాధమ పతంగము భస్మమయ్యెడుగాకయని శాపంబిచ్చి యమరావతికి ఒయనమయ్యెను. వెలనాడున మరోత్పాతములు పుట్టి, చోడుని యుదరంబున వ్రణబాధ మిక్కుటమయ్యె అమరావతిదిక్కునపోవుచున్న పండిత కుటుంబమును, శిష్యులను దర్శించి చోడని భటులు పశ్చాత్తాపమును దెలిపిరి. రమ్మనిరి. తనరాజ్య మిత్తుననిని చోడుడు చెప్పెననిరి కాని పండితుని దయకు వారు పాత్రులు కాలేక వెడలిపోయిరి. చోడుడు మరణించెను. అతని సంతానమెల్ల రాజ్యార్థమై పోరాడుకొని చచ్చిరి. వెలినాడు పాడయ్యెను. పండితుడు దోవలో గణసహస్ర నామావళిని పఠించెను. అమరావతి చేరి అమరేశ్వరునిపై యష్టకమును జెప్పెను. అక్కడ దీర్ఘికా మధ్యమున సభదీర్చి వెలనాటి సీమను దాటివచ్చినట్లు తన భక్తులకు చెప్పెను. (చోడుడు తనకు ఊర్ధ్వనేత్రలాభము గలిగెను. మరణించెనను వార్త దెలియగానే.)

## కర్ణాట భాషాబ్ధి : బసవని చూచు వేడ్కలో కల్యాణపుర ప్రయాణము: మొదటి మజిలి–నిడుగుడములు

అమరా రామమున భక్తానీక మంకనలు చేయుచుండగా మల్లికార్జునుడు సుఖలీలనున్నాడు. భక్తగణములకు వస్త్రభూషణావలులు సమర్పించి విభూతి వీడియంబు లొసంగినాడు. ఆనంద గీతములు, శంకరగీతములను బాడుచు హరగణంబులు పరమశివానందభరితమ్మై యున్న సమయమున కర్ణాట భాషలో కవిత్వము చెప్పశక్తి కావలెనని పండితుడు అంతకు ముందెన్నడో బంపిన జంగమము భక్తవరులు వచ్చి బసవన్న పరమహత్త్వంబు ప్రస్తుతింపుచు బసవన్న హస్తాన్నగత భూతిని అందివ్వగా సాంగముగా కర్ణాటభాషలో కర్ణాటగీత సంగతుల బాడుచు బసవన్నను పండితుడు సాక్షాన్మహోత్తు, శిక్షిత ప్రతిపక్షు, బసవగణాధ్యక్షు నక్షణమ వీక్షింతమను వింతకల్యాణపురంబున కభిగమనంబు చేసెను. దారిలో మారూర సద్భక్తు లెదుర్కొని పాదాభి వందనంబు లర్పించిరి. నిడుగుడముల కేతించి సారంగేశుని త్రికాలము పూజించు వాడును, సతత జంగమ పరిచర్యానురక్తుడును, యవధూత పూర్ణవర్ణాశ్రమవ్యక్తి, శ్రుతిబోధితాచార సుపథ ప్రయుక్తుడును పండితుని అగ్రశిష్యుడు దోనయ్య కగ్రజుడునగు, వీరభాకి రాజయ్యచే భక్తభావన పండితుడు ప్రణమిల్లగొనెను.


చూడండి!
ఇల్లాలు
భర్తకు ప్రేమమూర్తి!
బిడ్డకు మాతృమూర్తి!!
సృష్టికే దేవతామూర్తి!!!
ఎ. పూర్ణచంద్రరావు
సమర్పించు
బాబు ఆర్ట్స్
ఇల్లాలు
కలర్
దర్శకత్వం
తాతినేని రామారావు
నిర్మాత
జి. బాబు B.Sc.
సంగీతం-చక్రవర్తి
లక్ష్మీచిత్ర శ్రీలక్ష్మీచిత్ర

## రెండవమజిలి—పానుగల్లు

విడుగడములనుండి పండితుడు పానుగంటికి బయలుదేరెను అచ్చట శిష్యుడు ఒండరుపు గోవింద్రపెగ్గడ ఈ వార్తవిని పుర వీధి రామణీయముగా నలంకరింపజేసెను పండితుడు పురప్రవేశము చేయగనే సాష్టాంగపడి మ్రొక్కెను ముంగట గురుమూర్తి నడవగా నాయన వెంట శిష్యుడు గోవింద్రపెగ్గడ పండితుని పాదముద్రొక్కక, ఆయన త్రొక్కినచోటు త్రొక్కక ప్రీతిలో స్వగృహమునకు గొనిపోయెను పండితునకు తన యింటనున్న సకల ధనకనక పీని చీనాంబర వస్త్ర సందోహమును గురుదీక్షగా నొసగెను. భక్తవరులు, పండితయ్యయు భక్తిసుధా రసాపార లవధి నోలలాడిరి

## ఉదయావనీశుడు—ధవళేశు నామయ్య : పానుగంటి రాజ్యక్షయము

ఆ యూరి యేలిక ఉదయావనీశ్వరుడు అతని పెద్ద లెంక ధవళేశు నామయ్య సహజలింగ నిష్ఠావృత్తిలో నడమకొనుచుండెను లోడిలెంకలు రటాకడరేగి నామయ్యపై కొండెములాడజొచ్చిరి రాజు తమ్ము పెట్టించుకొని తాను భక్తుండనని పారవేయుననియు, పిలిచిన రాడనియు, నిన్నటినుండి ప్రొద్దస్తమానము పండితునియొద్ద, భక్తులయొద్ద కూర్చుండుననియు, రాజును లెక్కసేయడనియుజెప్పిరి. అంత నా రాజు నామయ్యను రప్పించి తన తమ్మయొసగగా నా తమ్మను భూమీశు నొద్దనె పారవైచెను. నామయ్య సేవక వృత్తిని నిరసింప ఉదయావనీశుడు "మీబసవరాజాదిగా సేవాక్రమమున నడచినవారె. వారి కంటె యేవిధముగా భక్తుడవు? మొదటిసారికి తప్పు పట్టను గాని ఇదిగో తమ్మ. తీసుకో...లేనియెడల మా యొడలు మాకిమ్మ"నెను.

అంత నామయ్య

"నన్నంటివిగాక! అన్యశరణులను, భక్తగణ నాథులనుగూర్చి పల్కుటయేల. ఇష్టలింగ ప్రసాదేచ్ఛానుభవులు కష్టమానవుల యుచి ష్టములను తిందురా. బసవయ్య భవుని [బిజ్జలుని] కొలవలేదా యని గదా ప్రశ్న. బసవయ్య మహిమ నీకు చక్కగా తెలియదు. పర మేశ్వరుడు బసవని సద్భక్తి వర్ధనార్థము భువికి పంపినాడు. ఆయన మహత్వమునకు గురియైన పలుదూషకునివల్లకాని తెలియదు. కంటకాసురుడనగా నొక్కదివిజ కంటకుని బ్రతినకుగాబంప పుడమిపై బిజ్జలుని సృజించినాడు. అతడు బల్లహపట్టభద్రుడు. ఆ బిజ్జలుడు కప్పడి సంగమేశ్వరమునకేగి బసవన్న దోడ్తెచ్చి బంబరువిచ్చి సకల నియోగాధ్యక్షునిగా జేసినాడు.' కాని యాతడు బిజ్జలుని నరమాత్రుని గనే చూచెను. జంగమములయందుండు భక్తి బిజ్జలునియందులేదు. మిండజంగమములకైనను రాజు నెదుటనే ధనము ధారవోయును. ఎన్నిసారులు తప్పవచ్చేనని బసవడన్ని తూరులు బిజ్జలు ఒప్పగావించి శివభక్తి మాహాత్మ్యమును ప్రతిష్ఠించెను.

అల్లయ్య, మధువయ్యలను శివభక్తులను బిజ్జలుడు చంపించగా బసవనమంత్రి కల్యాణము పాడుగాపుతమని శపించెను. జగదేక మల్ల, బొమ్మయలు బిజ్జలుని హతమార్చిరి. కావున భక్తులు సేవక వృత్తి కొలిచిన కొలుతురుగాని సత్పథంబు విడవరని నామయ్య చెప్పి యుదయావనీశు వెన్నుష్న మరియు చెప్పెర వుమ్మకొని యూరిలోని గోపుర ద్వార సార్వత్రమెక్కి ఉదయావనీశుని వంశనిర్మూలమగుగాక యని శాపమిచ్చి తన కంఠముత్తరించుకొనెను

అది వినిన పండితుడు రౌద్రిక్తుడై "ఉదయావిధానావనీ వల్లభస్య పుత్ర కళత్రమిత్ర బాంధవో నిత్యం క్షిప్రం పరం విదూషరో"యని శాపజలంబులెత్తి చెర్లె పానుగంటి నుండంగ గాదనుచు పురి వెదలంగ వెనుక నక్కటికముగా గర్పొప్ప పూచె, వర్కొడి హాసె పానుగంటి సుర్వాతము పుచ్చె, ఉపయోగ బాంధవ ముగా నశించెను

## మూడవ మజిలి — వనిపురము

పానుగంటినుండి పండితుడు వనిపురమునకు వచ్చెను వనిపుర శంకరయ్య యను భక్తుడు భక్తసమేతుడై పండితు నెదుర్కొని ఊరిలోనికి గొనివచ్చెను పండితు డక్కడ కొన్ని నాళ్ళరయుచు గడిపి కల్యాణమున కళిగమనంబుసేయు అప్పుడు వర్తిగాబిబి పుట్టి జగదేవమల్ల బొమ్మయలు బల్లహు బిజ్జలుని చంపిరని, బసవేశ్వరుడు కప్పడి సంగమేశ్వర గర్భములో దేహముతో చొచ్చెనని, ఇది జరిగి యెనిమిది దినములయినదని యొక యయ్య చెప్పగా పండితుడు విని పడి, దుఃఖపడి

> "నామార నా ప్రభాత ననుపెట్టి నీవు
> గా యుజాసంహారు గర్భంబు సొచ్చి
> తాయుంచు "హాయించు"

బసవేశ్వరుని గూర్చి ప్రలాపించెను.

ఆనాడు లింగార్చనను చెల్లించి పండితయ్యయు, శంకరయ్యయు, సద్భక్తవరులును బసవ దండాధీశు మహిమ గొనియాడుచు మహోద్భురా క్రాంతాత్ములై యుండిరి.

## నాలుగవ మజిలి — వెల్లటూరు

వనిపురమునుండి శంకరయ్యగారిని వీడ్కొని పండితారాధ్యుడు శ్రీశైలప్రాంతమునైపుకి మరలెను. సమీపమున నేగుతరి నైష్ఠిక శైవపాశుపతులు పీఠమాహేశ్వరులు కనబడిరి. శ్రీశైలము త్రింశ ద్యోజనభూమి. కొన్నిదినములు ప్రయాణము చేసి చేసి వెల్లటూరున కొచ్చెను. ఆయనకు శ్రీశైలమంతయు దివ్యలింగ స్వరూపమై వెలింగె. దానినే శ్రీ లింగమూర్తి సాక్షాత్కారముగా తలంచి పండితుడు లింగాపసరమును చెల్లించె.

## దోనయ్య శ్రీశైల దర్శనము

అంత తనశిష్యుడు దోనయ్యను బిలిచి శ్రీగిరినాథుని పోయి సేవింపుమని, శివరాత్రి యచ్చటనే చెల్లింపుమని పర్వతము చుట్టు ప్రదక్షిణము కావించి తన వ్రతసమాప్తిని కావింపుమని యాజ్ఞ యిచ్చెను. శిష్యుని కోరికపై శ్రీశైల మాహాత్మ్యమునువినిపించెను. దోనయ్య సాష్టాంగపడి గురువు యాజ్ఞను శిరసావహింప శ్రీశైలమున

కరిగెను వృషభపురమున బసవేశ్వరుని యాలయమును దర్శించి యచ్చటనున్న చతుర్ముఖ బసవలింగంబునకు పూజ చేసెను. అచ్చట నుండి బయలుదేరెను దారిలో బసవపురాణ, పర్వత పురాణములు చదువువారిని చూసెను చివరకు మల్లికార్జున పురము చేరెను మల్లన్నను దర్శించి జంగమారాధనలు సల్పెను. శివరాత్రి జాగరణ మొనర్చెను శ్రీశైల మల్లికార్జునుడే వృద్ధ తపోధనుని లీల దోనయ్యను కలుసుకొని, తన పూర్వ స్నేహితుడైన పండితయ్య యోగక్షేమము లడిగెను. అదట దోనయ్యను నొక దీపవృక్షముపై నెక్కించి శ్రీగిరి జూడమనెను. ఆ చెట్టుపైనుండి దోనయ్యకు బర్వతమంతయు గనిపించెను వృద్ధమల్లయ్య తరువాత యదృశ్య మయ్యెను.

## పండితుని లింగైక్యము

యాత్ర ముగించుకొని దోనయ్య శైలము దిగి వెల్నటూరు నకు తిరిగివచ్చెను. పాదాభివందనమొనర్చి జరిగిన విశేషములన్నియు జెప్పెను. వృద్ధ మల్లికార్జునుడు తనను దలచినందుకు పండితయ్య పరమానందమొందెను. తనను ప్రమథ మండలిలో జేర్చుకొమ్మని వేడెను పండితారాధ్యులవారు, నాత్మ సంతతితో కులసతీ సమేతముగా లింగోదరమున లీనమైరి.

సకలభువన పావనుని యపూర్వ తనూజ కేదారయ్యకు లోకారాధ్య పట్టమునుగట్టి దోనయ్య భక్తిరాజ్యము నేలుచుండెను. కేదారయ్యకు మమమపండితుడు, భీమనపండితుడు, మహాదేవయ్య, చెన్నవిభుడు లను నలుగురు పుత్రులుగలరు. ఇక శైవసంతానములో ఇవటూరి సోమనాథయ్య, వారి పుత్రులు సూరీశ్వరుడు, లోకారాధ్య విశ్వనాథప్పయు, సింగణమంచి కలరు. వారినుండి గురుపరంపర తేజరిల్లె

## పండితుని జీవితము : పునఃపరిశీలన

### పుట్టుక

పండితునిది దక్షారామము జన్మదేశమని ఇతః పూర్వ చరిత్ర కారులు చెప్పినారు. కాని పండితుడు పుట్టినది శ్రీశైలమే.

దక్షారామ భీమేశుని పురోహిత శ్రేష్ఠుడైన భీమయపండితుడు శ్రీశైలమందు సంతానార్థమై పంచాక్షరీ పురశ్చరణ చేయుచున్న కాలమున నాతని భార్య గౌరాంబ గర్భమున శివుని సృష్టించినమూర్తి యవతరించెను. భార్యాభర్తలిరువురును తీర్థయాత్రా స్థలమున నుండుటయే సనాతన ధర్మము. కావున గౌరాంబకూడ తన భర్త సన్నిధిని శ్రీశైలములోనున్నది ఆమె యచ్చటనే గర్భము ధరించి శిశువును కన్నది. మల్లికార్జున పూజాఫలమగుటచే నాతనికి 'మల్లికార్జున' యని పేరు పెట్టిరి. గౌరాంబా భీమయపండితు లేమైరో తెలియదుగాని కుమారుడు తండ్రి గ్రామము దాక్షారామమునకు పండిత మల్లికార్జున నామముతో తిరిగివచ్చెను

"పండితు మల్లికార్జునుం డనంగ
సగణితు ప్రీతి దక్షారామమునను
జని"

కోటిపల్లి యారాధ్యుల వద్ద దీక్షను స్వీకరించెను. శివతత్త్వ సార కృతికర్తయగు మల్లికార్జున పండితుని తాను ప్రతిదినమును తలంచుకొనుచుండెడివాడనని పాల్కురికి సోమన అనుభవ సారమున కీర్తించి యున్నాడు ఈ కృతి త్రిపురాంతకమున వ్రాయబడినది. బహుశః బసవ పురాణము గూడా నచ్చటనే వెలసి యుండును బసవన కంటె పండితుని గూర్చియే సోమనకు తెలుసు అనుభవ సారమున స్తుతించుటకు కారణము పండితుడు శ్రీశైల ప్రాంతము వాడని యానాడు ప్రచారములో నుండి యుండును మరియు సోమ నాథుడు బెలిదేవి వేమనారాధ్యుల మనుమని శిష్యుడగుట చేతను, ఆ వేమనారాధ్యుల పండితుని కాలము వాడగుటయేగాక తెలంగాణము నుండి పోరండ్ల సూరసానమ్మతో దక్షరామమునకు వచ్చి పండితుని దర్శించెను పోరండ్ల కరీంనగర్ తాలూకాలోని 143 నెం. గ్రామముగా జనాభాశాఖవారు రిజిస్టరు చేసుకొన్నారు బెల్దేవి గ్రామము బలి గ్రామమై యుండెనా? వేరె గ్రామమేదై యుండును? అదియు తీరాంధ్రమునకు సంబంధించినది కాదు నేటి హైదరాబాదు నగరమున 'బెల్దేవి' వారని ఇంటిపేరు గల వణిక్ ప్రభువులు గలరు. వనిపురము వనపర్తి. మహబూబు జిల్లాలోని తాలూకా గ్రామము. వెల్గొండ మహదేవయ [పండితుని సమకాలికుడు]ది వెల్గొండ. ఆ గ్రామము పండితుడు నిర్యాణ మొందిన వెల్లటూరును మహబూబ్‌నగర్ జిల్లా కొల్లాపురము తాలూకాలో 64, 74 గ్రామ సంఖ్యలలో నున్నవి. పాలకుర్తి సోమన సినలైన తెలంగాణా ప్రాంతము వాడు. తానెన్నడు శ్రీశైల ప్రాంతముల జేరెనో తెలియదు అచ్చటనే పండితుని జీవిత విశేషములు సులభముగా సేకరించి యుండును.

పండితులు దాక్షారామము వచ్చుటకు తన తండ్రి యుద్యోగమే కారణమై యుండును.

## పండితుడు కర్ణాట బ్రాహ్మణుడు

కుంతల బనవాసి ప్రాంతము నుండి వానసవంశ బ్రాహ్మణులు తీరాంధ్రమున చేరుట మనకు నారాయణ భట్టు చరిత్ర తార్కాణము. ఇతడు రాజరాజ నరేంద్రుని కాలము వాడు. ఆ తరువాత క్రీ. శ. 1118 నుండి 1137 వరకు తీరాంధ్రమున పశ్చిమ చాళుక్య ప్రభుత్వమే. వానస బ్రాహ్మణ వంశీయుడగు అనంతపాల దండనాయకుడీ తీరప్రాంతమునకు తనతో బాటు యనేక బ్రాహ్మణులను తీసుకు వచ్చెను. అనంతపాలయ కుటుంబ సభ్యులే యెక్కువ రాచ పదవు లలంకరించిరి. మరియు కొండపల్లి రాజధానిగా చేసుకొని అనంత పాలయ ప్రభుత నెరపిన దినములలోనే శ్రీపతి పండితుడు బెడవాడ ఇంద్రకీలాద్రిపై నిప్పులు నూటకట్టెను. శ్రీపతి పండితుడు అనంతపాలుని యాస్థానియని చెప్పబడుటచే వాతడును వానసవంశీయుడగుటలో సందేహము లేదు. వీరి మాతృభాష కన్నడము. దేశము బనవాసి బనవాసియే తెలుగువ వానసయైనది.

పండితుడి తండ్రి భీమయ పండితుడు దక్షారామమున పురోహితుడు ఆనాడు దక్షారామము అనంతపాలయ యధికారము లోనిది పండితుడు తెలుగు దేశము నందు పుట్టుటచే తెలుగు వచ్చి యుండును

## పండితుడు — కర్ణాట భాష

పండితునికి బసవేశ్వరుడు విభూతి పంపకమునుపే కర్ణాటక భాష తెలియును దక్షారామమున నున్న రోజులలో లింగార్చన సమయమున పండితుడు శివ పంచస్తవములతో బాటు శంకర, ఆనంద గీతములు, బండారు బసవన్న భవ్యగీతముల బండారు బసవన్న ప్రాణేశుని బొగడినట్లు సోమన చెప్పినాడు చూ. దీక్షా. పుట

నేడు వైష్ణవులు, మాధ్వులు బైట తెలుగు మాట్లాడినను నింట తమిళ కన్నడ భాషలు మాట్లాడుకుటుంబములను జూచు చున్నాము. అయితే కన్నడమునందు కవిత్వ శక్తి కావలయునని కాబోలు పండితుడొక శిష్యుని బసవన వద్దకు పంపియుండును

## శివతత్త్వసారము

పండితుని శివతత్త్వసారము ముద్రితమైనది. అది అసంపూర్ణము. 489 పద్యములుగల కృతిని కొమర్రాజువారు పరిష్కరించిరి. ఇందు బసవన చివరిలీల విషమారగించుట వర్ణితమైనది మిగిలిన భాగమునం దేవిషయము లుండియుండునో తెలియదు. కంద పద్యమయమయిన నీ కృతియందు నొకమకుటము లేకపోవుటచేతను, పద్యసంఖ్య నూటికంటె దాటిపోవుటచేతను దీనిని శతకమనుటకు వీలు లేదు. దీనిని పండితు డెప్పుడెక్కడ రచించెనో చెప్పుట కష్టము. దక్షారామముననున్న పండితునికి బెలిదేవి వేమనారాధ్యులు వచ్చి చెప్పు వరకు బసవన్నను గూర్చి తెలియదు. బసవన్నను గూర్చి చెప్పిన పద్యములు గల శివతత్త్వసారము పండితుడు అంతకుముందు వ్రాయలేదని చెప్పవలసియున్నది. కాని సోమన వ్రాత దీనికి విరుద్ధముగా కాన్పించు చున్నది. "శివతత్త్వసార సంచిత కళావృద్ధి"ని శివుడే పండితునకు ప్రసాదించెనట. అది జన్మవృత్తాంత సందర్భమున దెల్పబడినది. ఆ తరువాత దక్షారామమున పండితుడు "వీరమాహేశ్వరాచార మార్గానుసారియై శివతత్త్వసార సత్కృతిని కేవల భక్తిగితి బ్రతిష్ఠించి యాదట దానును నట్లవర్తించుచున్నాడ"నియు, లింగార్చన సమయమున నాతడు శివతత్త్వసార సంచిత మహామహిమ 'శివతత్త్వసార'మనె శివకృతిని జదివెడినాడనియు సోమన చెప్పినాడు. ఇంతలో సూరసానమ్మ, వేమనారాధ్యులు పండితుని దర్శింపవచ్చి యాతని జంగమారాధన సచ్ఛీలమునకు నివ్వెరనంది బసవేశ్వర సదృశమూర్తిగా దలంచి బసవన చరితమును చెప్పదొడంగిరి. అందు బసవన విషాహార ప్రసక్తియును జెప్పిరి.

కావున పండితుడు ముందుగా శివతత్త్వసారమును రచించెనని సోమన చెప్పినమాట నమ్ముటకు వీలులేనిదిగా నున్నది. బహుశః పండితుడు శివతత్త్వసారమును వీలుగలిగినప్పుడెల్ల రచించుచు వచ్చెననియు సందువల్లనే మకుటమును, సంఖ్యయు మారెననియు చెప్పి సరి

పెట్టుకోవలసియుండును. శివతత్త్వసారమునకు కన్నడానువాదమో, అదియే మూలమో యనదగిన కృతి అసంపూర్తిగా ముద్రితమైనది.

## పండితుడు - వెలనాటి చోడుడు

పండితుడు చందవోలులో దర్శించినది రెండవ వెలనాటి చోడుడని [1161–1182] చెప్పుచున్నారు. గ్రంథములో వెలనాటి చోడుడనియే యున్నది కాని చందోలు కైఫీయతునందు

"వానస కులోద్భవులయిన శ్రీ మల్లికార్జున పండితారాధ్యుల వారు శ్రీశైల ప్రదక్షిణోచ్యకులై యీ మార్గాన చందవోలు వచ్చి శ్రీ పాండీశ్వరస్వామివారియొక్క ముఖమంటపములో వుండివున్నం దున శ్రీమన్మహా మండలేశ్వర కొండ పడమటిబుద్ధరాజులుంగారి గుర్వు బవుధ మతానుసరణ శాస్త్ర ప్రవీణుడై యిక్కడనె వుండినారు గన్క."

యని యున్నది. వెలనాటిచోడు డేవిధముగా శివద్వేషికాదు అట్లనుట మహాపాపము. ఆతడు దక్షారామ భీమేశ్వరుని కొనర్చిన కైంకర్యములే చాలు చోడుని శివదీక్షాపరత్వమునుపట్టి తెల్పు చున్నది. సోమనాథుడు వివి వ్రాసినదికాని వాస్తవ సంఘటనయైనట్లు తోచదు. పండితుని కళ్లలో జీడిపోయించినది బుద్ధరాజని విశ్వసించు టయే యుక్తము. బుద్ధరాజు చోడుని బావమరది. ఇతని శాసనము లున్నవి

కాని చందవోలులో ఈ వాదన జరిగి యుండెనని చెప్ప చిన్నయాధారము కన్పించినది మహిమ ప్రకరణములో గురువును చంపుటకు

'దిట్టమై దేమయ దేవయలపుడు
గట్టుగ్రలీల గంకణములు గట్టి'

బౌద్ధగురువును నాతని మందిరమున జంపిరి.

ఆ రేమయ దేవయలు నాటి శాసనమున కన్పడుచు
స్వస్తి శ్రీ శకవర్షంబులు ౧౦౮౫ అగునేంటి ఉత్తరాయన సం
నిమిత్యమున శ్రీమన్మహా మండలేశ్వర కులోత్తుంగ రాజేం
రాజులను ధర్మార్థముగా నాదిండ్ల శ్రీ కేశవదేవరకు రెండు దీ
లకు...ముపాటి బీరనాము దోనయ రేమనలు ఆచంద్రార్క
(ద. హిం. శా. సం 4 నెం 689) దీని కాలము క్రీ. శ. 11
గ్రంథమున ప్రయుక్తులయిన రేమయ దేవయలే శాసనమున ద
రేమనలయి యుందురు. తిక్కన బయ్యనలకు మారుగా
బయ్యనలు కనబడుతున్నారుగదా!

## కల్కొడి–కల్వెన్న

పండితుడు పానుగల్లులో ఉదయావళిశు శపించి, 
విడిచినప్పుడు

"మహిత పండిత మల్లికార్జునుడు
వెదవిప్పి యొకరి వేడుకగ వెనుక
సిక్కు యంబును బాపెరంత గల్ప్సెప్పి
నక్కలో కొజ్జని కూడి కల్పోయిడి" (మహిమ)

యని యున్నది ఈ విషయము శాసన మందిట్లున్నవి

నల్గొండ తాలూకాలోని బల్లాల గ్రామం పొలిమేర అరిగి పోయిన స్తంభముమీద చెక్కిన శాసనము ఇది కందూరి మల్లికార్జున చోడునిది శాసన కాలము క్రీ. శ 1097.

వున్నాగస్తాం బ్రమాద్యోపే మునలమయో చోడవంశ్యా [ ]
వుప్పొన్నాబ్యాం కిం మనుజవతిం సంకయేషు వ్యసక

(ఎపిగ్రాఫియా ఆంధ్రికా సం 4 వుట 60 డా పి వి పరబ్రహ్మశాస్త్రిగారి సంపాదితము)

## ఆరాధ్యులు

తెలుగు దేశమునను్న యారాధ్యుల పుట్టుపూర్వోత్తరము లెరుగుటకు సోమనాథుని గ్రంధములే పరమ ప్రామాణికములని ప్రత్యేక ముగా చెప్పనక్కరలేదు శ్రీపతి పండితుడు, శివలెంక మంచన, మల్లి కార్జున పండితారాధ్యులు, ఇవటూరి సోమనాథయ్య, రెంటాల మల్లి నాథయ్య, బెల్దేని వేమనారాధ్యులు మనకు సోమనాథుడు తెలిపిన ఆరాధ్య పురుషులు. వీరి నామములు గృహనామములుగా నున్నవారు నేడు తెలుగు దేశమున విస్తరించియున్నారు. కాశీనాథునివారు, ముదిగొండ, తాడికొండ, కొడిమెల, కొంపల్లి, చాగంటి మొదలయిన లింగధారి కుటుంబములు నేడున్నవి గాని వానిపేర్లు సోమనాథు డెత్తలేదు. ద్వాదశారాధ్య సంప్రదాయమును సోమన తడవలేదు. పంచాచార్యుల ప్రసక్తి సోమన తేలేదు. నన్నయకాలమున ఆరాధ్య బ్రాహ్మణులున్నట్లు సమకాలీన నిదర్శనములులేవు. వెలనాటి చోళుల కాలమునుండి ఆరాధ్య శాఖవారి వివరములు తెలియుచున్నవి.

బసవేశ్వరుని యావిర్భావము వలన తెలుగు దేశమున శుద్ధ శైవము విజృంభించినది. శుద్ధ భక్తిమార్గమును శివతత్త్వసార మున పండితుడు ప్రవచించినాడు.

శివలెంక మంచెనకు తెలుగు దేశములో కంటే కర్ణాటకమున ప్రచారమధికము. మంచెన తండ్రి తాతలు కాశీవాసులు.

పండితత్రయమని సోమనచే కీర్తింపబడిన వారు క్రీ. శ. 12 శతాబ్దము వారు అంతకు ముందు కర్ణాటాంధ్ర దేశముల యందు యారాధ్యులే కన్పట్టరు. ఒకవేళ కన్పట్టినను వారు కాలాముఖ గురువులు.

## అనుబంధము — పండితారాధ్య చరిత్ర ముద్రణలు

శ్రీ శివాయనమహః శ్రీమాన్ జగద్గురు మల్లికార్జున శ్రీ పండితారాధ్య చరిత్ర. శ్రీ మదష్ట భాషాసుకవిత్వ రచనా బిరుదాంకితులగు పాల్కురికి సోమనాథారాధ్య కవిచే రచింపబడినది ఇది మ॥రా॥ నిడుదవోలు సుందరం పంతులవారి చేతను, శ్రీగిరి, శ్రీగిరి దిగంబర మల్లికార్జున స్వాములవారి సేవకుడగు చింతకుంట పసపుల నాగయ్యగారి చేతను పలుడు ప్రతులను చూచి సవరింప బడినది. శ్రీ విజయరామచంద్ర ముద్రాక్షర శాలయందు ముద్రిం పించి ప్రకటింపబడియె. విశాఖపట్నం. 1914 ఆనంద సం॥ఆషా॥ భా॥ 13 సోమవారం.

కర్నూలు జిల్లా సిరుగుప్ప తాలూకా పెదచింతకుంట గ్రామ నివాసి వయస్య రత్నాకరుండగు పసుపుల పుట్టయ్య శెట్టిగారి కుమారులు నాగయ్యగారు వీరు శ్రీగిరి షణ్మత స్థాపనా చార్యులగు దిగంబర మల్లికార్జున స్వాముల సేవకుడు. ఎడకల్లు వీరయ్యగారికి ముఖ్య శిష్యుడు. శ్రీ మహేశ శతక రచయిత ఎడకల్లులో ఏటి తూర్పున గుడిమెరాం మఠములోని పద్మశాల వీరయను యోగి ఊతని గురువు.

కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు శ్రీ గిడుగు రామమూర్తి గారికి పండితారాధ్య చరిత్ర పరిష్కరణ పని అప్పగించిరి. కాని రామమూర్తి పంతులుగారు డాక్టరు. చిలుకూరు నారాయణరావు గారు, రామమూర్తి పంతులుగారి కుమారుడు సీతాపతిగారు కలిసి కొంత పరిష్కరణను చేసిరి. తరువాత పని భారమును శిష్యులైన చిలుకూరి నారాయణరావు గారికే లప్పగించిరి. నారాయణరావుగారు మూడేండ్లు కష్టపడి లమ్ముప్రతిని సిద్ధము చేసి నాగేశ్వరరావు గారికి పంపినారు చి॥నా॥ గారు మహిమ పర్వత ప్రకరణములను ఒంటిగా సంస్కరించిరి. నాగేశ్వరరావు పంతులుగారు అచ్చు వెంటనె ప్రారం భించిరి కాని గ్రంధ స్వరూపమును కళ్ళార చూడకయే శివైక్యము చెందిరి. 1939 ఏప్రిల్ నెలలో తమ మామగారి సంకల్పమును సఫలము చేయవలెనను దృఢమైన పట్టుదలతో శ్రీ శివలెంక శంభుప్రసాదు గారు నారాయణరావు గారిని చిన్న పీఠిక వ్రాయుమని తలవిచ్చిరి. అట్లయినను ఆంధ్ర సాహిత్యములో అచ్చుపడ్డ ప్రాచీ నాంధ్ర గ్రంధములలో విపుల విస్తార విషయ సంభృతమగు పీఠికను నారాయణరావుగారు వ్రాసిరి. ప్రధాన గ్రంధము 713+554=1267. నారాయణరావుగారి ఉపోద్ఘాతము 348+అనుబంధము 197=545.

1939 డిశంబరు నెల 4వ తేదీకి అచ్చు పూర్తి అయినది. కీ॥శే॥ డా॥ చి॥నా॥ గారు1939లో పరిష్కరించిన ఆంధ్ర గ్రంధమాల ప్రతి 1974 లో పునర్ముద్రణ చేయబడినది. దీనికి మధురై విశ్వవిద్యాలయము తెలుగు ప్రొఫెసరు, సుప్రసిద్ధ పండితులు శ్రీ॥ టి॥ కో॥ గారు 21 పుటల పీఠికను వ్రాసిరి.



దాసరి నారాయణరావు
భాగ్యలక్ష్మి క్రియేషన్స్
దీపారాధన
ఈస్ట్‌మన్‌కలర్
నిర్మాత:
నన్నపనేని సుధాకర్
సంగీతం:
చక్రవర్తి
ఫోటోగ్రఫీ:
కె.యస్.మణి
FILM BUSINESS
DWADAKA

# తొలి దినావసానము

శ్రీ వసంతరావు వేంకటరావు

నిను మున్నెన్నడొ గాంచి నేటికి గతిం
　　చెన్ వత్సరార్ధమ్ము, ఆ
గని కాలమ్మెటు వంటి మార్పు కలుగం
　　గా జేసెనో ఇందు ? యౌ
వన సామ్రాజ్య విలాస లాలస మహా
　　భాగ్యంబు చేకూర త
ద్ఘన భారంబు వహించి రాజ్యరమ చే
　　తన్ బట్టగా కార్య సా
ధన దీక్షైక నిమగ్న మానసము మా
　　త్న జ్యోత్స్నలం జల్లి చే
కొను మంచెంతయు అంగసౌష్ఠవము నీ
　　కుం గూర్చెనో! అప్పరాం
గనవేమోయని సందియం బొదవునో
　　కన్నెత్తి వీక్షింపగా?
అని చింతాకుల మానసుండనయి కొం
　　డంతాశతో చెచ్చెరన్
జనుదేరన్ తొలి వాసరమ్మునవె ఆ
　　శా భంగమ్మై, పొంగి పొం
గి నిరాటంకముగా యథేచ్ఛగ భవత్
　　స్నేహంబు రూపావలో
కన భాగ్యంబు తదేక భోగమొకటే
　　కాంక్షించి పర్వెత్తు చుం
డిన వాంఛాని చయమ్ము కూలబడి కిం
　　చిత్ ప్రయ్యలయ్యెన్; నిరా
శ నిరుత్సాహము చేతకాని తనమున్
　　సంకెళ్ల వోలెన్ మన
మ్మును బంధించి వియోగ తాపమును జీ
　　మూత గృహంబందు త్రో
చిన చందంబు ఘటిల్లె, కోర్కెలిక ని
　　శ్శేషంబుగా మాయ మౌ
నను భీతావహము పుట్టె, పుష్కలముగా
　　వ్యాపించె ముచ్చెమ్మటల్;
కను లందశ్రు కణమ్ములూరి నిలువె
　　ల్లం కంపమొందించె, మె
ల్లం చైతన్యము వీడె, నిర్మల మనో
　　ల్లాస ప్రవాహంబునన్
కనికార మ్మిసుమంత లేక విధి కొం
　　డన్ ద్రోచినట్లయ్యె; ఆ
దిన మేనాడు తలంప దుర్భర మనో
　　ద్రేకంబు కల్గింపదే!

# దుర్మతీ !

శ్రీ బులుసు వేంకటేశ్వరులు
(కాకినాడ)

దుర్మతి నామ వత్సరమ! దుర్మదనాశక! స్వాగతంబు. స
 త్కర్మము లాచరింపుమయ! దైవత మన్నను కాలమన్న నీ
ధర్మమయ స్వరూపమె కదా! పయికిం గనుపట్టెడున్ భవ
ద్దుర్మతినామ మెంతయును దుష్టముగా నది సత్యమౌనొకో?

'పేరు గొప్ప కాని ఊరు దిబ్బ' యటన్న
పలుకు నీ యెడలను నిలువఁబోదు
'నేతిబీఱకాయ' నీ చంద మెప్పుడుఁ
గాదు నాకుఁ దెలియు నీదు మహిమ.

దుర్మతులకు దుర్మతి వయి
నిర్మలతన్ విడువఁబోక నిరుపమ కరుణన్
ధర్మమ్మును నలుగాలను
మర్మము మాయయును లేక మహి నిల్పుమయా!

ఉన్నతకీర్తి గన్న భరతోర్వియె నేఁడు భయంకరస్థితిన్
గన్న దుచ్ఛదాహ మధికారమునన్ బ్రతివాని కక్కటా?
ఎప్పుడు? కన్నదా? మునుపు విశ్వయశంబును గన్నదేశమే
ఛిన్నము భిన్న మయ్యెను సుశీలురకున్ గఱ వయ్యె నెయ్యెడన్.

కొందల మర్థకామములకే యెగఁబ్రాకుచు నున్నవారు దు
ర్భావులు ధర్మమోక్షములు వార లెఱుంగరు చిత్రమయ్యెడున్
పావన భారతావనిని పాడొనరించెడు దుర్మదాంధులన్
నీ విఁక దుర్మతీ! నిలిపి నిస్తుల శిక్షను బ్రోవు దేశమున్.

ఋషుల పవిత్రదేశ మిది హీనగుణంబుల కాకరం బి దే
విషయమునందునైన ననిపింపఁగ రాదు ప్రపంచ శాంతికిన్
విషమత రూపుమాపుటకు వేయి ప్రయత్నము లాచరింపనౌ
విషపు దురూహలన్ దొలఁచి విశ్వముఁ బ్రోవుము నీవు దుర్మతీ!

కాలదేవతవైన నీలీల లివ్వి
యెవరి నేమనఁగందుము? భువి నెవరికి
నించుకైన స్వతంత్రత యేది? కీలు
బొమ్మలము మేము రక్షింపఁబూను నీవె.

దుర్మతీ! ఈ యుగాది సంతోషసమయ
మందు మాకిమ్ము ప్రవిమలానంద మెందు
శుభములు సుఖంబులున్ బ్రేమసూచకముగ
చెప్పుకొందుము నీపేరె యెప్పటికిని.

# స్వాగతం!!

శ్రీ బులుసు వేంకటేశ్వర్లు
(అంకలపాలెం)

రావే! నవ్యఉగాది! జీవన రసార్ద్ర స్నేహ పాదోధి! మా
భావంబుల్ పులకింపగా మధుర కావ్యశ్రీ రసాభ్యంచిత
ప్రావీణ్యంబున పల్కు స్వాగతము సంభావింపవే! కోకిలా
రావంబుంబలె నింతకున్ శ్రవణ పర్వంబై వినుం గొల్పెడిన్!!

ప్రతియేడాదినవావతార మహిమన్ భాసించి నవ్యోత్సవ
శ్రుతులన్ విన్చి – చిరంతనామృత మహస్సుల్ – భావి సౌఖ్యాగత
స్మృతులన్ మాయెదలందు జల్లెదవు సమ్మోదంబు నిండింతువో
యతిసౌందర్య వసంతకాంతి!! కొనుమా యర్ఘ్యమ్ము పాద్యమ్ములన్!!




**Printed and Published for Nageswara Rao Estate (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor S. Radhakrishna, Vijayawada. Phones : 75667 & 61247.**

శ్రీరస్తు — శ్రీ త్రిపురసుందరీ పరశివాభ్యాం నమః

# శ్రీ దుర్మతి నామ సంవత్సర పూర్ణశాస్త్రీయ (ఆంధ్రపత్రికా) పంచాంగమ్

బ్రహ్మశ్రీ శ్రీమత్పిడపర్తి సుబ్రహ్మణ్యశాస్త్రిణః పుత్రాభ్యాం
శ్రీ కాంచీ కామకోటి పీఠ సంస్థానాऽऽస్థాన సిద్ధాన్తిభ్యాం
"దైవజ్ఞ చిన్తామణి" శ్రీ చినకృష్ణమూర్తి శాస్త్రి, "భాషాప్రవీణ" శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిభ్యాం ప్రణీతమ్
సహరచయితారశ్చిరంజీవినః శ్రీ పూర్ణకల్యాణవీరభద్రశర్మా - శ్రీ వీరేశ్వరశాస్త్రి ప్రభృతయశ్చ

విఘ్నేశ విధిమార్తాండ చంద్రేంద్రోపేన్ద్ర వందిత నమో గణపతే తుభ్యం బ్రహ్మణాం బ్రహ్మణస్పతే
వేదమయీం నాదమయీం బిందుమయీం వరవదోద్య దిందుమయీం
మంత్రమయీం తంత్రమయీం ప్రకృతిమయీం నౌమి విశ్వవికృతిమయీం.

## సంవత్సర ఫలము

ఈసంవత్సరమునరాజు, సేనాధిపతి, అర్ఘాధిపతి, మేఘాధిపతిసూర్యుడు. మంత్రి చంద్రుడు. సస్యాధిపతి, నీరసాధిపతి గురుడు. ధాన్యాధిపతి కుజుడు. రసాధిపతి శని ఇట్లు నవనాయకులలో 3 ఆధిపత్యములు, 30 ఆధిపత్యములలో 15 అధిపత్యములు శుభులకయినవి సర్వ సస్య సముదాయమగు 16 వీసములలో 11 వీసముల పంట ఫలించును. తొలకరి పంటలు విశేషముగా ఫలించును పశు పాలకుడు, దొడ్డి నుండి విడిపించువాడును యముడు. దొడ్డిపెట్టువాడు బలరాముడు రెండు కుంచముల వర్షము వత్సరాది ప్రభృతి వైశాఖ శు॥ శనివార పర్యంతం బ్రాహ్మణ యువకుని హస్తమందును, తదాది జ్యేష్ఠ బ 30 బు॥ ప॥ బ్రాహ్మణబాలునిహస్తమందును, తదాది ఆశ్వయుజ శు ౧౧ సోమ॥ ప॥ బ్రాహ్మణయువకుని హస్తమందును తదాద్యావత్సరము వృద్ధబ్రాహ్మణుని హస్తమందును కుంచముండును. పశువుల కారోగ్యము తగ్గను క్షీరము తక్కువ. ఎర్ర భూములు, ఎర్ర సస్యములు పుష్కలముగ ఫలించును. దేవమాతృకలు విశేషముగా ఫలించును అషాఢ బ30 స్థా



సూర్యగ్రహణము విజయవాడ, రాజమండ్రి ప్రాంతములకు లేదు హైదరాబాదుకు 1/100 గ్రాసము పౌష శు౧౫ఖచ్చన్న చంద్రగ్రహణం ఆశ్వయుజ 30 బస్థా మంగ॥ కావేరీనదీ పుష్కర ప్రారంభము రాబోవు దుందుభి సంవత్సరమున ఆశ్వయుజ (సంసర్ప) అధిక మాసము పౌష మాఘ యుగళీభూత (అంహస్పత్య) క్షయ మాసము ఫాల్గుణమధిక మాసము సంభవించును

## మౌఢ్యాదికములు

వత్సరాది ప్ర॥ వైశాఖ శు౧మంగళ॥ ప॥ శుక్ర మౌఢ్యము ప్రారంభ బ ౧౨ఆ॥ ప్ర॥ ఆశ్వయుజ బ30స్థా మంగళ॥ ప॥ గురుమౌఢ్యము పౌష బ ౮ ఆది॥ ప్ర॥ పౌష బ ౧౩ శని॥ ప॥ తిరిగి శుక్రమౌఢ్యము

## శకములు

| | |
|---|---|
| కల్యాద్యబ్దాః ౫౦౬౧ | శాలివాహన శకః ౧౮౮౩ |
| ఫసలీసన్ ౧౩౭౯-౮౦ | హిజరీసన్ ౧౩౮౦—౧౩౮౧ |
| క్రీస్తు శకః 1981—82 | భారత స్వాతంత్ర్య శకః 34-35 |

## ఆంధ్రపత్రికా కార్యాలయము, గాంధీనగరం, విజయవాడ - 3

### పంచాంగ పద్ధతి వివరణము

ఇందు కాలమానము యథాప్రకారముగా విజయవాడ, గుంటూరు, ఏలూరు మొదలగు ఆంధ్ర ప్రదేశ్ మధ్యభాగమునకు చూపబడినది. తిథి, నక్షత్రములు ఘటికలలోను, గంటలలోను కూడ చూపబడినవి. శుభ ముహూర్తములు—దుర్ముహూర్తములు—వర్జ్యములు—మహాపాతలు గంటలలో మాత్రం చూపబడినవి. యోగకరణ, అమృత, గ్రహ ప్రవేశములు ఘటికలలో మాత్రం చూపబడినవి భారత ప్రభుత్వముచే నియమింపబడిన కాలెండరు రిఫారమ్ కమిటీవారి నిర్ణయము ననుసరించి ప్రకటింపబడిన ఇండియన్ ఎఫెమెరీసు అండ్ నాటికల్ అల్మనాక్కునకు సరిపడునట్లు చూపబడినవి. నూతన వేధశాలల యందు కనుగొనబడిన భూకేంద్రమునకు సరిపడు వాస్తవిక రవి చంద్రులచే సాధింపబడిన తిథ్యాధికము, సరిపడుచున్నవి ఇందు తిథ్యాది, ఘటికలు, ఉదయాస్తమయములు, శుభ ముహూర్తములు, దుర్ముహూర్తములు, లగ్నాంతకాలములు, విజయవాడ, గుంటూరు, ఏలూరు ప్రాంతములకు చూపబడినవి నిరయణ స్ఫుటగ్రహములు ఇండియన్ స్టాండర్డుటైము ననుసరించి గం 5-29 ని లకు చూపబడినది దేశాంతర చక్రములును చూపబడినవి ఇందు వేదాంగ జ్యోతిషమున సూచింపబడిన అశ్విన్యాదిని గ్రహించి ఈ పంచాంగ రచన చేసియున్నాము గావున వైదికము సనాతనము గూడ యగుచున్నది 10 అక్షాంశ లగాయతు 30 అక్షాంశ వరకు లగ్న ప్రమాణములు యివ్వబడినవి శాస్త్రమునకు ప్రత్యక్షమునకు సముచితమై యొప్పు. ఈ పంచాంగమును గ్రహించి శ్రౌతస్మార్త కర్మల

## తిథ్యాదికమునందు దేశాంతర చక్రము

| | చైత్ర మేష | వైశాఖ వృషభ | జ్యేష్ఠ మిధున | ఆషాఢ కర్కాట | శ్రావణ సింహ | భాద్ర కన్యా | ఆశ్విజ తులా | కార్తీక వృశ్చిక | మార్గశిర ధను | పౌష మకర | మాఘ కుంభ | ఫాల్గు మీ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| సూరు | —౩౯ | —౪౯ | —౫౬ | —౫౯ | —౫౬ | —౪౯ | —౩౯ | —౩౦ | —౨౩ | —౨౦ | —౨౩ | —౩ |
| గుల్బారు | —౩౦ | —౩౭ | —౪౪ | —౪౮ | —౪౪ | —౩౭ | —౩౦ | —౨౨ | —౧౬ | —౧౪ | —౧౬ | —౨ |
| ంతపురం | —౩౦ | —౩౪ | —౩౮ | —౩౯ | —౩౮ | —౩౪ | —౩౦ | —౨౬ | —౨౩ | —౨౧ | —౨౩ | —౨ |
| ళ్ళారి | —౩౮ | —౪౦ | —౪౩ | —౪౪ | —౪౩ | —౪౦ | —౩౮ | —౩౪ | —౩౨ | —౩౧ | —౩౨ | —౩ |
| స్నాలు | —౨౬ | —౨౮ | —౨౭ | —౨౯ | —౨౭ | —౨౮ | —౨౬ | —౨౪ | —౨౩ | —౨౨ | +౨౩ | —౨ |
| దరాబాద్ | —౨౧ | —౨౦ | —౧౭ | —౧౭ | —౧౭ | —౨౦ | —౨౧ | —౨౩ | —౨౫ | —౨౫ | —౨౫ | —౨ |
| ంగల్లు | —౧౦ | — ౮ | — ౪ | — ౩ | — ౪ | — ౮ | —౧౦ | —౧౩ | —౧౬ | —౧౮ | —౧౬ | —౧ |
| ుపతి | —౧౩ | —౧౯ | —౨౪ | —౨౮ | —౨౪ | —౧౯ | —౧౩ | — ౮ | — ౨ | + ౦ | — ౨ | — |
| ళ్లూరు | — ౬ | —౧౧ | —౧౪ | —౧౬ | —౧౪ | —౧౧ | — ౬ | — ౨ | + ౨ | + ౪ | + ౨ | |
| ంభకోణం | —౧౨ | —౨౪ | ౩౪ | —౩౭ | —౩౪ | —౨౪ | —౧౨ | — ౦ | + ౯ | +౧౩ | + ౯ | — |
| ంచీపురం | — ౯ | —౧౮ | —౨౪ | —౨౬ | —౨౪ | —౧౮ | — ౯ | — ౧ | + ౬ | + ౭ | +౬ | — |
| దాస్ | — ౪ | —౧౧ | —౧౮ | —౨౦ | —౧౮ | —౧౧ | — ౪ | + ౪ | +౧౦ | +౧౨ | +౧౦ | + |
| దాచలం | + ౩ | + ౫ | + ౮ | + ౭ | + ౮ | + ౫ | + ౩ | + ౦ | — ౨ | —౩ | — ౨ | + |
| దరు | + ౫ | + ౫ | + ౪ | + ౪ | + ౪ | + ౫ | + ౫ | + ౬ | + ౮ | + ౮ | + ౮ | + |
| మండ్రి | + ౧౧ | +౧౩ | +౧౩ | +౧౪ | +౧౩ | +౧౩ | +౧౧ | +౧౦ | + ౯ | + ౯ | + ౯ | +౧ |
| యనగరం | + ౨౭ | +౩౨ | +౩౪ | +౩౬ | +౩౪ | +౩౨ | +౨౭ | +౨౪ | +౨౧ | +౨౦ | +౨౧ | +౨ |
| హంపురం | + ౪౨ | +౪౭ | +౫౩ | +౫౫ | +౫౩ | +౪౭ | +౪౨ | +౩౬ | +౩౧ | +౨౯ | +౩౧ | +౩ |

### సూచన

విజయవాడ నుండి భారత ప్రభుత్వము వారిచే నిర్ణయింప బడిన చైత్రాది మాసారంభము (అనగా మేషాది సాయన మాసారంభము). ందు కలుగు దేశాంతర విఘటికలు యీ పై చక్రమునందు చూపబడినవి స్వగ్రామమునకు సమీపమందున్న పట్టణమునకు అభీష్ట మాసాదియంద విఘటికలను యీ చక్రముననుసరించి విజయవాడకు పశ్చిమ దేశములయందుండు వారు యీ పంచాంగ మందలి తిథ్యాదులలో తీసివేయగావ గ్దేశములవారు కలుపగాను స్వస్థానమునకు సూర్యోదయాది తిథ్యాది కాలము అగుచున్నవి యీ విజయవాడ యామ్యోత్తర రేఖకు సమీపమందుగ ణోత్తరదేశముల వారు ఇందు ఆయా స్థానములలో చూపిన + ధన — ఋణ చిహ్నలను గుర్తించి సంస్కరించుకొన వలయును. ఇందుచూపిన విఘ లు మాసాదియందు చూపబడినవి. మాసమధ్యయందు త్రైరాశికముచే దేశాంతరమును గ్రహించి సంస్కరించినచో సూర్యోదయాది స్పుటతిథ్యా ములగును ఇష్టగ్రామమునకు సూర్యోదయ గంటలు పై ప్రకారము దేశాంతర విఘటికల కగు నిమిషములను ఈ విజయవాడ కగు సూర్యోదయ టలలో ధనఋణ చిహ్నలకు వ్యత్యస్తముగా (అనగా విజయవాడకు పశ్చిమ దేశమందుండు వారు కలుపగను, ప్రాగ్దేశవాసులు (తీసివేయ గను) సంస్క చిన యెడల స్టాండర్డ్ టైము ననుసరించి ఇష్ట గ్రామమునకు సూర్యోదయ గంటలగును; ఈ ప్రకారము సూర్యాస్తమయ కాలమును చేయరాదు.

## లగ్నాంతకాలములయందు దేశాంతర చక్రము

| | మీన | మేష | వృష | మిధు | కర్క | సింహ | కన్య | తుల | వృశ్చి | ధను | మక | కుంభ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| పూరు | +19 | +22 | +24 | +23 | +20 | +17 | +13 | +10 | + 8 | + 4 | +11 | +15 |
| గుళూరు | +14 | +17 | +19 | +18 | +16 | +13 | +10 | + 7 | + 5 | + 6 | + 8 | +11 |
| ంతపురం | +13 | +15 | +15 | +15 | +14 | +12 | +11 | + 9 | + 2 | + 9 | +10 | +11 |
| ళ్ళారి | +16 | +17 | +17 | +17 | +16 | +15 | +14 | +13 | +12 | +13 | +13 | +15 |
| స్నాలు | +11 | +11 | +12 | +11 | +11 | +10 | +10 | + 9 | + 9 | + 1 | +10 | +10 |
| దరాబాదు | + 8 | + 7 | + 7 | + 7 | + 8 | + 8 | + 9 | +10 | +10 | +10 | + 9 | + 9 |
| ంగల్లు | + 3 | + 2 | + 3 | + 1 | + 2 | + 4 | + 5 | + 6 | + 7 | + 6 | + 5 | + 4 |
| ుపతి | + 7 | + 9 | +11 | +10 | + 8 | + 6 | + 3 | + 1 | — 0 | + 0 | + 2 | + 5 |
| ళ్లూరు | + 4 | + 5 | + 6 | + 6 | + 5 | + 3 | + 1 | — 1 | — 1 | — 1 | + 0 | + 2 |
| దరాస్ | + 4 | + 6 | + 8 | + 7 | + 5 | + 2 | + 1 | — 4 | — 5 | — 4 | — 2 | + 1 |
| ంభకోణం | + 9 | +13 | +15 | +14 | +11 | + 6 | + 1 | — 3 | — 5 | — 4 | — 1 | + 4 |
| ంచీపురం | + 6 | + 9 | +10 | +10 | + 7 | + 4 | + 1 | — 2 | — 3 | — 3 | — 0 | + 3 |
| దాచలం | — 2 | — 3 | — 3 | — 3 | — 2 | — 1 | — 0 | + 1 | + 1 | + 1 | + 0 | — 1 |
| దరు | — 2 | — 2 | — 2 | — 2 | — 2 | — 2 | — 2 | — 3 | — 3 | — 3 | — 3 | — 2 |
| జమండ్రి | — 5 | — 5 | — 5 | — 5 | — 5 | — 5 | — 4 | — 4 | — 4 | — 4 | — 4 | — 4 |
| యనగరం | —12 | —14 | —14 | —14 | —13 | —12 | —10 | — 9 | — 8 | — 8 | — 9 | —11 |
| హంపురం | —19 | —21 | —22 | —22 | —20 | —17 | —15 | —13 | —11 | —12 | —14 | —16 |

ఇందు చూపబడిన లగ్నాంతకాలములు స్టాండర్డు టైము ననుసరించి విజయవాడకు లగ్నాంతకాలము అగుచున్నవి. ఇతర దేశముల వారు చూపబడిన దేశాంతర చక్రము ననుసరించి, ఆయా లగ్నాంత కాలములకు చూప బడిన నిమిషములను, విజయవాడకు పశ్చిమదేశమున మండువారు కాలములలో కలుపగాను, ప్రాగ్దేశములయందుండువారు తీసివేయగను, స్టాండర్డు టైముననుసరించి ఇష్టమగు నాయానగరములకు లగ్నాంత కాలము అగును. తిథులలో ప్రతిమాసము దిగువను ప్రతిరోజున లగ్నాంత కాలములు చూపబడినవి.

{ సంవత్సరాదికి 23°-35'-26" అయనగతి 50", 26

# ఆంధ్రప్రదేశ్ - భారతదేశముల సౌభాగ్యములు

| మి | వృ | మే | మీ |
|---|---|---|---|
| | | ర. చం కు. శు | బు |
| | వర్ష లగ్న కుండలి | | కే |
| రా | | | ల |
| | శ గు | | |

| మి | వృ | మే | మీ |
|---|---|---|---|
| | | ర కు బు. శు | |
| | జగల్లగ్న కుండలి | | కే |
| రా. చ | | | |
| | గు శ | ల | |

వర్షలగ్నా పేక్షయా లగ్నధనాధి పతియగు శని తృతీయ వ్యయాధి పతియగు గురునితో కలిసి దశమ కేంద్రమందుండి రవి, చంద్ర, కుజ శుక్రులచే జూడబడుచుండెను ద్వితీయమున కేతుస్థితి. తృతీయమున షష్ఠభాగ్యాధిపతియగు బుధుడు నీచస్థితి అష్టమాధి పతియగు రవి సప్తమాధిపతి చంద్రుడు పంచమ రాజ్యాధిపతియగు శుక్రుడు వాహన లాభాధిపతియగు కుజుడు చతుర్థ మందుండి తృతీయ వ్యయాధి పతియగు గురుని చేతను లగ్న ధనాధిపతియగు శని చేతను చూడబడుచుండెను. అష్టమమున రాహుస్థితి జగల్లగ్నా పేక్షయా లగ్న షష్ఠాధిపతియగు కుజుడు స్వక్షేత్రవర్తియై షష్ఠమున నుండి భాగ్యాధిపతియగు రవితోను, అష్టమ లాభాధిపతియగు బుధునితోను సప్తమ వ్యయాధిపతియగు శుక్రునితోను కలిసి షష్ఠమున నుండెను ధన పంచమాధిపతి యగు గురుడు తృతీయ వాహనాధిపతియగు శనితో కలిసి వ్యయ మందుండి రవి-కుజ-బుధ-శుక్రు లచే జూడబడుచుండెను. వాహనమున కేతుస్థితి. భాగ్యాధిపతియగు చంద్రుడు రాజ్యమున రాహువుతో స్థితికలిగి యుండెను.

ఇట్లు పర్యాలోచనము చేయగా పాలకవర్గము నందభిప్రాయ భేదములు కలుగుచున్నను సుస్థిరముగా నుండగలదు. రాష్ట్ర ప్రభుత్వము విద్యా పరిశ్రమల పట్ల అభివృద్ధికరమైన కార్యకలాపములు చేపట్టుచున్నను భాగ్యాధిపతి నీచస్థుడగుటవలన కోరినంత సౌకర్యము కలుగజేయుట కష్టము. కేంద్ర ప్రభుత్వముతో పరిపాలన కలుగుటకు నాంది సూచనలున్నవి. ధరవరల వడుదుడుకులను పెట్టుటకు ప్రయత్నించినను కృతకృత్యులగుటకు శ్రమపడవలసియున్నది రాజ్యాధిపతి యగు శని యుచ్చస్థితుడై యున్నను బుధ శుక్రుల యోగము వలన ప్రజలలో ప్రజాభి మానము కలిగియున్నను లగ్నాధిపతి యోగము చేతను-గురువీక్షణము వలను సుస్థిరముగా నుండి ప్రపంచ రాజ్యములలో మేలుబంతిగా నుండును.

| | | | | |
|---|---|---|---|---|
| 1981 వైశాఖ శు ౮ సోమ 11-5-81 | రా గం 6-33 | కృత్తికకార్తె-సాధారణ వృష్టి |
| బ ౫ ఆది 24-5-81 | రా గం 2-54 | రోహిణికార్తె-సామాన్య వృష్టి |
| జ్యేష్ఠ శు ౬ ఆది 7-6-81 | రా గం 12-44 | మృగశిరకార్తె-సువృష్టితుల్య |
| బహు ౪ ఆది 21-6-81 | రా గం 11-49 | ఆర్ద్రకార్తె-అనుకూలవృష్టి |
| ఆషాఢ శు ౪ ఆది 5-7-81 | రా గం 11-21 | పునర్వసు కార్తె-సువృష్టి |
| బ ౨ ఆది 19-7-81 | రా గం 10-56 | పుష్యమికార్తె-అపుడపుడువృష్టి |
| శ్రావణ శు ౨ ఆది 2-8-81 | రా గం 9-46 | ఆశ్లేషకార్తె-సువృష్టితుల్య |
| బహు ౧ ఆది 16-8-81 | సా గం 7-24 | మఘకార్తె-అకడకడ వృష్టి |
| భాద్రపద శు ౧ ఆది 30-8-81 | ప గం 3-22 | పుబ్బకార్తె-సామాన్యవృష్టి |
| శు ౧౪ ఆది 13-9-81 | ప గం 9-12 | ఉత్తరకార్తె-సాధారణవృష్టి |
| బ ౧౩ శని 26-9-81 | రా గం 12-42 | హస్తకార్తె-స్వల్పవృష్టి తుల్య |
| ఆశ్వయుజ శు ౧౨ శని 10-10-81 | ప గం 1-35 | చిత్తకార్తె-అతివృష్టి రవి |
| బహు ౧౧ శుక్ర 23-10-81 | రా గం 12-7 | స్వాతికార్తె-సాధారణవృష్టి |
| కార్తిక శు ౯ శుక్ర 6-11-81 | ప గం 8-8 | విశాఖకార్తె-వాతాధికవృష్టి |
| బహు ౮ గురు 19-11-81 | ప గం 2-14 | అనూరాధకార్తె-సువృష్టితుల్య |

## వర్ష సారాంశము

వత్సరాది ప్రాంతమున సామాన్య వర్షములు పడి క్రమేపియు నెండలు తీవ్రమగును బహుళమున గాలితోగూడిన దభాలు వర్షములు పడును వైశాఖమున రవి-కుజ-బుధ-శుక్రులకు చండవాయు నాడీ వాయునాడీ సంచారములవలన మధ్య మధ్య గాలిదుమారములు రేగినను ఈ మాసమున క్రమేపియు నెండలు తీవ్రమగును జ్యేష్ఠ శుద్ధమున నాడీ సంచారము శుభాశుభ మిశ్రమముగానున్నను తొలకరివానలు ప్రారంభమగును బహుళమున ఆకాశము తరచుగా మేఘ చ్ఛాదితమై యుండును. అన్ని ప్రాంతముల సస్యానుకూల వర్షములు పడును. ఆషాఢ శుద్ధమున దేశమంతట సస్యానుకూల వర్షములుపడి గోదావర్యాదినదులు ప్రవహించును బహుళమున అనావృష్టి యోగ ప్రాబల్యమున్నను సర్వగ్రహములకు శుభనాడీ సంచారములున్న అపుడపుడు మంచివర్షములు కురియును శ్రావణశుద్ధమున పూర్వార్ధము దాటినది లగాయతు సస్యానుకూల వర్షములు కురియుటయేగాక గోదావర్యాది నదులు కూలంకషముగా ప్రవహించును బహుళమున కొన్ని ప్రాంతములవారు వర్షమునకై తహతహలాడుదురు భాద్రపద శుద్ధమున శుక్రేతర గ్రహములకు శుభనాడీ సంచారము కలదు! వర్షయోగాయోగములు సమముగా నున్నందున అపుడపుడు గాలితో కూడిన వర్షములు పడును. ఆశ్వయుజమున శుభాశుభమిశ్ర నాడీ సంచారము శుక్లములో గాలితోకూడిన వర్షములు పడును ఖండాంతరములు తుఫాను సూచనలున్నవి బహుళమునతెరపిగా నున్నను దీపావళి ప్రాంతమున సధిక వర్షములు కురియు సూచనలున్నవి కార్తిక శుక్లమున తెరపిగనున్నను రవి-బుధ-గురు-శుక్రులకు చండవాయు వాయు నాడుల సంచారమువలన పూర్ణిమా ప్రాంతమున ఖండాంతరముల తుఫాను సూచనలున్నవి బహుళమున తెరపిగలిగి వర్షాకాల నివృత్తి చిహ్నలు కనబడును. మార్గశిర శుద్ధమున ఆకాశము మేఘాచ్ఛాదితమై యుండును శుద్ధషష్ఠి ప్రాంతమున వర్షసూచనలున్నవి బహుళమున తెరపిగనుండి క్రమేపియు శీతము(చలి) తీవ్రమగును పౌష శుద్ధమున ఈదరగాలులు వీచు నతిశీతలవ కలిగి అమా ప్రాంతము లో వర్షములు కురియును మాఘశుద్ధమున తెరపిగలిగి బహుళమున మాఘశివరాత్రి వర్షములు కురియును. ఫాల్గుణశుద్ధమున సామాన్య ముగ తెరపిగనున్నను, అమా ప్రాంతమున వర్ష ప్రాంతములలో తటాకములు నిండునట్లు వర్షించును

వర్షసారాంశము - వైశాఖ బహుళ జ్యేష్ఠ శుద్ధములలో తొలకరియగును జ్యేష్ఠాషాఢ మాసములు సస్యానుకూల వర్షములు. శ్రావణము తెరపి భాద్రపదాశ్వయుజ కార్తిక శుక్లములలో అనుకూల వర్షములు కురిసి పద్నాకొండు విధముల పంట ఫలించును మెరక ప్రాంతములు బాగుగా ఫలించును.

శ్లో॥ దుర్మత్యబ్దేఖిలాలోకా భూపా దుర్మతయస్తథా।
అథాపి సుఖినస్సర్వే సంగ్రామాస్సంతివై దధి॥

బార్హస్పత్యమాన భావాబ్ద ఫలమ్

శ్లో॥ వాపీకూప తటాకపూర్తి రతులా స్వస్థాః క్షితీశాక్షితా।
దేవప్పర్జిజన్యైస్సు సస్య నికరై ర్నానావిధై రాకరైః
ధాత్రీభాతి నిరంతరం శుకపిక శ్రీకంఠఘం ప్కోకిల్రాజత్
షట్పదగాన మోదిత వనైర్భావాబ్దే సదా॥

## గు రూ ద యా బ్ద ఫ ల మ్

శ్లో॥ చైత్రాబ్దే భూమిపాః స్వస్థాక్షోణీ చాప్య ఫల్గవా।
మధుర్లభంతేత్ర మాస్సం ప్రజానాం వ్యాధితోభయం॥

తా॥ ఈ సంవత్సరమునకు చాంద్రమాన వశమున "దుర్మతి" అని పేరు బార్హస్పత్య మాన వశమున "భావ" అని పేరు గురూదయ వశమున "చైత్రాబ్ద" మని పేరు అశ్వినీ దేవతాకమగు ఏకాదశ యుగమున నయిదవదగు రుద్ర దేవతాకమగు ఇద్వత్సరమను పేరుగల దుర్మతి నామ సంవత్సరమున రజతదాన మహాఫలము జనులు రాజులు సత్స్వభావములేని వారగుదురు దుర్భిక్షభయము కలిగినను సుఖవంతులగుదురు

భావనామ సంవత్సరఫలం :— భూమి యంతట వాపీకూప తటాకాదు లు జలముంతో నిండును. ప్రభువులు సుఖముగనుందురు. సమస్తసస్య సంపూర్ణముగనుండును. పూలవనములు ఫలవృక్షములు ఫలించి మధురమగు కంఠస్వనముతో శుకపికాద్యారావములతో తుమ్మెద గానము తో చక్కగనుండును

తస్మైతాదృశఫల విజృంభస్య, సమస్త కల్యాణ భాజనస్య శ్రౌతస్మార్తాద్యఖిల క్రియా తంత్ర వ్యవహార హేతు భూతస్య దుర్మతి నామ సంవత్సరస్య

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | రాజా రవిః | 11 | పరీక్షకః బుధః | 21 | నరాధిపతిః రవిః |
| 2. | మంత్రీ చంద్రః | 12 | గణకః శుక్రః | 22 | గ్రామనాయకః బుధః |
| 3 | సేనాధిపతి రవిః | 13. | గ్రామపాలకః చంద్రః | 23. | వస్త్రాధిపతిః శనిః |
| 4. | సస్యాధిపతి గురుః | 14 | దైవజ్ఞః రవిః | 24. | రత్నాధిపతిః చంద్రః |
| 5 | ధాన్యాధిపతి కుజః | 15. | రాష్ట్రాధిపతిః రవిః | 25 | వృక్షాధిపతిః కుజః |
| 6 | అర్ఘాధిపతి రవిః | 16. | సర్వదేశోద్యోగపతిః చన్ద్రః | 26 | జంగమాధిపతిః గురుః |
| 7 | మేఘాధిపతి రవిః | 17. | అశ్వాధిపతిః చంద్రః | 27 | సర్పాధిపతిః శుక్రః |
| 8. | రసాధిపతి శనిః | 18 | గజాధిపతిః గురుః | 28 | మృగాధిపతిః రవిః |
| 9. | నీరసాధిపతి గురుః | 19 | పశునామధిపతిః రవిః | 29. | పక్షాధిపతిః రవిః |
| 10. | పురోహితో గురుః | 20. | దేవాధిపతిః గురుః | 30. | స్త్రీణామధిపతిః రవిః |

రా జ్ఞ స్సూ ర్య స్య ఫ ల మ్

శ్లో॥ అన్యోన్య వైరంస్థితి పాలకానాం నాశ్యంబు ముంచంతి బలాహకాశ్చ।
ఉపాద్రుయం శస్త్రభయం ప్రజానాంలోకే ఉగ్నిబాధాబ్ద పతౌ పతంగే॥

తా॥ ప్రభువు లన్యోన్యము. విరోధముతో నుందురు. స్వల్ప వర్షము. అగ్నిభీతి,

శ్లో॥ సున్నసిట స్వర్వ సస్యానాం ఫలితా వృక్షజాతయః।
క్షేమారోగ్యే సుభిక్షంచ శశాంకే సచివే సతి॥

తా॥ సర్వసస్యానుకూల వృష్టి, వృక్ష జాతులు ఫలింగును క్షేమము ఆరోగ్యము సుభిక్షముగా నుండును.

సేనాధిపతేః సూర్యస్య ఫలమ్

శ్లో॥ అన్యోన్య యుద్ధం ధరణీశ్వరాణాం అల్పా బదా వారి ధరాస్సనారాః
రక్తాని సస్యాని ఫలంతి భూమౌ సైన్యాధిపత్యే దివసేశ్వరస్య॥

తా॥ ప్రభువు లన్యోన్యము యుద్ధ నిరతి కల వారగుదురు మేఘములు గాలిచే నెగురకొట్టబడుచు స్వల్పవర్షముగా వర్షించును ఎర్రని సస్యములు ఫలించు ను

సస్యాధిపతేః గురోః ఫలమ్

శ్లో॥ యావగోధూమ చణకాః ఫలితాస్సుఃసుహీతరే।
సీతధాత్రీ సుఫలితా గురౌ సస్యాదిపే సతి॥

తా॥ యవలు, గోధుమలు, సెనగలు పుష్కలముగ ఫలించును పచ్చని నేలలు ఫలించును

ధాన్యాధిపతేః కుజస్య ఫలమ్

శ్లో॥ ఫలంతి శూకధాన్యాని రక్తధాన్యాని యానిచ।
రక్తభూమిస్సు ఫలితాభౌమే ధాన్యాదిపే సతి॥

తా॥ పొట్టి ధాన్యములు, ఎర్రని ధన్యములు, ఎర్రని నేలలు ఫలించ ను

అర్ఘాధిపతేః సూర్యస్య ఫలమ్

శ్లో॥ రక్తధాన్యార్ఘ వృద్ధి స్స్యద్రక్త మేఘః ప్రవర్షతి।
సూర్యవంశాశ్చ రాజానో జాయన్తే ఉర్ఘాధిపే రవౌ॥

తా॥ ఎర్రని ధాన్యములు ధరవరులు అధివృద్ధి గాంచును ఎర్రని మేఘములు వర్షించును సూర్యవంశ రాజులు కళివృద్ధిగా నుండుదు

మేఘాధిపతేః సూర్యస్య ఫలమ్

శ్లో॥ మహద్భయం ఫలం స్వల్పం వర్షం స్యాత్ఖండ మండలే।
రక్తసస్యం సుఖితం సూర్యే మేఘాధిపే సతి॥

తా॥ భయ మధికము ఫ లము స్వల్పము ఖండవృష్టి ఎర్రని సస్యములు ఫలించ ను

రసాధిపతేః శనేః ఫలమ్

శ్లో॥ తిలమాష కుళుత్థాది కృష్ణధాన్యాని యానిచ।
కృష్ణభూమిస్సు ఫలితా మందే యది రసాధిపే॥

తా॥ నువ్వులు, మినుగులు, ఉలవలు మున్నగునవి నల్లని (సల్గార్ల) ధాన్యములు

సంవత్సరాధిపతేః గురోః ఫలము

శ్లో॥ పూగీ ఫలాన్యఖిల రత్న సువర్ణ ధాన్య కార్పాస చర్మ
కుసుమానిచ చందనంచ। వృద్ధింయయుర్ద్విజగణా
స్సుఖినోభవంతి భూమౌచ నీరసపతౌ సురరాజ పూజ్యే॥

తా॥ పోకచెక్కలు, సమస్త రత్నములు, బంగరము, ధాన్యము, కార్పాసము, చర్మము, పూవులు, మంచి గంధము వృద్ధి పొందును. భూసుర గణము సుఖముగా నుండును

పు రో హి తా ది ఫ ల మ్

శ్లో॥ క్రూరగ్రహే ఫలం క్రూరం శుభగ్రహే ఫలం శుభం।
పురోహితాది సర్వేషాం భవేదీశ సముద్భవం॥

తా॥ పురోహితాదులు క్రూరులగుచో అశుభ ఫలమును, శుభులగుచో శుభ ఫలము నిత్తురు.

సావన వర్షారంభః – ఫలఞ్చ

శ్రీ రౌద్ర నామ సంవత్సర పౌష బ ౭ మంగళవాసరే 27-1-1981 సావన వర్షారంభః।

సావనవర్షాధిపతేః కుజస్యఫలమ్

శ్లో॥ అతి తస్కర రోగాస్స్యుర్నృప విగ్రహతాభృశం।
హతసస్యో బహువ్యాళో భౌమే వృష్టి వినాశనమ్॥

తా॥ చోరభయము రోగభయము రాజభయము, యుద్ధభయము, సస్యవినాశనము. సర్పవృద్ధి కలిగియుండును.

ప శు పా ల కా ది ని ర్ణ యః ఫ ల మ్ చ

అస్మిన్నబ్దే యమః పశుపాలకః। పశుపాలకస్య యమస్య ఫలం॥ అనర్ఘశ్చాల్పవృష్టిశ్చ స్వల్ప క్షీరం తథాగవాం పశుపీడా భవేన్నిత్యం యమేతు పశుపాలకే॥ ధరలధికము స్వల్పవర్షము, గోవులు పాలు తక్కువగా నిచ్చును. నిత్యము పశువులకనారోగ్యము. గోష్ఠప్రాపకః బలరామః। పశువులను దొడ్డిపెట్టువాడు బలరాముడు ఫలము :— సువృష్టి స్సర్వదేశానాం సర్వసస్య సమృద్ధయః। మధ్యదేశే మహద్వర్షం బలరామేతు ప్రాపకే॥ సమస్త దేశములయందు సువృష్టిగా నుండును సమస్త సస్యములు సమృద్ధిగా ఫలించును। మధ్య ప్రదేశమున వర్షభీతి కలుగును॥ గోష్ఠ బహిష్కర్తాయమః। పశువులను దొడ్డినుండి విడిపించువాడు యముడు — ఫలము। అనర్ఘశ్చాల్పవృష్టిశ్చ స్వల్పక్షీరం తథాగవాం। పశుపీడా భవేన్నిత్యం బహిర్కర్తా యమోయది॥ ధరలధికము.స్వల్పవర్షము.గోవులు స్వల్పముగా పాలనిచ్చును. నిత్యము పశువుల కనారోగ్యము కలుగును॥

ఆ ఢ కా ది ని ర్ణ యః ఫ ల మ్ చ

ద్వ్యాఢక పరిమితం వర్షం—రెండు కుంచముల వర్షము ఆఢక ప్రమాణం—॥ షష్టి యోజన విస్తీర్ణం శతయోజన మున్నతం। ఆఢకస్య ప్రమాణంతు దేవమానేన గణ్యతే॥ అస్య విభాగః—దశభాగాస్సముద్రేషు భూధరేషుచ సప్తచ। ద్వౌభాగౌ భువిపర్జన్యశ్చైవం వర్షతిచత్రిధా॥ అస్యహస్తం గతత్వఫలంచ। వత్సరాది ప్రభృతి వైశాఖ శు ౬ శనివారం 9-5-1981 పర్యంతము యౌవనవయో విశిష్ట బ్రాహ్మణ హస్తమందును। తత్ప్రభృతి శ్రావణ బ ౩౦ సోమ బుధవారం 1-7-81 పర్యంతము బాల్య వయోవిశిష్ట బ్రాహ్మణ హస్తమందును। తత్ప్రభృతి ఆశ్వయుజ శు ౧౪ సోమవారము 12-10-81 పర్యంతము యౌవన వయోవిశిష్ట బ్రాహ్మణ హస్తమందును తత్ప్రభృత్యావత్సరము వార్ధక్య వయోవిశిష్ట బ్రాహ్మణహస్తమందును కుంచముండును హస్తం గతత్వఫలం—దుర్భిక్షం బ్రాహ్మణకరే। వయసః ఫలమ్—బాల్యేవృష్టి ర్వినాశస్స్యాద్యౌవనే వృష్టి రుత్తమా। వృద్ధహస్తే సుభిక్షంస్యా దేవంహి వయసః ఫలం॥

మే ఘా ది ని ర్ణ యః ఫ ల ం చ

కాలనామకో మేఘః-కాలమేఘస్తు దక్షిణే-కాలేస్యాదల్పవర్షణం [స్వల్పవర్షము]చతుర్మేఘపక్షే పుష్కరో మేఘః - ఈశాన్యే పుష్కరో మేఘః। పుష్కరాహ్వయ మేఘే స్మిన్ సర్వమూల వినాశనం। (గంధాంతరే-పుష్కరే దక్షిణావృష్టిః। సంవహనామకో వాయుః-సంవహేచ ప్రవృష్టిస్స్యాత్ [స్వల్ప వర్షము] చంచలనామ్నీ విద్యుత్ - చంచలాతు సుభిక్షకృత్ [సుభిక్షము ] అసితనామకంగర్జితం - అసితే చోత్తమావృష్టిః[వర్షమధికము] క్షీరనామక సముద్రః - క్షీరస్తు సలిలవసు[ అగ్నియు]వాసుకి నామకశ్శేషో భూమింవహతి-భూమిస్సిద్ధరా సస్య ఫలాభివృద్ధి రమ్భసిం వహే వాసుకి నామ్ని నాగే॥

వర్ష ధాన్యాది ప్రమాణాని (వింశోపకములు)

వర్షం ౧౩ ధాన్యం ౬ శీతం ౧౩ తృణం ౧౭ ఉష్ణం ౧౬ మారుతః ౭ ప్రజావృద్ధిః ౧౪ నాశః ౧౪ రాజవిద్వరం ౧౧ ఉగ్రం ౪ పుణ్యం౪ పాపం౪ [౧౬] వ్యాధయః౧౩ ఉపశమనం ౪ ఆచారః ౫౧ అనాచారః ౧౪ మరణాని ౭ జన్మాని ౧౬ దేశోపద్రవః ౫౨ దేశస్వాస్థ్యం ౧౪ చోరభయం ౫౨ నా ౭ అగ్నిభయం ౬ నా ౧౩ మృగోపద్రవః ౫౧ నా ౧౭ కీటభయం ౧౬ నా ౧౧ మూషకవృ ౧౧ నా ౫౧ సర్పవృ ౭ నా ౫౨ కామః ౧౭ లోభః ౧౭ మదః ౧౩ మత్సరః ౪ సుఖం ౨౨ దుఃఖం ౧౭ భోగః ౧౭ నిడంబః ౧౪ మనోవ్యథా ౧౪ ద్వేషః ౧౧ ప్రతిష్ఠా ౪ అప్రతిష్ఠా ౧౪ దుర్భిక్షం ౭ ప్రసవః ౭ నరోత్పత్తిః ౪ స్త్ర్యుత్పత్తిః ౧౧ ధాతువాదః ౧౭ భయం ౪ శౌర్యం ౬ దుష్టనిగ్రహః ౧౭ శిష్టపరిపాలనం ౧౭ సత్యం ౫౧ అసత్యం ౭ విశ్వాసః ౬ అవిశ్వాసః ౧౧ దయా ౧౭ నిర్దయా ౧౪ న్యాయః ౧౬ అన్యాయః ౧౬ [౫౧] గోమాయువృ ౬ నా ౭ కీటవృ ౪ నా ౧౧ శలభవృ ౧౧ నా ౭ మశకవృ ౩ నా ౩ వృశ్చికవృ ౪ నా ౪ వ్యాఘ్రవృ ౩ నా ౭ [౧౧] సస్యవృ ౪ నా ౯ శుకవృ ౭ నా ౯ పికవృ ౪ నా ౭ కుక్కుటవృ ౮ నా ౮ [౬] ఖగవృ ౮ నా ౯ గోవృ ౪ నా ౯ మహిషవృ ౫ నా ౩ మృగవృ ౯ నా ౩ ఛాగవృ ౯ నా ౫ అశ్వవృ ౩ నా ౫ గజవృ ౮ నా ౮ ఉష్ట్రవృ ౪ నా ౪ విప్రవృ ౯ నా ౪ క్షత్రియవృ ౩ నా ౯ వైశ్యవృ ౯ నా ౩ శూద్రవృ ౫ నా ౮ మ్లేచ్ఛవృ ౪ నా ౮ సంకరవృ ౮ నా ౫ వజ్రవృ ౮ వైడూర్యవృ ౯ గోమేధికవృ ౩ పుష్యరాగవృ ౮ మరకతవృ ౪ మాణిక్యవృ ౧ నీలవృ ౧ మౌక్తికవృ ౧ ప్రవాలవృ ౧[౯] సువర్ణవృ ౮ రజతవృ ౮ తామ్రవృ ౮ కాంస్యవృ ౧౫ లోహవృ ౧౮ అయోవృ ౧౫ త్రపువృ ౧౦ సీసవృ ౯ [౧౮] జ్ఞానం ౧౭ అజ్ఞానం ౧౪ కాపట్యం ౧౩ నిష్కాపట్యం ౬ ధార్మికత్వం ౧౭ అధార్మికత్వం ౧౬ [౧౬] విద్యుత్౪ శిలాపాతః౮ గర్జితం ౩ స్వప్నం ౮ సుషుప్తిః౮ జాగ్రత్౮ (౧౮) అండజవృ ౧౩ నా ౬ స్వేదజవృ ౧౩ నా ౧౭ ఉద్భిదవృ ౧౬ నా ౭ జరాయుజవృ ౧౪ నా ౧౪ స్థావరవృ ౧౧ నా ౪ జంగమవృ ౪ నా ౪ [౧౬] వ్రీహివృ ౯ శాలివృ ౧౮ కలత్థవృ ౧౮ తిలవృ ౮ మాషవృ ౧౮ ముద్గరవృ ౧౯ సర్షపవృ ౮ చణకవృ ౧౦ ఆఢకవృ ౮ గోధూమవృ ౧౫ కోద్రవవృ ౮ ప్రియంగువృ ౧౦ యవవాలవృ ౧౫ శ్యామాకవృ ౯ రాజమాషవృ ౧౮ నీవారవృ ౧౯ శింబిధాన్యవృ ౧౫ [౧౮] అతివృష్టి ౬ అనావృష్టి ౪ సస్యనాశకవృ ౬ శలభవృ ౧౬ శుకవృ ౧౩ స్వచక్రభయం ౧౧ పరచక్రభయం ౧౬ (౧౬) క్షుత్ ౭ తృష్ణా ౩ నిద్రా ౧౩ ఆలస్యం౪ ఉద్యోగః ౭ శాంతిః ౧౧ క్రోధః ౧౩ దంభః ౩ మిత్రభేదః ౧౪ క్షమా ౪ ఋణనివృత్తిః ౭ ఫలనివృత్తిః ౧౧ ఉత్సాహః ౬ ప్రాణిసౌఖ్యం ౧

